## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010006911



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan, CMU-Books, Sanskrit, TTD,Tirupathi, Kerala Sahitya Akademi | INSA | Times of India, Indian Express, The Hindu, Deccan Herald, Eenadu, Vaartha | Tamil Heritage Foundation, AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ప్రపంచ చరిత్ర

(ఐదవ భాగము)

జవహర్‌లాల్ నెహ్రూ

రచన

చింతా దీక్షితులు

అనువాదం

సంస్కృతి ప్రచురణ

(43)



## రచయిత

జననం 1889. కాశ్మీర బ్రాహ్మణులు. తండ్రి మోతీలాల్ నెహ్రూ. ప్రఖ్యాత న్యాయవాది. తల్లి స్వరూపరాణి. జన్మస్థానం ప్రయాగ-అలహాబాద్. ఇంటివద్ద కొంతకాలం ప్రైవేటు చదువుకొని హారోలో, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలోని ట్రినిటీ కళాశాలల్లో విద్య నభ్యసించారు. అలహాబాద్ హైకోర్టులో న్యాయవాదిగా జీవితాన్ని ప్రారంభించారు. 1918లో ఇండియన్ హోమ్‌రూల్ లీగుకు కార్యదర్శి అయినారు. 1918 నుంచి అఖిలభారత కాంగ్రెస్ సభలో సభ్యులుగానున్నారు. 1921 లో మొదటిసారి కారాగృహ వాసా న్ననుభవించారు. ఇప్పటికి ఎనిమిది మారులు శ్రీకృష్ణజన్మస్థానాన్ని చూచివచ్చారు. 1929 లో కాంగ్రెస్ కార్యదర్శి అయినారు. 1930 లోను 1936, 37, 46 లలోనూ కాంగ్రెస్ అధ్యక్షులయినారు. 1950 నుంచి మరల నేటివరకు కాంగ్రెస్ అధ్యక్షులుగానే వున్నారు. వివాహితులు. భార్య-కమలా నెహ్రూ చనిపోయింది. కొడుకులు లేరు. ఒక్కతే కుమార్తె-ఇందిరా గాంధీ. చెల్లెండ్రిద్దరు-విజయలక్ష్మి పండిట్, కృష్ణ హాతీసింగ్.

ఈయన గొప్ప ప్రజాస్వామ్యవాది. ఆంగ్లంలో అనేక గ్రంథాలను రచించారు. వీరి రచనలలో 'సోవియట్ రష్యా', 'ప్రపంచ పరిణామము'లను మాప్రచురణలలో ప్రచురించియున్నాము. నేడు (1953) ఇండియా ప్రధానిగా నున్నారు.

విలాసము : 17, యార్క్ రోడ్డు, న్యూ ఢిల్లీ.

# విషయసూచిక

# పటములు

పటము | పుట
--- | ---

108

# పందొమ్మిదో శతాబ్దిని గురించి ఇంకా ఇతర విషయాలు

నవంబరు 24, 1932

పందొమ్మిదో శతాబ్దియొక్క కొన్ని విశిష్టలక్షణములను గురించీ. మహాయంత్రాగమనముతో పడమటి యూరోప్పన ప్రవేశించిన పారిశ్రామిక ధనికపద్ధతి (Industrial Capitalism) వల్ల గలిగిన అనేక ఫలితములను గురించీ వెనుకటిజాబులో నేను తెలిపియుంటిని. పడమటి యూరోపు పురోగమించుటకొక కారణము దానికి బొగ్గు పొరలును, ఖనిజరూపమున ఇనుమును ఉండుటయే. మహా యంత్రములు నిర్మించుటకును, అవి పనిచేయుటకును నేలబొగ్గు, ఇనుము ఆవశ్యకము.

ధనికపద్ధతి, సామ్రాజ్యవాదమునకునూ, జాతీయతకునూ దారితీసినదని తెలిసికొంటిమి. జాతీయత ఇప్పుడు కొత్తగా వచ్చినదికాదు. ఇదివరకున్నదే. ఇప్పుడది తీవ్రరూపము ధరించి సంకుచితమైనది. అది మనుష్యులను దగ్గిరగానూ చేర్చింది, విడదీసిందికూడా. ఒకేదేశములోనున్నవారు దగ్గరగావచ్చారు. ఇతర దేశములవారితో నానాటికీ సంబంధములు తెగినవి. ప్రతీ దేశములోనూ దేశభక్తి విజృంభించింది. కాని దానితోపాటు పరదేశులపై అపనమ్మకమూ, ద్వేషమూ ప్రబలినవి. యూరోపులో పారిశ్రామికముగా వృద్ధినందిన జాతులు అడవిమృగములవలె ఒకరినొకరు చూచుకోమొదలుపెట్టారు. ఇంగ్లాండు ఇతర దేశములకంటె అధికముగా దేశములను కొల్లగొట్టి యుండుటచేత దానిని నిలుపుకోగోరింది. కాని ఇతర దేశములు—అందు ముఖ్యముగా జర్మనీ—ఇంగ్లాండు అంతటా ప్రబలమైయుండుట సహించలేదు. కాన వైషమ్యములు పెరిగి యుద్ధములోనికి దిగినవి. పారిశ్రామిక ధనికపద్ధతియొక్కయు, దాని

ననుసరించి వచ్చిన సామ్రాజ్యవాదముయొక్కయు నిర్మాణము ఇష్టి సంఘర్షణకునూ, యుద్ధమునకునూ దారితీయును. సంఘర్షణ మీదను, పోటీ మీదను, స్వార్థోపయోగము మీదను అవి ఆధారపడి యుండుట చేత పరస్పర విరుద్ధలక్షణములు వాటిలో నుండెను. ఈ విరుద్ధలక్షణము లకు సామరస్యమెన్నటికీ కుదరదు. కావుననే ప్రాచ్యమందు సామ్రాజ్య వాదము ననుసరించివచ్చిన జాతీయత దానికి ప్రబలశత్రువైనది.

పరస్పర విరుద్ధలక్షణములున్నప్పటికీ పారిశ్రామిక ధనికపద్ధతి అనేక మంచి విషయములను నేర్పినది. అది కార్యనిర్మాణపై ఖరిని (Organisation) నేర్పినది. మహాయంత్రమును, పెద్ద పెట్టున నడుప బడు పరిశ్రమలును సమర్థముగా పనిచేయవలెనంటే కార్యనిర్మాణ మవసరము. పెద్ద వ్యవహారములు నిర్వహించుటకు సహకార మవసర మని అది నేర్పినది. సమర్థముగా పనిచేయుట, సకాలములో పనిచేయుట అను విషయములను నేర్పినది. పెద్ద ఫ్యాక్టరీలనుగాని, రైల్వేలనుగాని నడుపుటకీ లక్షణములుండవలెను. ఇవి పాశ్చాత్య దేశములవారి విశిష్ట లనిన్నీ, ప్రాచ్య దేశములవారి కీలక్షణములు లేవనిన్నీ ఒక్కొక్కప్పుడు చెప్పుతూ ఉంటారు. ఈ విషయములోనూ, ఇతర విషయములనేకము లోను ప్రాక్పశ్చిమ భేదములు లేవు. పారిశ్రామిక పరివర్తనము కారణ ముగా ఈ లక్షణములు వృద్ధి నందినవి. పాశ్చాత్య దేశములు పారిశ్రా మిక మగుటవల్ల ఈ లక్షణములు తద్దేశవాసులకున్నవి. ప్రాశ్చదేశ ప్రజలింకను సేద్యము నాధారముగా చేసికొనుటవల్లను, పరిశ్రమలం దింకను ప్రవేశింపక పోవుటచేతను ఈ లక్షణములు వారిలో కొరత పడ్డవి.

పారిశ్రామిక ధనిక పద్ధతి వేరొక మేలును చేకూర్చినది. మహా యంత్రసహాయముతోనూ, నేలబొగ్గు నీటి ఆవిరుల సహాయముతోనూ భాగ్యోత్పత్తి ఎట్లు చేయవచ్చునో అది చూపింది. ప్రపంచమునందున్న ప్రజలకందరికీ అందవలె పదార్థములు చాలవుగనుక బీదజనులనేకు లెల్ల

ప్పుడూ ఉండితీరవలసినదే అనే సిద్ధాంతము రద్దు అయినది. విజ్ఞాన శాస్త్రము, యంత్రములు—వీటి సహాయమున ప్రపంచమందలి జనులందరికీ కావలసినంత తిండీ, బట్టా, ఇతర అవసర పదార్థములూ ఉత్పత్తి చేయవచ్చును. క్రియారూపమున కాకున్నా ఉత్పత్తి సమస్య ఈ విధముగా పరిష్కరింపబడ్డది. అంతే. అది కార్యరూపమందలేదు. పుష్కలముగా భాగ్యోత్పత్తి అయినమాట వాస్తవమేకాని బీదలు బీదలుగానే ఉండిపోయారు. నిజమున కంతకన్న బీదవారైనారు. యూరోపియనుల అధికారమునందున్న ప్రాచ్య దేశములలోనూ, ఆఫ్రికాలోనూ స్వార్థము కొరకు ప్రజలను కొల్లగొట్టుట నిశ్శంకగా జరిగింది. దురదృష్టవంతులగు తద్దేశవాసుల బాగోగులు చూచేవారెవరూ లేరు. పడమటి యూరోపులో సైతము దారిద్ర్యము నిలిచెను. అది నానాటికీ స్ఫుటమగుచుండెను. మిగత ప్రపంచమునంతనూ స్వార్థమున కుపయోగించుకొనుట వల్ల పడమటి యూరోపుకు ధనము చేజిక్కెను. పైనున్న ఏ కొద్దిమందికో ఈ ధనములో అధికభాగము చిక్కెను. బీదవారి పాలబడినది బహు కొద్ది. అయినా వారి బ్రతుకు కొంత బాగుపడ్డది. జనసంఖ్య కూడ వృద్ధి యైనది.

ఈ భాగ్యమునకునూ, బీదవారి బ్రతుకు బాగుపడుటకునూ కారణము—పారిశ్రామికముగా వృద్ధినందని ఆసియా, ఆఫ్రికాజనుల నోరు కొట్టుటయే. ఇతర దేశములను స్వార్థమున కుపయోగించుకొనుట, ధన ప్రవాహము తమ దేశములలోనికి ప్రవహించుట—అనునవి కొన్నాళ్ళపాటు ధనిక పద్ధతియొక్క పరస్పర విరుద్ధలక్షణములను మరుగుపరచినవి. అయినా బీదవారికిని, భాగ్యవంతులకును మధ్యనున్న భేదము పెరిగినది. వారి మధ్య దూరము హెచ్చైనది. రెండు భిన్న జాతులు, ప్రత్యేకజాతులు అయినవి. 19 వ శతాబ్దిలోనున్న ఇంగ్లాండులోని గొప్ప రాజ్యతంత్రజ్ఞుడు, బెంజమిన్ డిస్రారీ అనువాడు వారినిట్లు వర్ణించెను—

> "రెండు జాతులు; ఈ రెంటికీ సంబంధములేదు, సాను భూతిలేదు. ఒకరి అలవాట్లు, ఊహలు, భావములు ఇంకొకరికి తెలియవు. రెండు భిన్న మండలములలోనో, రెండు భిన్న గ్రహములలోనో వసించువారివలె నుండిరి. వారి బ్రతుకులు వేరు, తిళ్లువేరు, సంప్రదాయములువేరు. వారిని శాసించే చట్ట ములువేరు ...వీరు భాగ్యవంతులూ, దరిద్రులూ."

పరిశ్రమలను పురస్కరించుకొని వచ్చిన నూతన పరిస్థితుల కనుగుణముగా అనేకమంది కార్మికులు పెద్ద ఫ్యాక్టరీలలో ప్రవేశించిరి. ఇట్లు ఒక కొత్త తరగతి పొడ చూపినది. ఇది ఫ్యాక్టరీ కార్మికుల తర గతి. వీరికినీ, కర్షకులకునూ అనేక భేదములుండెను. కర్షకుడు చాలా వరకు ఋతువులమీదా, వర్షపాతముమీదా ఆధారపడవలసియుండును. అవి అతని స్వాధీనములో లేవు. తన దుఃఖమునూ, దరిద్రమునూ మానవున కతీతమైనశక్తులవల్ల కలుగుచున్నవని అతడు భావించ మొదలు పెట్టును. అతనిలో మూఢ విశ్వాసము పొడగట్టును. ఆర్థిక కారణముల నత డుపేక్షించును. తాను తప్పించుకోలేని దుష్టవిధి చేతులలో చిక్కి ఉత్సాహరహితమగు శుష్క జీవనమునతడు గడుపును. ఫ్యాక్టరీ కార్మికు డన్ననో యంత్రములతో అతడు పనిచేయును. ఇవి మనుష్యుడు చేసిన యంత్రములు. ఋతువులతోగాని, వర్షపాతముతోగాని సంబంధము లేకుండా అతడు వస్తువులను తయారుచేయును. అతడు భాగ్యమును పండించును. కాని ఈ భాగ్యము చాలావరకు ఇతరులకు పోవుననిన్నీ, తాను దరిద్రుడుగానే ఉండవలెననిన్నీ అతడు గ్రహించెను. ఆర్థిక చట్టములు క్రియారూపమున ఎట్లు అమలులో నున్నవో అతడు కొంత గ్రహించగలడు. కాబట్టి మానవాతీత కారణములు అతని బుద్ధికి తట్టవు. కర్షకునివలె అతడంత మూఢ విశ్వాసము కలవాడుకాడు. తన దరిద్రము నతడు దేవుళ్ళ కంటగట్టడు. అతడు తప్పుపట్టేది సంఘమును. తాను చేసిన కష్టమునకు ఫలితముగా వచ్చిన లాభములలో అమిత భాగము

కొట్టుకొనిపోవు ఫ్యాక్టరీ యజమానియైన పెట్టుబడిదారు నతడు తప్పు పట్టును. ప్రజలలో వివిధ తరగతులున్నవనే బుద్ధి అతనికి కలుగును. పై తరగతులవారు తమ తోడివారి నోరు కొట్టి తినుచున్నారని గ్రహించును. ఇందువల్ల అసంతుష్టి కలుగును. తిరుగుబాటు సంభవించును. మొదటి రోజులలో ఈ అసంతుష్టి అస్పష్టముగానుండును. మొదటి రోజులలో తిరుగుబాటు అవిచారపూర్వకముగా జరుగును. అజ్ఞానముతో జరుగును. అట్టి తిరుగుబాటు దుర్బలముగానుండుటచేత ప్రభుత్వముచే త్వరలో అణచివేయబడును. ఈ ప్రభుత్వమే పెద్ద ఫ్యాక్టరీలను, వాటిని బట్టి వచ్చిన సంస్థలను నడిపించు మధ్య తరగతుల శ్రేయస్సును కాపాడుటకు పూర్తిగా ప్రాతినిధ్యము వహించియుండును. కాని చిరకాలము పాటు ఆకలి మొరల నణచివేయుట సాధ్యముకాదు. కార్మికుడు, తోడి కార్మికులతో సంఘముగాకూడి బలము పోసుకొనును. కార్మికుని రక్షించుటకును, అతని హక్కులకై పోరాడుటకును కార్మిక సంఘములిట్లు (Trade Unions) తలయెత్తును. కార్మికులు సంఘముగా చేరుట ప్రభుత్వమంగీకరించదు. కాబట్టి మొట్టమొదట అవి రహస్యసంఘములుగా పనిచేయును. ప్రభుత్వము, తరగతి—ప్రభుత్వమనిన్నీ (Class government) తాను ప్రాతినిధ్యము వహించిన తరగతిని అన్నివిధాలా కాపాడడానికది పూనుకొంటున్నదనీ నానాటికీ విశదమౌచున్నది. చట్టములుకూడా తరగతి—చట్టములే (Class laws). మెల్లమెల్లగా కార్మికులకు బలము చేకూరింది. వారి కార్మిక సంఘములు ప్రబలమైన సంస్థలైనవి. వివిధ రకముల కార్మికులు తాము పొందగోరు ప్రయోజనము లొక్కటేయని గ్రహించిరి. అధికారములోనుండి తమచే కష్టము చేయించి బాగుపడుచున్న తరగతి ప్రజలకు తాము వ్యతిరేకముగా పని చేయవలెనని గ్రహించిరి. కాన వివిధ కార్మికసంఘములు సహకరించుటకు ప్రారంభించును. ఒక దేశములోనున్న ఫ్యాక్టరీ కార్మికులందరూ కలిసి కట్టుదిట్టమైన సంస్థగా ఏర్పడును. తరువాత జరుగవలసినపని

వివిధ దేశములందలి కార్మికు లేకమగుట. ఇందుకు కారణము అందరికినీ సమానాశయములుండుటా, సమాన శత్రువునెదుర్కొనుటా. అందువల్లనే "ప్రపంచ కార్మికులందరూ ఏకముకావలెను" అనే కోరికపుట్టును. అందువల్లనే అంతర్జాతీయ కార్మిక సంస్థలు ఏర్పాటు చేయబడినవి. ఇది ఇట్లుండగా ధనికవర్గమువారి పరిశ్రమలున్నూ వృద్ధినందుచుండును. అవిన్నీ అంతర్జాతీయమగును. ఇట్లు పారిశ్రామిక ధనికపద్ధతి ఉన్నచోటులందెల్ల కార్మిక వర్గము ధనికవర్గము నెదుర్కొనును.

నేను చాలా ముందుకు వచ్చాను. మరల వెనుకకు పోవలెను. ఈ 19వ శతాబ్దమునాటి ప్రపంచములో పరస్పర విరుద్ధములైన ప్రవృత్తులనేకము కలగాపులగముగా ఉన్నవి. అన్నిటినీ ఒక్కమారు మనస్సులో పెట్టుకొనుట కష్టము. ధనికవర్గపద్ధతి, సామ్రాజ్యవాదము, జాతీయత, అంతర్జాతీయత, భాగ్యము, దరిద్రము—ఈ వింత మిశ్రమమునుగురించి నీవేమనుకొంటున్నావో? అయితే జీవితమే ఒక వింత మిశ్రమము. దానిని ఉన్నదున్నట్లు మనము గ్రహించి దానిని అర్థము చేసుకొనుటకు ప్రయత్నించాలి. పిమ్మట దానిని బాగుచేయుటకు ప్రయత్నించాలి.

ఒకదానితో ఒకటి పొందని ఈ కలగాపులగమును గురించి యూరోపు, అమెరికాలలోని పలువురు ఆలోచించ మొదలుపెట్టారు. నెపోలియన్ పతనానంతరము, ఈ శతాబ్దము మొదటి రోజులలో, ఏ యూరోపియన్ దేశములోనూ స్వేచ్ఛ లేదనే చెప్పవలెను. కొన్ని దేశములలో రాజు నిరంకుశత్వము నెరపుచుండెను. ఇంగ్లాండువంటి మరికొన్నింట కులీనులైన భాగ్యవంతులు కొందరు అధికారములో ఉండిరి. నేను ఇదివరలో చెప్పినట్లు అంతటా అభివృద్ధి సూచకములగు భావములు తలయెత్తకుండా అణచివేయబడినవి. అయినప్పటికీ అమెరికన్, ఫ్రెంచి విప్లవములు ప్రజాస్వామిక భావములనూ, రాజకీయ స్వాతంత్ర్య భావములనూ అందరికీ వెల్లడిచేసినవి. అభివృద్ధిపరుచు భావములను మెచ్చుకొనేటట్లు చేసినవి. రాజ్యముయొక్కయు, ప్రజల

యొక్కయు కష్టములను గట్టెక్కించడానికి ప్రజాస్వామికమొక్కటే మార్గమని అందరూ భావించ మొదలుపెట్టారు. ఎవ్వరికిని ప్రత్యేకపు హక్కులుండరాదనుట ప్రజాస్వామికముయొక్క ఆదర్శము. సాంఘికము గానూ ప్రతిఒక్కనికీ ప్రభుత్వమువారు ఒక్కటే విలువను ఇయ్యవలెను. ప్రజలు అనేక విధములుగా భిన్నులై యుండుమాట వాస్తవమే. కొందరితరులకన్న బలాఢ్యులు, కొందరు మేధావంతులు, కొందరు పరోపకార శీలులు. కాని ప్రజాస్వామిక వాదపక్షపాతులు చెప్పేదేమనగా—ప్రజలలో ఎట్టి తేడాలున్నప్పటికినీ రాజకీయముగా వారందరికీ ఒకే తాహతు ఉండవలెనని. ఇది సాధ్యమగుటకు మార్గము ప్రతీవారికీ వోటు ఇచ్చుటయే. రాజకీయ వేత్తలున్నూ, మితవాదులున్నూ ప్రజాస్వామికము అన్ని విధములా శ్రేయస్కరమని నమ్మియుండిరి. దానిని ప్రవేశపెట్టుటకు శాయశక్తులా ప్రయత్నించిరి. సాంప్రదాయకులున్నూ (Conservatives), ప్రతికూలురున్నూ (Reactionaries) వారికి ప్రతికక్షులైరి. ప్రతీచోటా కలహములు తటస్థించెను. కొన్ని దేశములలో విప్లవములు వచ్చెను. పార్లమెంటుకు సభ్యులను ఎన్నుకొనుటకు వోటు నిచ్చు అధికారము ఇంకను మరికొందరు ప్రజలకు సంక్రమింప జేయడానికి ముందు ఇంగ్లాండులో అంతఃకలహము తటస్థించేటట్లు ఉండెను.

క్రమేణా, చాలా ప్రదేశములలో ప్రజాస్వామికము విజయము పొందింది. శతాబ్దాంతమునకు వచ్చేసరికి పడమటి యూరోపులోనూ, అమెరికాలోనూ చాలామంది ప్రజలకు వోటు నిచ్చు అధికారమువచ్చింది. పంధొమ్మిదవ శతాబ్దికి ప్రజాస్వామికము ఆదర్శముగా ఉండెను. కాన దానిని ప్రజాస్వామిక శతాబ్దమని చెప్పవచ్చును. చివరకు ప్రజాస్వామికము నెగ్గినది. కాని ఈ చివరకు వచ్చేసరికి ప్రజలకు దానిపై విశ్వాసము తగ్గుటకు ప్రారంభమైనది. అది దారిద్ర్యమునూ, దుఃఖమునూ, పెట్టుబడి పద్ధతినుండి వచ్చిన అన్యోన్య వ్యతిరేక ఫలములనూ తుదముట్టించ లేకపోవుట వారు గ్రహించారు. ఆకలితో బాధపడేవానికి వోటువల్ల

ప్రయోజనమేమిటి? అతని వోటును గాని. అతడు చేయగల సేవను గాని పట్టెడన్నము ఖరీదుకు కొనగలిగి ఉంటే అతనికుండే స్వేచ్ఛ ఎంతమట్టుకు? కాన ప్రజాస్వామికము ప్రజామోదమును గోల్పోయింది. ఇంకా సరిగా చెప్పవలసివస్తే రాజకీయ ప్రజాస్వామికమును ఎవరునూ మెచ్చుకొనకుండిరి. కాని ఇది పందొమ్మిదో శతాబ్దము తరువాతి విషయము.

స్వాతంత్ర్యముయొక్క రాజకీయాంశమును గురించియే ప్రజాస్వామికము తెల్పును. నిరంకుశ పాలనములకు అది ప్రతిక్రియ. అప్పుడే తలయెత్తుచున్న పారిశ్రామిక సమస్యలను అది పరిష్కరించలేదు. దారిద్ర్యమునది తొలగించలేదు. ప్రజాతరగతులలోని వైషమ్యములనది తుదముట్టించలేదు. తన ఇష్టమువచ్చినట్లు తాను చేయుటకు ప్రతీ వ్యక్తికీ —క్రిమలోగాకున్నా—స్వాతంత్ర్యమున్నది అని అది చెప్పును. ఇట్టి స్వాతంత్ర్యముండుటవల్ల ఆత్మలాభాపేక్షతో ప్రతి వ్యక్తియూ అన్ని విధాలా తాను బాగుపడుటకు ప్రయత్నించుననినీ్న, ఈ విధముగా సంఘమభివృద్ధి చెందవచ్చుననీ అది చెప్పును. దీనినే "లేసేఫేర్" సిద్ధాంతమందురు. వెనుకటి జాబులో దీనినిగురించి నీకు వ్రాసియున్నాను. కాని వ్యక్తి స్వాతంత్ర్యమనే సిద్ధాంతము పనిచేయలేదు. కారణము—కూలికి పనిచేసి తీరవలసిన మనిషికి స్వాతంత్ర్యమెక్కడ ఉంటుంది?

పారిశ్రామిక ధనిక పద్ధతివల్ల వచ్చిన గొప్పచిక్కు ఏమిటంటే- సంఘము కోసము కష్టపడి పనిచేసి ఆ విధంగా దానికి సేవచేస్తూన్న వారికి జీతములు తక్కువ. పని చెయ్యనివారికి లాభములన్నీ పోవుచుండెను. కాన చేసే పనికీ, వచ్చే లాభములకూ సంబంధము లేకుండెను. దీనికి ఫలితము—కష్టించి పని చేసేవారికి దారిద్రమూ, న్యూనతా కలగడమున్నూ; ఎట్టిపనీ చేయకుండా, పరిశ్రమలను భాగ్యవంతముగా చేయుటకు ఏ విధంగానూ ప్రయత్నించకుండా, ఆ పరిశ్రమల నాధారము చేసికొని బ్రదికే—ఒక తరగతి ప్రజలను తయారు చేయడమున్నూ. ఇది

భూమినిదున్ని పని చేసే రైతులు ఒకతట్టునా, భూమిమీద పనిచేయ కుండా రైతుల కష్టములనుబట్టి లాభములు తీసే జమీందారు ఒకతట్టునా ఉన్నట్లున్నది. ఇట్టి లాభముల పంపకము చూడడంతోనే అన్యాయమని తెలుస్తుంది. ఇంతేకాదు. చిరకాలమునుంచి బాధపడే రైతువలెగాక కార్మికుడు తన కన్యాయము జరుగుతూన్నట్లు భావించాడు. ఇట్లుండ రాదని చెప్పాడు. కాలము గడచినకొద్దీ పరిస్థితులు పాడైపోయినవి. పారిశ్రామికమైన పాశ్చాత్య దేశములందంతటా ఈ హెచ్చు తగ్గులు విస్పష్టంగా కనిపిస్తూన్నవి. ఉత్సాహ పూరితులగు బుద్ధిమంతులు ఈ చిక్కునుండి తప్పించుకొనే మార్గం కనిపెట్టడానికి ప్రయత్నించారు. ఈ విధముగా ధనిక పద్ధతినుండి వచ్చి దానికి విరోధముగా ఉన్న సామ్య పద్ధతి (Soicalism) తలయెత్తింది. ఇది బహుశా ధనికపద్ధతి స్థానము నాక్రమించుకోగలదు అని తోస్తుంది. ఇంగ్లాండులో ఇది మితరూపమున నుండెను. ఫ్రాంసు, జర్మనీలలో ఇది విప్లవరూపము ధరించెను. అమెరికా సంయుక్త రాష్ట్రములలో ధనికపద్ధతివల్ల కలిగిన అన్యాయములూ, కష్టములూ చాలాకాలమువరకూ, పడమటి యూరోపునందువలె, స్ఫుటముగా కనబడలేదు. అది పెద్దదేశము. జనసంఖ్య తక్కువ. వృద్ధి అగుటకు దానికి సావకాశము బాగుగా ఉన్నది. అందువల్ల ఈ తేడా లక్కడ అంతగా కనిపించలేదు.

పందొమ్మిదో శతాబ్ది మధ్యకాలమున జర్మనీలో ఒక పురుషుడుదయించెను. అతడు సామ్యపద్ధతికి(Socialism) ప్రవక్త కానుండెను. సామ్యపద్ధతియొక్క ఒక రూపమైన కమ్యూనిజమునకు అతడు జనకుడు కానుండెను. అతని పేరు కారల్ మార్క్సు. శాస్త్ర సిద్ధాంతాలను చర్చించే ఆచార్యుడుగాని, అస్పష్ట విషయములను చర్చించే తత్త్వవేత్త గాని కాడాతడు. ఆచరణ రూపములో పెట్టదగ్గ సిద్ధాంతములను బోధించే తత్త్వవేత్త అతడు. రాజకీయ, ఆర్థిక సమస్యలనాతడు నూతన విజ్ఞాన శాస్త్రపద్ధతుల ప్రకారము పరిష్కరించి తన్మూలముగా ప్రపంచ ప్రజల

కష్టములు తొలగించడానికి మార్గము కనిపెట్ట పూనుకొన్నవాడు. "తత్త్వ శాస్త్రము ఇంతదనుక ప్రపంచమును విశదీకరించెను. కమ్యూనిస్టు తత్త్వ శాస్త్రము దానిని మార్చుటకు ఆసించవలెను"—అని అతడు చెప్పెను. ఏన్‌జల్సు అను వానితోచేరి మార్క్సు "కమ్యూనిస్టు మానిఫెస్టో"ను ప్రకటించెను. ఆ తత్త్వ శాస్త్రముయొక్క సంగ్రహ మందున్నది. తరువాత అతడు జర్మన్ భాషలో"దాస్ కాపిటల్" లేదా "కాపిటల్"అనే ఉద్గ్రంథమును ప్రకటించెను. శాస్త్ర విధానముచొప్పున అతడు ప్రపంచ చరిత్రను పరామర్శచేసెను. సంఘము యే దిక్కుగా అభివృద్ధి చెందుచున్నదియు అతడు చూపెను. ఈ కార్యము తొందరగా జరుగుటకై పద్ధతులను సూచించెను. మార్క్సు తత్త్వమును నీ కిక్కడ విశదీకరించ తలచ లేదు. కాని మార్క్సు వ్రాసిన ఉద్గ్రంథము సామ్య పద్ధతి వృద్ధియగుటకు అమితముగా తోడ్పడెననియు. ఈనాడది కమ్యూనిస్టు రష్యాకు బైబిలువంటి పవిత్ర గ్రంథమైనదనియు నీవు జ్ఞాపకముంచుకోవలెను.

ఈ శతాబ్ద మధ్య భాగమున ఇంగ్లాండులో ప్రచురింపబడిన వేరొక ప్రసిద్ధగ్రంథము "ఉపజాతుల ఉత్పత్తి" (Origin of species) అనునది. దానికర్త డార్విన్. అది ప్రజలలో అలజడి కలిగించెను. డార్విన్ ప్రకృతిని—అందు ముఖ్యముగా వృక్షములను, జంతువులను పరిశీలించి ఆ విషయములను గురించి జ్ఞానమార్జించినవాడు. అనేక దృష్టాంతముల సహాయముతో అతడు వృక్షములున్నూ. జంతువులున్నూ ఎట్లు వృద్ధి చెందినవో, నైసర్గిక వరణము (Natural selection) ననుసరించి ఒక ఉపజాతి వేరొక ఉపజాతిగా మారినదో, సూక్ష్మరూపములు గల ప్రాణులెట్లు సంశ్లేషరూపములు గల ప్రాణులుగా మారినవో అతడు చూపెను. విజ్ఞాన శాస్త్రసిద్ధమగు ఇట్టి హేతువాదము—ప్రపంచ సృష్టిని గురించియు, మానవుని సృష్టివాదము గురించియు, మృగసృష్టిని గురించియు మతము చెప్పు విషయములకు వ్యతిరేకముగా ఉండెను. అప్పుడు విజ్ఞాన శాస్త్రజ్ఞులకును, మతబోధల నమ్మువారికిని వాదోప వాదములు

తటస్థించెను. నిజమగు వివాదము యదార్థ విషయములకు సంబంధించి నది కాదు. జీవనము విషయమున అవలంబించు చిత్తవృత్తికి సంబంధించినది. మతమునకు సంబంధించిన చిత్తవృత్తి వైఖరి భయముతోనూ, మూఢవిశ్వాసములతోను, మతములతోను కూడుకొని ఉండెను. హేతువాదమునకు ప్రోత్సాహములేదు. చెప్పిన విషయములను విశ్వశించవలసినదే కాని అందుకు కారణములడుగరాదు. అనేక విషయములు పవిత్రమని చెప్పి వాటిని ఆచ్ఛాదించి మరుగుగా ఉంచేవారు. ఈ ఆచ్ఛాదనను ఎవరునూ తొలగించుటకు వీలులేదు. విజ్ఞానశాస్త్రపద్ధతులు ఇందుకు భిన్నములు. ఎందువల్లననగా విజ్ఞాన శాస్త్రము ప్రతీ విషయమును గురించీ తెలిసికొనుటకు కుతూహల పడుచుండును. ఎవరో చెప్పిరను కారణముచేత ఏ విషయమును అది అంగీకరించదు. ఒక విషయము పవిత్రమని చెప్పిన కారణముచేత అది భయపడదు. అది ప్రతి విషయమును లోతుకు దిగి విమర్శించును. మూఢ విశ్వాసముల ప్రోత్సహించదు. ప్రయోగమువల్లా, హేతువువల్లా నిరూపింపదగిన విషయములనే అదినమ్మును.

కరడుగట్టిన మత దృష్టితో సంభవించిన ఈ వాదమునందు విజ్ఞానశాస్త్రమే నెగ్గెను. ఈ విషయమును గురించి ఆలోచించిన పలువురు, 18వ శతాబ్దిలోనే, హేతువాదాభిమానులైరి. విప్లవమునకుముందు ఫ్రాంసులో తత్త్వశాస్త్రాభిప్రాయములు వ్రాకినవని నేను నీకు వ్రాసియుంటిని, జ్ఞాపకమున్నదా ? అంతకన్న ఎక్కువగా ఇప్పుడు సంఘములో మార్పు కలిగెను. విజ్ఞానశాస్త్రము పొందుచున్న అభివృద్ధిని చూచి ఏమాత్రము చదువుకొన్నవాడైననూ దానియెడల సుముఖుడు కాజొచ్చెను. ఆ విషయములనుగురించి అతడు లోతుగా విచారించక పోవచ్చును. విజ్ఞాన శాస్త్రమును గురించి అతనికి ఆట్టే తెలియక పోవచ్చును. కాని తన కన్నులముందు ప్రదర్శింపబడుచున్న శాస్త్ర సృష్టములను (Inventions), కనిపెట్టిన విషయములనుచూచి అతడు

ఆశ్చర్యము చెందుచుండెను. రైళ్లు, విద్యుత్తు, టెలిగ్రాఫు, టెలిఫోను, ఫోనోగ్రాఫు ఇంకను ఇతరవస్తువులు ఒకదానివెనుక ఒకటి వచ్చినవి. ఇవి అన్నియు విజ్ఞానశాస్త్ర విధానమునకు పుట్టిన బిడ్డలే. శాస్త్ర విజయము సూచించు చిహ్నములుగా అవి ఎంచబడెను. విజ్ఞానశాస్త్రము మానవుల జ్ఞానమును పెంపొందింపజేసింది. అంతేకాదు. మానవుడు ప్రకృతిని అధిక ముగా తన వశములోపెట్టుకొన్నాడు. విజ్ఞానశాస్త్రము విజయము సాధించుటయూ, సర్వశక్తివంతమగు ఈ నూతన దేవతను ప్రజలు నమస్కరించి పూజించుటయూ ఆశ్చర్య కరములుకావు. పందొమ్మిదో శతాబ్ద మందలి విజ్ఞాన శాస్త్రజ్ఞులు చాలా సంతుష్టిలో తాము చెప్పినదానికి తిరుగు లేదను భావముతో ఉండిరి. వారి అభిప్రాయములు నిష్కర్షగా వారు చెప్పుచుండిరి. అర్థశతాబ్దము దాటినది. విజ్ఞాన శాస్త్రమిప్పుడు చాలా అభివృద్ధిచెందినది. ఈనాడు శాస్త్రజ్ఞులు వెనుకటివలె నిష్కర్షగా ఏ విషయమును గురించియు చెప్పుటలేదు. నిజమగు శాస్త్రజ్ఞుడు నేడు విజ్ఞానము ను మహా సముద్రమువంటిదనిన్నీ, దానికి అంతు లేదనిన్నీ అనుకొంటున్నాడు. ఆ సముద్రముపై అతడు ప్రయాణము చేయబూని •నప్పటికిన్నీ వెనుకటికన్న వినయముతో, జంకుతో ప్రవర్తిస్తున్నాడు.

పందొమ్మిదో శతాబ్దములో చెప్పకోదగ్గ వేరొక విశేషము—పాశ్చాత్య దేశములలో వృద్ధినందిన సామాన్య జనవిద్య. పాలక జాతిలోని వారనేకులు ఇది కూడదని అడ్డుతగిలిరి. సామాన్య జనులకు విద్య కరపిన వారు అసంతుష్టి పాలగుదురనియు, స్వామిద్రోహము చేయుదురనియు, అహంకార పూరితులగుదురనియు, అక్రైస్తవులగుదురనియు వారు చెప్పిరి. దీనినిబట్టి చూచిన క్రైస్తవము అజ్ఞానమయముగా నుండవలెననిన్నీ, భాగ్యవంతులకు అధికారులకు తలయొగ్గి యుండవలెననిన్నీ తోస్తుంది. ఇట్టి వ్యతిరేకభావమున్నప్పటికీ ప్రాథమికవిద్య ప్రవేశపెట్ట బడినది. నానాటికీ వ్యాపించినది. పందొమ్మిదో శతాబ్దిలోవచ్చిన అనేక

విషయములవలెనే ఇదిన్నీ నూతన పారిశ్రామిక పరివర్తనకుఫలము. పెద్ద ఫ్యాక్టరీలున్నూ, పెద్ద యంత్రములున్నూ సమర్థముగా నడుపవలసి యున్నవి. విద్యవల్లనే ఇదిసాధ్యమగును. ఆనాటిసంఘము ముఖ్యముగా కోరినది—కౌశల్యముతోకూడినపని. ప్రజావిద్యవల్ల ఇది సమకూరినది.

బాహాటముగా ప్రారంభవిద్య చెప్పుచుండుటవల్ల అనేకులు అక్షరాస్యులయిరి. వారిని విద్యావంతులన వీలులేదు. కాని వారికి చదువను, వ్రాయను వచ్చును. వారిలో వార్తాపత్రికల చదువు అలవాటు వ్యాపించినది. చౌకరకపు వార్తాపత్రికలు పుట్టినవి. అవి అమితముగా వ్యాపించినవి. ప్రజాహృదయములమీద వాటి ప్రభావము అమితముగా ఉండెను. తరుచు ఈ పత్రికలు ప్రజలను తప్పుదారులలో పెట్టుచుండెను. పొరుగు దేశములపై వారికి కోపము కలిగించుచుండెను. తత్కారణమున యుద్ధములుకూడ కలుగుచుండెను. ఇట్లా ఉన్నప్పటికీ వార్తా పత్రికలు చెప్పు విషయములను త్రోసివేయుటకు వీలులేనంత పలుకుబడిని అవి సంపాదించినవి.

ఈ జాబులో వ్రాసిన విషయములు చాలామట్టుకు యూరోపుకు—అందు ముఖ్యముగా పడమటి యూరోపుకు సంబంధించినవి. కొంత వరకు ఉత్తర అమెరికాకుకూడ ఇవి సంబంధించియుండును. మిగత ప్రపంచమంతయు, జపాను వినా, ఆసియాయున్నూ, ఆఫ్రికాయున్నూ, యూరోపు రాజనీతి కారణముగా కిక్కురుమనకుండా బాధపడుచుండెను. నేను ఇదివరలోచెప్పినట్లు పందొమ్మిదో శతాబ్దము యూరోపుకు చెందిన శతాబ్దము. యూరోపు దేశము రంగమునంతయూ ఆక్రమించియుండెను. అంతటను యూరోపు పలుకుబడి ఎక్కువుగా ఉండెను. గత కాలమున యూరోపుమీద ఆసియా దీర్ఘకాలముపాటు అధికారము చెలాయించి యుండెను. ఈజిప్టులో, ఈరాకులో, ఇండియాలో, చీనాలో, గ్రీసులో, రోములో, అరేబియాలో నాగరికతాకేంద్రములున్నూ, అభివృద్ధియున్నూ వెలసిన రోజులుండెను. కాని ఆ పాత నాగరికతలు కరడుగట్టుకు పోయి

నవి. వాటికి శక్తి సన్నగిల్లింది. జీవ చిహ్నమగు వికారాభివృద్ధులు వాటిని వదలిపెట్టెను. అవి అన్య దేశముల నాశ్రయించెను. ఇప్పుడు యూరోపువంతు వచ్చినది. ప్రయాణ సౌకర్యములు వృద్ధినందుటచే ప్రపంచమందున్న భాగములూ సులభముగా అందుబాటులోనికి వచ్చిన కారణమున యూరోపు అధికముగా తన అధికారమును చెలాయించింది.

పందొమ్మిదో శతాబ్దిలో యూరోపియన్ నాగరికత వికసించినది. ఈ నాగరికతనే బూర్జువా నాగరికత అందురు. పారిశ్రామిక ధనికపద్ధతి కారణముగా పైకి వచ్చిన బూర్జువా తరుగతు లా నాగరీకతను నడుపుచుండుట ఇందుకు కారణము. ఈ నాగరికతలోని అన్యోన్య విరుద్ధ భావములను గురించియు, దుష్టలక్షణములను గురించియు నీకు చెప్పియుంటిని. ముఖ్యముగా ఇండియాలోనున్న మనమున్నూ, ప్రాచ్య దేశస్థులున్నూ ఈ దుష్ట లక్షణములను చూచియున్నాము. వాటి దుష్ట ఫలముల ననుభవించి బాధపడియున్నాము. కాని ఏ దేశముగాని, ఎట్టి ప్రజలుగాని, తమలో ఘనతనిచ్చు లక్షణములున్నగాని గొప్పతనమును సాధించలేరు. యూరోపుకు అట్టి లక్షణములుండెను. పర్యవసానమున యూరోపుయొక్క పలుకుబడి దాని మిలిటరీ శక్తిపై ఆధారపడి యుండలేదు. ఘనతనిచ్చు లక్షణములు దానికుండుటవల్లనే దానికి ప్రతిష్ఠ వచ్చినది. యూరోపు నందంతటా జీవశక్తీ, వీర్యశక్తీ, కల్పనాశక్తీ ఎక్కువగా విశదమగుచుండును. మహాకవులు, రచయితలు, తత్త్వశాస్త్రజ్ఞులు, విజ్ఞానశాస్త్రజ్ఞులు, గాయకులు, ఇంజనీర్లు, కార్యశూరులు అందు తలయెత్తిరి. పడమటియూరోపులో నివసించే సామాన్య మానవుని స్థితి ఇదివరకుకన్న చాలా మెరుగుగా ఉన్నదనుటకు సందేహము లేదు. అందలి గొప్ప రాజధానులైన లండను, పారిస్, బెర్లిన్, న్యూయార్కులు నానాటికి పెద్దవయ్యెను. ఆనగరములందలి భవనములు నానాటికీ ఉన్నతములయ్యెను. భోగములతిశయించెను. మనుష్యుల

చాకిరీనీ, కష్టములనూ తగ్గించుటకు విజ్ఞానశాస్త్రము వేలకొద్ది మార్గము లను సూచించెను. భాగ్యవంతుల జీవితము సుఖప్రదమయ్యెను. సంస్కృతి ప్రదమయ్యెను. తమకున్నదికదా అనే తృప్తీ, పెద్దమనిషి తరహా వారికి వచ్చెను. నాగరికతయొక్క చక్కని అపరాహ్ణకాలమో, సాయంకాలమో వలె అది ఉండెను.

ఇట్లు పందొమ్మిదో శతాబ్ది రెండవ భాగమున యూరోపు కులాసాగా, భాగ్యవంతముగా పైకిచూచుటకు కనిపించుచుండెను. ఈ మృదుల సంస్కృతీ, నాగరికతా శాశ్వతముగానిలిచేటట్లూ, విజయపరంపరలు సాధించేటట్లూ తోపింపచేస్తోంది. కాని పైపొరను తొలగించి లోనికి చూచినట్లయితే అక్కడ ఒక వింత సంభ్రమమూ, దుఃఖకరమగు దృశ్యములూ కనిపించుచుండెను. ఎందువల్లనంటే భోగభాగ్యముతో కూడిన ఈ సంస్కృతి యూరోపులోనున్న పైతరగతి ప్రజలలోనే ఉండెను. అనేక జాతులను, అనేక దేశములను తమ ప్రయోజనము నకై వినియోగించుకొనుటవల్లనే ఇది వారికి కలిగినది. నేను చెప్పిన పరస్పర విరుద్ధ కార్యములు కొన్ని నీవు ఇందు గమనించవచ్చును. జాతి ద్వేషములు గమనించవచ్చును. సామ్రాజ్యవాదముయొక్క క్రూర ముఖమును నీవు చూడవచ్చును. అప్పుడు నీవు, ఈ పందొమ్మిదో శతాబ్ది నాగరికత అందమైనదనిగాని, శాశ్వతముగా ఉండగలదనికాని విశ్వసించలేవు. బాహ్యదేహము అందముగానే ఉన్నది. కాని హృదయ ములో పురుగు ప్రవేశించినది; ఆరోగ్యమును గురించియు, అభివృద్ధిని గురించియు పెద్ద పెద్ద మాటలు చెప్పుతున్నారు. కాని బూజువా నాగరి కత ఆయువుపట్లు క్షీణించి పోవుచున్నవి.

1914 లో అది ఫెళ ఫెళ్యాడింది. 4¼ సంవత్సరములు యుద్ధము చేసిన పిమ్మట యూరోపు బయటపడ్డది. కాని అది పెద్ద పెద్ద గాయ ములు తిన్నది. అవి ఇంకను మానలేదు. ఈ విషయమును గురించి నీకు తరువాత చెప్పవలసి ఉన్నది.

# 109

# ఇండియాలో యుద్ధములూ, తిరుగుబాట్లూ

నవంబరు 27, 1932

పందొమ్మిదో శతాబ్దమును మనము చక్కగా కలయజూచితిమి. ప్రపంచమందలి కొన్ని భాగములను మనమిప్పుడు పరిశీలింతము. ఇండియాతో ప్రారంభింతము.

ఇండియాలో బ్రిటిషువారు తమ ప్రతిస్పర్థులతో ఢీకొని ఎట్లు విజయము గాంచిరో వెనుక నేను చెప్పియుంటిని. నెపోలియన్ యుద్ధములు సాగించుచుండిన కాలమున ఫ్రెంచివారు ఇండియానుండి తొలగింపబడిరి. కొంతకాలముదాక మహారాష్ట్రులున్నూ, మైసూరులో టిప్పుసుల్తానున్నూ, పంజాబులో శిక్కులున్నూ బ్రిటిషువారికి ఎదురునిలిచిరి. కాని చిరకాలము వారిని నిరోధించలేకపోయిరి. అన్ని జాతులలోనూ బ్రిటిషువారే మిక్కిలి బలవంతులునూ, సాధన సామగ్రికలవారున్నూ. వారికి మంచి ఆయుధములుండెను. సముద్రాధికారము వారి చేతులలో ఉండెను. తరుచు వారు ఓడింపబడినా ఇండియానుండి తొలగిపోనవసరము లేకుండెను. సముద్రాధికారమువారికుండుటచేత తగిన సామగ్రిని సకాలమున తెచ్చుకొనుచుండెడివారు. స్థానిక రాజ్యముల విషయములో ఓటమి ఉపద్రవ కారణమగుచుండెను. దానికి తిరుగు లేకుండెను. బ్రిటిషు వారన్ననో సాధనసామగ్రి బాగుగా ఉన్న యోధులు; కార్యక్రమ నిర్మాణచతురులు; స్థానికి ప్రతిస్పర్థులకంటె చాలా తెలివిగలవాళ్లుకూడా. అందువల్లనే రాజులలోని అన్యోన్య స్పర్థలను ఆధారము చేసుకొని లాభము పొందిరి. కావున అడ్డులేకుండ బ్రిటిషువారి అధికారము వృద్ధి అయినది. వారి ప్రతిస్పర్థులు ఒకరితరువాత ఒకరు ఓడింపబడిరి.

తమకు ఇతరులసహాయముతో ఒకరిని నిర్జించి తరువాత సహాయముచేసిన వారినికూడా నిర్జించిరి. ఆనాటి ఇండియాలోని ఫ్యూడల్ రాజులు ఎంతటి హ్రస్వదృష్టికలవారో తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. వారందరును కలిసి ఈ విదేశ శత్రువును ఓడించవచ్చునని వారనుకోలేదు. ప్రతి ఒక్కడును ఇతరుల సహాయము కోరకుండ పోరాడి ఓడిపోయెను. ఓడిపోవలసినదేకదా!

బ్రిటిషువారి బలము వృద్ధిచెంద మొదలుపెట్టెను. వారు కలహాము నకు కాలు దువ్వుచుండిరి. అంతకంతకు క్రూరముగా సంచరించ మొదలిడిరి. కారణమున్నా, లేకున్నా యుద్ధములకు దిగుచుండిరి. అట్టి యుద్ధములనేకము సంభవించెను. వాటిని గురించి వ్రాసి నీకు విసుగు పుట్టించను. యుద్ధములు సరదా ఇచ్చు విషయములుకావు. చరిత్రలో వాటికి తగని ప్రాముఖ్యము ఇస్తున్నారు. కాని వాటిని గురించి కొంత చెప్పితేనేతప్ప చిత్రము పూర్తికాదు.

మైసూరు హైదరాలీకిని, బ్రిటిషువారికిని జరిగిన రెండు యుద్ధములను గురించి నీకిదివరలో చెప్పియున్నాను. వీటిలో హైదరాలీ చాలా వరకు జయముకాంచెను. అతని కుమారుడు టిప్పుసుల్తాను బ్రిటిషువారికి ప్రబలశత్రువు. అతనిని అంతరింపజేయుటకు మరిరెండు యుద్ధములు—1790-92 లోనూ, 1799 లోనూ—చేయవలసివచ్చినది. పోరాడుచు టిప్పు మరణించెను. మైసూరునగరము సమీపమున అతని రాజధానియైన శ్రీరంగ పట్టణముయొక్క శిథిలములను నీవిప్పుడు చూడవచ్చును. అతని సమాధికూడ అక్కడే కలదు.

ఇక బ్రిటిషువారి ఆధిపత్యమును ఎదిరించుటకు మహారాష్ట్రులు మాత్రము మిగిలియుండిరి. పడమర పీష్వా ఉండెను. గ్వాలియరు సింధియా ఉండెను. ఇందూరు హోల్కారుండెను. ఇంకను ఇతర రాజులు కొందరుండిరి. కాని, రాజకార్య దురంధరులైన గ్వాలియరు రాజు, మహాదాజీ సింధియా 1794 లోనూ, పీష్వా మంత్రి నానాఫార్న

పీసు 1800 లోనూ మరణించిన పిమ్మట మహారాష్ట్ర సామ్రాజ్యము చితికిపోయెను. కాని మహారాష్ట్రులింకను పోరాడిరి. బ్రిటిషువారిని పెక్కు తడవలు ఓడించిరి. చివరకు 1819 లో మహారాష్ట్రులు పూర్తిగా ఓడిపోయిరి. మహారాష్ట్రరాజులు ప్రత్యేకముగా ఒక్కొక్కరి చొప్పున ఓడింపబడిరి. ఒకడు యుద్ధము చేయుచున్నప్పుడు మిగిలిన వా రతనికి సహాయము చేయకుండ, చూచుచుండిరి. సింధియా, హోల్కారులు బ్రిటిషువారి అధీశ్వరత్వము నంగీకరించి సామంతరాజులైరి. ఇంతకు ముందే బరోడా గైక్వారు విదేశ జాతితో సంధి చేసుకొనెను.

మహారాష్ట్ర వృత్తాంతమును ముగించుటకు ముందు మధ్య ఇండియాలో కీర్తి గడించిన ఒక్కరిపేరు చెప్పవలసిఉన్నది. ఈ పేరు అహల్యాబాయి. ఈమె 1765 మొదలు 1795 వరకు ముప్పై సంవత్సరముల కాలము ఇందూరును పాలించెను. ముప్పై సంవత్సరములు వయస్సుగల వితంతువామె గద్దె ఎక్కునరికి. రాజ్యపరిపాలన మామె బహు చాకచక్యముతో చేసెను. ఆమె ఘోషాపద్ధతి నవలంబించలేదు. మహారాష్ట్రులెన్నడును ఘోషాపద్ధతి నవలంబించిన వారుకారు. రాచ కార్యముల నామె స్వయముగా చూచుకొనుచుండెను. ఆమె కొలువు కూటములో కొలువుదీరి యుండెడిది. కుగ్రామమగు ఇందూరును ఆమె భోగభాగ్యములతో తులతూగు నగరముగా చేసినది. ఆమె యుద్ధములలో ప్రవేశించలేదు. శాంతముగా రాజ్యమును పాలించెను. ఇండియాలోని అనేక భాగములు ఒడుదుడుకుగానున్న సమయములలో ఆమె తన రాజ్యమును భాగ్యసంపన్నము చేసెను. ఆమెను దేవతగా మధ్య ఇండియా ప్రజలు పరిగణించి, గౌరవింతురు. ఇందాశ్చర్యమేమున్నది!

చిట్టచివర మహారాష్ట్ర యుద్ధమునకు కొద్దిగా ముందు బ్రిటిషువారు నేపాలుతో (1814 నుండి 1816 వరకు) యుద్ధముచేసిరి. పర్వతములలో వారనేక కష్టముల పాలైరి గాని చివరకు విజయము వారికే దక్కెను. నీకీ జాబువ్రాస్తూన్న నేను డెహ్రాడూన్ చెరసాలలోఉన్నాను.

ఈ డెహ్రాడూన్ జిల్లాయున్నూ, కుమాన్, నాయినీతల్ ప్రదేశములున్నూ బ్రిటిషువారి పాలనలోనికి వచ్చినవి. నీకు వెనుక నేనొక జాబు చీనాను గురించి వ్రాస్తూ ఒక చీనా సైన్యముయొక్క అద్భుతచర్యలను వర్ణించి యున్నాను. అది టిబెట్టుదాటి, హిమాలయములపై నడిచివెళ్లి, గూర్కాలను తమ మాతృదేశమగు నేపాలులోనే ఓడించియుండెను. బ్రిటిషు—నేపాలు యుద్ధమునకు 22 వంవత్సరముల ముందు ఇది జరిగినది. నాటి నుండియు నేపాలు చీనా అధీశ్వరత్వమును అంగీకరించెను. ఇప్పుడది అంగీకరిస్తుందని తోచదు. అది చాలా వెనుకబడ్డ విశిష్టమైనదేశము. ప్రపంచముతో దానికాట్టే సంబంధములేదు. అయినా అది చక్కని దేశము. ప్రకృతి సౌభాగ్యమందు వెలసియుండెను. దాని ఉనికి ఆనంద దాయకము. అది కాశ్మీరమువలెను, హైదరాబాదు వలెను సామంత రాజ్యముకాదు. దానిని స్వతంత్ర దేశమందురు. కాని బ్రిటిషువారు దాని స్వాతంత్ర్యమును హద్దులలో ఉంచుచుండిరి. ధైర్యశాలులు, రణోత్సాహము కలవారు అగు గూర్కాలను ఇండియాలోని బ్రిటిషు సైన్యములో చేర్చుకొనుచుండిరి. వీరి సహాయముతో భారతీయులను బ్రిటిషువారు అణచిపెట్టుచుండిరి.

తూర్పున అస్సాం వరకు బర్మా విస్తరించియుండెను. కాబట్టి ముందుముందుకు చొచ్చుకొనివస్తూ ఉన్న బ్రిటిషు వారితో కలహము తప్పనిసరి అయ్యెను. బర్మాతో బ్రిటిషువారు మూడు యుద్ధములుచేసిరి. ప్రతి పర్యాయమును బర్మాలోని కొంత ప్రదేశమును తమరాజ్యములో కలుపుకొనుచుండిరి. 1824—26 లో జరిగిన మొదటి యుద్ధమునకు ఫలితముగా అస్సాం బ్రిటిషువారి కరగతమయ్యెను. 1852 లో జరిగిన రెండవ యుద్ధములో దక్షిణ బర్మా బ్రిటిషువారి వశమయ్యెను. ఇట్లు జరుగుటవల్ల ఉత్తర బర్మాకు దాని రాజధానియైన మాండలేవద్దనున్న ఆవాతో సహా, సముద్రముతో సంబంధము తెగిపోయినది. బ్రిటిషు వారి దయా, ధర్మభిక్షమునకు పాత్రమై, నీటికి దూరమై అది నిలిచినది.


1857 లో జరిగిన
గొప్ప తిరుగుబాటు నాటి
ఇండియా
ఆఫ్ఘనిస్థానము
కాశ్మీరము
పంజాబు
సింధు నది
ఢిల్లీ
మీరటు
నేపాలు
లక్నో
గ్వాలియరు
సింధు
ఇండూరు
బరోడా
బొంబాయి
నైజాం
మైసూరు
మద్రాసు
బెంగాలు
అస్సాము
బర్మా
బ్రిటిషువారి
స్వాధీనమందున్న ప్రదేశములు

మూడవ యుద్ధము 1885 లో తటస్థించెను. అప్పుడు బ్రిటిషువారు బర్మానంతనూ బ్రిటిషు సామ్రాజ్యములో కలుపుకొనిరి. కాని బర్మా, పేరుకుమట్టుకు, చీనాకు సామంతరాజ్యము. తప్పకుండా కప్పముకూడా చీనాకు చెల్లించేది. బర్మాను కలుపుకొనేటప్పుడు బ్రిటిషువారు చీనాకు కప్పము చెల్లించుటకు వప్పుకొనిరి. ఇది వింతవిషయము. దీనినిబట్టి మనము గ్రహించవలసిన విషయమేమనగా—చీనా దేశము సొంత చిక్కులలో తగుల్కొని, తనకు సామంతరాజ్యమైన బర్మాకు సహాయము చేయక పోయినప్పటికీ, బ్రిటిషువారు 1885 లో సైతము చీనా ప్రబలరాజ్యమే నని గ్రహించి ఉందురు. 1885 తరువాత బ్రిటిషు వారు ఒక్కమారే చీనాకు కప్పము చెల్లించి తరువాత విరమించిరి.

బర్మా యుద్ధములు మనలను 1885 వరకు కొంపోయినవి. మూడు యుద్ధములను గురించీ ఉమ్మడిగా ఒకేమారు ప్రసంగించ దలచితిని. ఇప్పుడు మనము ఉత్తర ఇండియాకు పోవలెను. ఈ శతాబ్ది మొదటి భాగమునకును పోవలెను. పంజాబులో రంజింత్ సింగ్ ఆధిపత్యమున ఒక శిక్కు రాజ్యము తలయెత్తెను. శతాబ్ది ప్రారంభమందే రంజిత్ సింగు అమృతసరమును స్వాధీనము చేసుకొనెను. 1820 సంవత్సర మగుసరికి అతడు పంజాబు నంతనూ, కాశ్మీరమునూ స్వాధీనము చేసుకొనెను. అతడు 1839 లో మరణించెను. అతని మరణానంతరము శిక్కు రాజ్యము దుర్బలమై విచ్ఛిత్తి కాజొచ్చెను. కష్టములు తటస్థించి నప్పుడు పైకి లేచి విజయము సాధించిన పిమ్మట పతనమగుదురన్న లోకోక్తి శిక్కు రాజ్యము విషయమున నిజమయ్యెను. అల్పసంఖ్యా కులై, శత్రుపీడితులైన శిక్కులను తరువాతవచ్చిన మొగలులు సైతము అణచిపెట్టలేకపోయిరి. కాని రాజకీయ విజయము సాధించుటతోడనే ఆ విజయముయొక్క పునాదులు దుర్బలమైనవి. శిక్కులకూ బ్రిటిషు వారికీ రెండు యుద్ధములు జరిగినవి. మొదటి యుద్ధము 1845-46

లోనూ, రెండవయుద్ధము 1848-49 లోనూ జరిగెను. రెండవ యుద్ధమున చిలియన్వాలావద్ద బ్రిటిషువారు పూర్తిగా ఓడిపోయిరి. చివరకు మాత్రము బ్రిటిషువారు విజయము సాధించి పంజాబును స్వాధీనము చేసుకొనిరి. బ్రిటిషువారు కాశ్మీరమును జమ్మూకు రాజైన గులాబ్ సింగుకు సుమారు 75 లక్షల రూపాయలకు అమ్మిరి. నీవు కాశ్మీరదేశస్థురాలవు కాబట్టి ఈ విషయము వినుటకు నీకు సరదాగా ఉండవచ్చును. గులాబ్ సింగుకు ఎంతలాభమో? ఈ వ్యవహారములో పాపము కాశ్మీర ప్రజకు ఎట్టి ప్రసక్తిన్నీ లేదు. ఇప్పుడు కాశ్మీర దేశము బ్రిటిషువారి సామంతరాజ్యము. ఇప్పుడున్న మహారాజు గులాబ్ సింగ్ సంతతి వాడే.

ఇంకను ఉత్తరమున, అనగా పంజాబుకు వాయవ్యమున, ఆఫ్ఘనిస్థానమున్నది. దానికి సమీపమందే ఆవలితట్టున రష్యనులున్నారు. మధ్య ఆసియాలో రష్యను సామ్రాజ్యము విస్తరించుట బ్రిటిషువారికి సంభ్రమకారణమైనది. రష్యా ఇండియామీద పడునేమోనని వారు భయపడుచుండిరి. పందొమ్మిదో శతాబ్ది పొడుగునా "రష్యనుల బెదరింపు"ను గురించి భయపడుచుండిరి. 1839 లో ఇండియాలోనున్న బ్రిటిషువారు అకారణముగా ఆఫ్ఘనిస్థానముపై బడిరి. ఆకాలమున ఆఫ్ఘనుల పొలిమేర బ్రిటిషు ఇండియాకు సుదూరముననుండెను. స్వతంత్ర శిక్కు రాజ్యమగు పంజాబు అప్పుడు కలుగజేసికొనెను. అయినా శిక్కులతో మైత్రి కలుపుకొని బ్రిటిషువారు కాబూలుకు దండయాత్ర వెళ్ళిరి. కాని ఆఫ్ఘనులు గట్టిగా కసితీర్చుకొనిరి. వారు అనేక విధములుగా వెనుకబడి ఉన్నప్పటికీ స్వాతంత్ర్య ప్రియులు. స్వాతంత్రముకొరకు ప్రాణము లొడ్డి చివరదాకా పోరాడుటకు వెనుదీయరు. కావుననే దానిపైబడ్డ విదేశ సైన్యములన్నింటికీ అది "కందిరీగల తుట్ట"వలె ఉండెను. బ్రిటిషువారు కాబూలును, ఆ దేశమందలి పలు ప్రాంతములనూ స్వాధీనము చేసుకొన్నప్పటికీ, ఉన్నట్లుండి దేశమందంతటా తిరుగుబాట్లు సంభవించెను.

బ్రిటిషువారు వెనుకకు తరుమగొట్టబడిరి. ఒక బ్రిటిషుసైన్యము పూర్తిగా నాశము చేయబడెను. మరికొంత కాలమునకు మరల బ్రిటిషువారు కసి తీర్చుకొనుటకు దానిపై దండయాత్ర చేసిరి. వారు కాబూలును ఆక్రమించుకొనిరి. ఆ నగరమునందున్న ఇంటికప్పుగల బజారును మందుగుండు సామానుతో పేల్చి నాశము చేసిరి. నగరమందలి అనేక భాగములకు బ్రిటిషు సైనికులు నిప్పంటించి వాటిని కొల్లగొట్టిరి. నిరంతరమూ వారితో పోరాడుతూ ఉంటేనేతప్ప ఆఫ్ఘనిస్థానమును నిలుపుకొనుట దుస్సాధ్యమని స్పష్టపడుచున్నదిగదా ! కాన వారు వెనుకకుపోయిరి.

సుమారు నలభై సంవత్సరముల తరువాత, 1878 లో అమీరు (ఆఫ్ఘనిస్థాన పాలకుడు) రష్యాతో మైత్రి నెరపినందుకు బ్రిటిషువారు భయభ్రాంతులైరి. చాలావరకు చరిత్ర పునరుక్తమైనది. పిమ్మట బ్రిటిషువారు ఆ దేశముపై దండెత్తిరి. వేరొకయుద్ధము తటస్థించెను. బ్రిటిషువారికి విజయము చేజిక్కినట్లే కనిపించెను. అప్పుడు బ్రిటిషు రాయబారియు, అతని మనుష్యులును ఆఫ్ఘనులచే హత్య చేయబడిరి. బ్రిటిషు సైన్యమొకటి ఓడింపబడెను. బ్రిటిషువారు ప్రతిక్రియ కొంతచేసి "కందిరీగల పుట్ట" నుండి తప్పుకొనిరి. తరువాత కొన్ని సంవత్సరములపాటు ఆఫ్ఘనిస్థానముయొక్క స్థితిగతులు వింతగా ఉండెను. విదేశములతో అమీరు ఎట్టి సంబంధములున్నూ పెట్టుకోగూడదని బ్రిటిషువారు నియమించిరి. సరిగదా అతనికి సాలుకు పెద్ద ధన మొత్తమును ఇచ్చేవారు. పదమూడు సంవత్సరములక్రితము, అనగా 1919 లో మూడవ ఆఫ్ఘను యుద్ధము తటస్థించెను. దీనికి ఫలితము ఆఫ్ఘనిస్థానము పూర్తిగా స్వతంత్రమగుట. కాని మనము చర్చించుకొనుచున్న కాలమునకు సంబంధించినది కాదు.

ఇతర చిన్న యుద్ధములునూ జరుగుచుండెను. ఇందొక్కటి మిక్కిలి హేయమైనది 1843లో సింధుదేశముతో చేయబడ్డది. అచ్చటి బ్రిటిషు ఏజెంటు ప్రజలను హింసించి, వారిని రెచ్చగొట్టెను. పిమ్మట

వారిని అణచివేసి ఆ రాష్ట్రమును కలుపుకొనెను. పిమ్మట ఈ పనిచేసిన బ్రిటిషు ఉద్యోగులకు ధన రూపకముగా పారితోషికములు పంచిపెట్టబడెను. అందు ఏజెంటు అయిన సర్ ఛార్లస్ నేపియర్ వాటా సుమారు ఏడు లక్షల రూపాయలు. ఆనాటి హిందూదేశము అధర్మ కార్యము చేయుటకు జంకని సాహసికులగు బ్రిటిషు ప్రజలను ఆకర్షించినదంటే ఆశ్చర్యమేమున్నది ?

1856 లో అయోధ్య బ్రిటిషు సామ్రాజ్యములో కలుపుకోబడ్డది. ఆనాడది దుష్పరిపాలనవల్ల పాడుస్థితిలో నుండెను. అచ్చటి పరిపాలకులకు నవాబు-వజీరులని పేరు. తొలుదొల్త అయోధ్యకు గవర్నరుగా ఢిల్లీ మొగలు చక్రవర్తి, నవాబు-వజీరును ఏర్పాటుచేసెను. కాని మొగలు సామ్రాజ్యము క్షీణించుటతోడనే అయోధ్య స్వతంత్రమయ్యెను. కాని చిరకాలముపాటు అది అట్లుండలేదు. చివరరోజులలో వచ్చిన నవాబు-వజీరులు వట్టి అసమర్థులున్నూ, అవి నీతిపరులున్నూ. వారేమైన మంచి చేయదలచుకొన్నా చేయలేకపోయేవారు. తూర్పు ఇండియా వర్తక సంఘమువారు వీరి వ్యవహారములలో జోక్యము కలుగచేసికొనడమే ఇందుకు కారణము. వారికి నిజముగా ఎట్టి అధికారమున్నూ బ్రిటిషువారు మిగల్చలేదు. అయినా అయోధ్యలో ఆంతరంగిక ప్రభుత్వము ఎట్లాఉన్నా వారు లెక్కచేయలేదు. ఇట్లు అయోధ్య విచ్ఛిత్తి చెంది తప్పనిసరిగా బ్రిటిషు సామ్రాజ్య భాగమైనది.

యుద్ధములను గురించీ, దేశాలను కలుపుకోవడాన్ని గురించీ కావలసినంత చెప్పితిని. కాని ఇవన్నియు అప్పటికి జరుగుచున్నట్టిన్నీ, జరిగితీరవలసినట్టిన్నీ పరిణామమునకు బాహ్య చిహ్నములు మాత్రమే. బ్రిటిషువారు వచ్చినప్పుడు ఇండియాలోనున్న పూర్వకాలపు ఆర్థిక పరిస్థితి ముక్కలై పోవుచుండెను. ఫూడల్ విధానము ఛిద్రమగుచుండెను. పరదేశీయులప్పుడు ఇండియాకు రాకపోయినప్పటికిన్నీ ఫ్యూడల్ విధానము చిరకాలము మన్నేదికాదు. యూరోపులోవలెనే అది అంతరించి

పోయేది. కొత్త విధానము దానిస్థానే ప్రవేశించేది. దీని ప్రకారము ఉత్పత్తి కారకులైన ప్రజా తరగతులకు అధికారము సంక్రమించేది. కాని ఇట్లు తటస్థించకముందే, విచ్ఛిత్తి ప్రారంభమైనప్పుడే బ్రిటిషువారు వచ్చిరి. సునాయాసముగా దేశము నాక్రమించిరి. వారు యుద్ధముచేసి ఓడించిన రాజులు అంతరించుచున్న పాత కాలమునకు చెందినవారే. వారికి భవిష్యత్తు లేదు. ఇట్టి పరిస్థితులలో బ్రిటిషువారు విజయమునంది తీరవలసినదే. ఇండియాలోని ఫ్యూడల్ విధానము త్వరలో అంతరించుటకు వారు తోడ్పడిరి. అయినా ఒక వింతవిషయమేమిటంటే, ఈ విధానమును బోటుపెట్టి నిలుపుటకు ప్రయత్నించి ఇండియా అభివృద్ధికి ఆటంకము కల్పించిరి.

ఈ విధముగా బ్రిటిషువారు ఇండియాలో చారిత్రక పరిణామము జరుగుటకు కారకులైరి. ఇది ఫ్యూడల్ ఇండియాను పారిశ్రామికమైనట్టి పెట్టుబడిదారుల రాజ్యముగా మార్చనున్నది. బ్రిటిషు వారీ విషయమును గ్రహించియుండలేదు. వారితో యుద్ధము చేసిన హిందూదేశ రాజులకీ విషయ మసలే తెలియదు. అవసానదశలో ఉన్న పూర్వ విధానము ఆనాటి కాలచిహ్నములను గుర్తించలేదు. అది చేయవలసిన పని ముగించినదనిన్నీ, ఇక దానివల్ల ఎట్టి ప్రయోజనమునూ లేదనిన్నీ గ్రహించలేదు. బలవత్తరమగు సన్నివేశములు వచ్చి దానిని అణచి వేయుటకు ముందు మర్యాదగా తప్పుకొనుట మంచిదని దానికితోచదు. చరిత్ర చేయు ఉపదేశము దానికి అర్థముకాదు. ప్రపంచము ముందుకు పోవుచున్నదనిన్నీ, ఎవరో చెప్పినట్లు దానిని "చరిత్ర అనే చెత్త తొట్టి"లో పారవేయుననిన్నీ దానికి అవగాహనకాదు. హిందూదేశ మందలి ఫ్యూడల్ విధానము ఈ విషయములను గ్రహించలేదు. కావుననే వ్యర్థముగా బ్రిటిషువారితో పోరాడెను. అట్లే ఇండియాలోనూ, ప్రాచ్య దేశములందునూ నేడున్న బ్రిటిషువారు తమకు కాలము తీరినదనిన్నీ, సామ్రాజ్యపు రోజులు అంతరించినవనిన్నీ, ప్రపంచము నిరా

ఘాటముగా ముందుకుపోయి బ్రిటిషు సామ్రాజ్యమును "చరిత్ర అనే చెత్తతొట్టి" లోనికి తోసివేయుననిన్నీ గ్రహించలేదు.

కాని ఇండియాలోనున్న ఫ్యూడల్ విధానము—బ్రిటిషువారు ఇండియాలో ప్రవేశించి వ్యాపిస్తున్న కాలమున, తమ అధికారమును తిరిగి గ్రహించుటకున్నూ, విదేశీయుని తరిమివేయుటకున్నూ ఇంకొక ప్రయత్నము చేసెను. అది తుది ప్రయత్నము. ఇదే 1857 లో జరిగిన గొప్ప తిరుగుబాటు. దేశమందంతటా అసంతుష్టిప్రబలినది. బ్రిటిషువారిపై విముఖత్వము కలిగినది. తూర్పు ఇండియా వర్తకసంఘమువారి వ్యాపారము డబ్బు చేసుకొనడమే. కాని మరేపనీ వారు చెయ్యరు. ఇదిన్నీ, ఆ సంఘములో పనిచేసే పలువురు ఉద్యోగస్తుల అజ్ఞానమున్నూ, అక్రమ ధనకాంక్షయున్నూ కారణములుగా దేశములో దురవస్థ వ్యాపించింది. బ్రిటిషు, ఇండియన్ సైన్యములోకూడా అసంతుష్టి వ్యాపించెను. చిన్న చిన్న పితూరీలుకూడా సైన్యములో జరిగినవి. చాలామంది ఫ్యూడల్ రాజులున్నూ, వారి సంతతివారున్నూ తమ కొత్త యజమానులయిన బ్రిటిషువారిపై కోపముగా నుండిరి. కావున రహస్యముగా ఒక గొప్ప తిరుగుబాటు ఏర్పాటు చేయబడెను. ఈ తిరుగుబాటు సంయుక్త రాష్ట్ర ప్రాంతములలోనూ, మధ్య ఇండియా ప్రాంతములలోనూ ముఖ్యముగా వ్యాపించెను. ఇండియాలోనువ్న బ్రిటిషువారికి హిందూ దేశస్థులు ఏమి చేస్తున్నారో, ఏమి యోచిస్తున్నారో తెలియదు. తిరుగుబాటు సంగతి వారికేమీ తెలియదు. అనేక ప్రదేశములలో ఒకేమారు తిరుగుబాటు జరుగగలందులకై అందుకొకదినము నియమించబడెను. కాని మీరటులోని కొన్ని ఇండియన్ పటాలములు అనుకున్న తేదీకి ముందుగానే 1857 మే 10 వ తేదీని తిరుగుబాటు చేసినవి. తిరుగుబాటు నాయకుల కార్యక్రమము ఇందువల్ల అనుకున్న విధముగా జరుగలేదు. అంతేకాదు. ప్రభుత్వమువారు అప్రమత్తత వహించుటకు వీలైనది. అయినప్పటికీ, తిరుగుబాటు సంయుక్త రాష్ట్రములలోనూ, ఢిల్లీలోనూ, మధ్య ఇండియా,

బీహారులలో కొంతవరకూ వ్యాపించెను. అది సైనిక తిరుగుబాటు మాత్రమేకాదు. ఈ ప్రదేశములలో బ్రిటిషువారిమీద ప్రజాసామాన్యము చేసిన తిరుగుబాటుకూడా అది. గొప్పమొగలుల వంశములో ఆఖరి వాడగు బహదూరు షాను కొందరు చక్రవర్తిగా ప్రకటించిరి. అతడు దుర్బల కాయుడగు వృద్ధుడు. కవి. ఈ తిరుగుబాటు క్రమేణా ఇండియనుల ద్వేషమునకు గురియైన విదేశీయునిపై ప్రకటింపబడిన భారత స్వాతంత్ర్య యుద్ధముగా పరిణమించెను. కాని ఈ స్వాతంత్ర్యము ఫ్యూడల్ విధానమునకు సంబంధించినది. నిరంకుశులగు చక్రవర్తుల పాలనమందుండే స్వాతంత్ర్యము. అందు ప్రజాసామాన్యమునకు స్వాతంత్ర్యములేదు. కాని పలువురు ఈ యుద్ధమునందు పాల్గొనిరి. ఇందుకు ఒక కారణము—ప్రజలు తమ దారిద్ర్యమునకూ, కష్టములకూ బ్రిటిషువారి రాక కారణముగా నెంచుట. వేరొక కారణము కొన్నిచోట్ల పెద్ద భూస్వాములకు ప్రజలపై గల పట్టు. మతవైరముకూడా వారిని ప్రోత్సహించినది. హిందువులును, మహమ్మదీయులును ఈయుద్ధమునందు పూర్తిగా పాల్గొనిరి.

ఉత్తర, మధ్య ఇండియాలలో బ్రిటిషు పాలనము చాలా నెలల పాటు అపాయ స్థితిలో ఉండెను. కాని ఈ తిరుగుబాటు ఫలితమును నిర్ణయముచేసినది భారతీయులే. ఎట్లంటే శిక్కులునూ, గూర్ఖాలునూ బ్రిటిషువారికి సహాయముచేసిరి. దక్షిణమున నైజామున్నూ, ఉత్తరమున సింధియాయున్నూ, ఇంకా ఇతర స్వదేశ సంస్థానములు పెక్కులున్నూ బ్రిటిషువారి పక్షమే అవలంబించెను. స్వపక్ష పరిత్యాగము మాట అటుంచినా తిరుగుబాటు విఫలము కావలసినదే. విఫలము కాదగ్గ బీజములందే ఉండెను. అది శిథిలమగుచున్న ఫ్యూడల్ విధానమును నిలువబెట్టుటకు ప్రయత్నించెను. దానికి మంచి నాయకత్వము లేదు. కట్టుదిట్టముతో అది పనిచేయలేదు. అన్యోన్య కలహములు వారిలోనా పెట్టుకొనుచుండిరి. కొందరు విప్లవకారులు బ్రిటిషువారిని క్రూర

హత్యచేసి తమ ఉద్యమమునకే కళంకము తెచ్చిపెట్టిరి. ఇట్టి రాక్షస కృత్యములు కారణముగా ఇండియాలోనున్న బ్రిటిషువారు పట్టుదలతో అంతకన్న వేయిరెట్లు అధికముగా ప్రతీకారము చేసిరి. కాన్పూరులోని ఇంగ్లీషు పురుషులను, స్త్రీలను, పిల్లలను హత్య చేయుటవల్ల ఇంగ్లీషు వారికి క్రోధమంకురించెను. వారికి ఎట్టి ఆపదా లేదని మొదట హామీ ఇచ్చి తరువాత ద్రోహబుద్ధితో ఈ కార్యమును జరిపించినవాడు పీష్వా సంతతివాడైన నానాసాహేబు. ఈ క్రూర కృత్యమునకు జ్ఞాపక చిహ్నముగా కాన్పూరులో ఒక బావి కలదు.

మారుమూల ప్రదేశములలో అనేకచోట్ల ప్రజల గుంపులు ఇంగ్లీషువారిని చుట్టు ముట్టిరి. ఒక్కొక్కమారు వారిని సరిగా చూచిరి. అనేకసార్లు వారిని బాధ పెట్టిరి. ధైర్యముతో పరబలము ప్రబలముగా ఉన్నా చక్కగా పోరాడిరి. ఔట్రాం, హావెలక్ సేనానులు నడిపించిన లక్నో ముట్టడి బ్రిటిషువారి సాహసమునకూ, ఓర్పుకూ నిదర్శనము. ఢిల్లీ ముట్టడీ, పతనమూ సెప్టెంబరు 1857 లో సంభవించెను. నేటి నుండి హిందుస్థానీయులకు వ్యతిరేకముగా తిరుగుబాటు పరిణమించెను. తరువాత కొన్ని నెలలపాటు బ్రిటిషువారు తిరుగుబాటును అణచివేసిరి. ఇట్లు చేయుటకు వారు రాక్షసత్వ మవలంబించిరి. ప్రజలను భీతావహులను చేసిరి. అనేకమందిని తుపాకులతో కాల్చి చంపిరి. ఫిరంగికి ఎదురుగా నిలబెట్టి అనేకమందిని కాల్చి తుత్తునియలుగా చేసి చంపిరి. బాటప్రక్క చెట్లకు అనేకమందిని ఉరిదీసిరి. నీల్ అను ఇంగ్లీషు సేనాని అలహాబాదునుండి కాన్పూరుకు దండును నడిపించుకుపోయి త్రోవపొడుగునా ప్రజలను చెట్లకు ఉరిదీస్తూ పోయెనట! చివరకు ఉరిదీయడానికి ఉపయోగపడని చెట్టంటూ మిగలలేదట. భాగ్యవంతమగు గ్రామములు ధ్వంసము చేయబడెను. ఇదంతా భయంకరమైన గాథ; బాధకలిగించే గాథ. ఇందలి యదార్థమును అంతా నేను నీకు చెప్పజాలను. నానాసాహెబు ద్రోహముతో, రాక్షసత్వముతో ప్రవర్తిస్తే అంతకన్న వేయి

రెట్లు అధికముగా ఇంగ్లీషు ఉద్యోగస్తులనేకులు రాక్షసత్వముతో ప్రవ ర్తించిరి. సేనానులుగాని, నాయకులుగాని లేని తిరుగుబాటు చేసిన ఇండియన్ సైనికులు క్రూరముగా, భీభత్సముగా ప్రవర్తిస్తే, శిక్షణ పొందిన బ్రిటిషు సైనికులు, తమ సేనానుల నాయకత్వాన అంతకన్న క్రూరముగా, రాక్షసముగా ప్రవర్తించిరి. నేను ఈ రెండు పక్షముల వారినీ సరిపోల్చి చూడదలుచుకోలేదు. రెండు పక్షముల వారునూ, అనాగరికముగా ప్రవర్తించిరి. కాని మన చరిత్రలు నిజమును దాచివేసి ఇండియనుల ద్రోహమునూ, క్రౌర్యమునూ మాత్రమే ఉద్ఘాటించి రెండవ పక్షము చేసిన పనులను ఎత్తుకోవు. ఇంకో విషయమునుకూడా జ్ఞాపక ముంచుకోవలెను. కట్టుదిట్టములతో కూడుకొన్న ప్రభుత్వము అల్లరి మూకవలె ప్రవర్తించ దలుచుకొంటే అది చేసే క్రూరకృత్యములముందు అల్లరి మూక చేసే క్రూరకృత్యములు ఎందుకూ గణనకురావు. మన రాష్ట్రములోని గ్రామములనేకము నేడిప్పుడు నీవుచూడు. తిరుగుబాటు అణచివేసే కాలములో ప్రజలు అనుభవించిన దుర్భరకష్టములు వారికింకా స్పష్టముగా జ్ఞాపకమున్నవి. అవి ఎంత భీతావహములో వారి మాటలు విని నీవు తెలుసుకోవచ్చు.

తిరుగుబాటు జరిగే కాలమందూ, దానిని అణచివేసే కాలమందూ ఈ విధముగా రాక్షస కృత్యములు జరుగుచుండెను. ఈ అంధకారములో ఒకచుక్క గోచరమగుచుండెను. ఈమె లక్ష్మీబాయి. ఝాంసీరాణి. బాల వితంతువు. ఆమె వయస్సు ఇరవై సంవత్సరములు. పురుష వేషమును ధరించి ఆమె తన ప్రజలకు నాయకత్వమువహించి బ్రిటిషు వారి నెదిరించెను. ఆమె ధైర్య సాహసములనుగురించీ, సామర్థ్యమును గురించీ అనేక కథలు చెబుతారు. ఆమె నెదిరించిన ఇంగ్లీషు సేనాని సైతము ఆమెను విప్లవ నాయకులందరిలోనూ ఉత్తరమురాలు, ధైర్య సముపేత అని చెప్పియున్నాడు. రణరంగమున పోరాడుచు ఆమె ప్రాణములు వదలెను.

1857–58 లో తటస్థించిన తిరుగుబాటు ఫ్యూడల్ ఇండియా ఆరిపోవుటకు ముందు వెలిగిన ఆఖరి వెలుగు. ఇది కారణముగా గొప్ప మొగలుల రాజ వంశము అంతమొందెను. ఢిల్లీకి బహదూర్‌షా ఇద్దరు కొడుకులనూ, మనుమణ్ణి హడ్‌సన్ అనే ఇంగ్లీషు ఉద్యోగస్థుడు తీసుకు పోతూ, అకారణంగా, వట్టిపుణ్యాన్ని, కాల్చి చంపాడు. ఈ విధముగా తైమూరు, బేబరు, అక్బరుల రాజవంశము అవమాన కరముగా అంతరించెను.

తిరుగుబాటు కారణముగా ఇండియాలోని తూర్పు ఇండియావర్తక సంఘ పరిపాలనముకూడా అంతరించెను. బ్రిటిషు ప్రభుత్వము ఇండియా పరిపాలనమును స్వయముగా చేయపూనుకొనెను. బ్రిటిషు గవర్నరు జనరలు వైస్రాయిగా మారెను. 19 సంవత్సరముల తరువాత 1877 లో ఇంగ్లాండు దేశపు రాణి కైజర్–ఇ–హింద్ బిరుదమును వహించెను. ఇది సీజరుల పాత బిరుదము. బైజాంటైన్ సామ్రాజ్యముయొక్క పాత బిరుదము. ఇండియాకు సమన్వయింప బడినది. మొగలు రాజవంశము అంతరించినది కాని దాని మనః ప్రవృత్తి, నిరంకుశత్వ చిహ్నాలు సైతమూ మిగిలినవి. వేరొక గొప్ప మొగలు ఇంగ్లాండులో అధివసించి యుండెను.

## 110
## భారతదేశ శిల్పి మూలకొందుగుట

డిశంబరు 1, 1932

పందొమ్మిదో శతాబ్దిలో ఇండియాలో జరిగిన యుద్ధముల వృత్తాంతము ముగిసినది. ఈ కాలమున ఇండియాలో జరిగిన ముఖ్యమైన విషయములను గురించి ఇప్పుడు ఆలోచింతము. ఒక్కొక్క విషయమును మాత్రము జ్ఞాపకముంచుకొనుము. ఇంగ్లాండు లాభముకొరకు ఇండియాలో జరిగిన యుద్ధముల ఖర్చు ఇండియాయే భరించినది. తమ

విజయములకయిన వ్యయమును ఇండియా ప్రజలచేతనే పెట్టించే పద్ధతి బ్రిటిషువారు నిర్విఘ్నముగా కొనసాగించిరి. తమకు పగవారుకాని పొరుగు దేశస్థులను (బర్మావారు, ఆఫ్ఘనులు) జయించుటకు హిందూ దేశ ప్రజలుతమ ధన, ప్రాణములనుకూడా అర్పించిరి. యుద్ధములు ధన క్షయమునకు కారణము కాబట్టి ఈ యుద్ధములవల్ల ఇండియా కొంతవరకు పేదస్థితికివచ్చెను. యుద్ధమన్నప్పుడు బహుమాన ధనము విజేతలు చేజిక్కించుకొందురని సింధు విషయములలో చూచి ఉన్నాము కదా! ఈ కారణములవల్లా, ఇంకా ఇతర కారణములవల్లా హిందూ దేశము బీదపడి ఉన్నప్పటికీ బంగారమునూ, వెండిన్నీ తూర్పు ఇండియా వర్తక సంఘము ఖజానాలోకి ప్రవహించడం జరుగుతూనే ఉంది. లేకుంటే ఆ కంపెనీ వాటాదార్లకు పెద్ద లాభాలు పంచిబెట్టడానికి ఎట్లా వీలవుతుంది ?

బ్రిటిషువారు ఇండియాను పాలించే మొదటి రోజులలో బాధ్యత లేని వర్తకులు విచ్చలవిడిగా వర్తకముచేస్తూ, దేశాన్ని కొల్లగొడుతూ ఉండేవారని ఇదివరలో నీకు చెప్పాననుకుంటాను. తూర్పు ఇండియా వర్తకసంఘమువారున్నూ, వారి ఏజంట్లున్నూ ఈ విధముగా ఇండియాలో పేరుకొన్న పెద్ద ధన మొత్తమును తీసుకుపోయిరి. ఇండియాకు ఎట్టి ప్రతిఫలమూ లేకుండానే ఇది జరిగింది. సామాన్య వర్తక సరళిలో ఇచ్చి పుచ్చుకోడాలు ఉంటవి. కాని ప్లాసీ యుద్ధానంతరము 18 వ శతాబ్ది రెండవ భాగములో ధనము ఒక మార్గమునేపట్టి ఇంగ్లాండుకు ప్రవహించెను. ఈ విధముగా ఇండియా తన ప్రాచీన భాగ్యమును చాలావరకు కోల్పోయింది. ఇంగ్లాండులో మార్పు జరుగుచూ ఉన్న కాలంలో ఈ ధనము దాని పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడింది. ఇండియాలో బ్రిటిషు పరిపాలనా యుగము మొదటి భాగము వర్తకముమీదా, దోపుడుమీదా ఆధారపడి ఉండెను. ఇది సుమారు 18 వ శతాబ్దాంతమునకు అంతమునకు వచ్చెను.

బ్రిటిషు పరిపాలనా యుగము రెండవ భాగము 19వ శతాబ్దిలో పడెను. ఆ కాలమున ఇండియాలోని ముడి వస్తువులు ఇంగ్లాండులోని ఫ్యాక్టరీలకు పంపబడుచుండెను. బ్రిటనులో తయారైన వస్తువుల నమ్మకటకు, ఇండియా వ్యాపారరంగముకూడా అయినది. ఇండియా పురోభివృద్ధికినీ, ఆర్థికాభివృద్ధికిన్నీ వ్యతిరేకముగా ఈ రెండు పనులునూ జరుగుచుండెను. డబ్బు చేసికొనుటయే ఉద్దేశముగాగల వట్టి వర్తక సంఘమైన తూర్పు ఇండియా సంఘము ఈ శతాబ్ది మొదటి భాగములో ఇండియాను పాలించ మొదలుపెట్టెను. ఇది ఇట్లుండగా బ్రిటిషు పార్లమెంటువారు నానాటికీ ఎక్కువగా ఇండియా వ్యవహారములను గురించి తెలిసికొనజొచ్చిరి. తరువాత, 1857–58 తిరుగుబాటు అనంతరము, బ్రిటిషు గవర్నమెంటువారు స్వయముగా ఇండియా పాలనమును గ్రహించిరి. కాని రాజ నీతిలో ముఖ్యమైన మార్పులేమీ లేవు. తూర్పు ఇండియా సంఘమును నడిపించే తరగతి ప్రజల ప్రతినిధులే ప్రభుత్వములో నుండిరి.

ఇండియా ఆర్థిక క్షేమమునకూ, ఇంగ్లాండు ఆర్థిక క్షేమమునకూ సంఘర్షణ తటస్థించింది. సర్వాధికారములూ ఇంగ్లాండు చేతులలో ఉండుటచేత దాని ఆర్థిక క్షేమమునే అది నిర్ణయించుకొన్నది. ఇంగ్లాండులో పారిశ్రామిక విధానము ప్రవేశించకముందే ఒక ప్రసిద్ధ ఇంగ్లీషు రచయిత, తూర్పు ఇండియా సంఘము ఇండియానేలుటవల్ల కలుగు కీళ్ళను గురించి వెల్లడిచేశాడు. ఇతడు ఆడం స్మిత్ అనువాడు. ఇతనినే రాజకీయార్థ శాస్త్రము (Political economy) నకు పిత అంటారు. అతడు వ్రాసిన ప్రసిద్ధ గ్రంథము "ది వెల్తు ఆఫ్ నేషన్సు" (జాతుల భాగ్య సంపద). అది 1776 లో ప్రకటింపబడినది. ఆ గ్రంథమున తూర్పు ఇండియా సంఘమును గురించి అతడిట్లన్నాడు:

"కేవలమూ వర్తకుల సంఘము చేసే పరిపాలనము. ఏ దేశమునకైనాసరే, చాలావికృష్టమైనది. వారిని పాలకులుగా

భావించినట్లైతే, తూర్పు ఇండియా సంఘమువారు చేయవలసిన పని హిందూదేశమునకు తీసుకువెళ్ళిన యూరోపియన్ సరుకులు అక్కడ ఎంత చవుకగా అమ్ముటకు వీలగునో అంత చవుకగా అమ్మవలెను. ఇండియానుంచి కొంపోయిన ఇండియన్ సరుకులు ఇంగ్లాండులో ఎంత ప్రియముగా అమ్ముటకు వీలగునో అంత ప్రియముగా అమ్మవలెను. వారిని వర్తకులుగా భావించినట్లయితే దీనికి విరుద్ధముగా చేయడమే వారికర్తవ్యము. పాలకులుగా వారు దేశక్షేమమునే తమ క్షేమముగా భావిస్తారు. వర్తకులుగా వారు దేశ క్షేమము తమ క్షేమమునకు వ్యతిరేకమనిభావిస్తారు."

ఇండియాకు బ్రిటిషువారు వచ్చినప్పుడు అచ్చటి పాత ఫ్యూడల్ విధానము విచ్ఛిన్నమగుచున్నదని నేను చెప్పిఉంటిని. మొగలుసామ్రాజ్య పతనమువల్ల ఇండియా అనేక భాగములలో రాజకీయముగా గందరగోళము, అల్లరులు తటస్థించినవి. అయినప్పటికీ ఆర్థిక శాస్త్రవేత్తయైన రమేశ చంద్రదత్తు చెప్పినట్లు "18 వ శతాబ్దిలో ఇండియా వస్తువుల నిర్మించుట యందునూ, వ్యవసాయమునందునూ గొప్పదేశమని ప్రసిద్ధ గన్నది. హిందూ దేశపు చేమగ్గములు ఆసియా, యూరోపు వ్యాపార రంగములకు వస్త్రములు సరఫరా చేస్తూండేవి." ప్రాచీన కాలమున విదేశ వ్యాపారరంగములను ఇండియా కైవసముచేసుకొన్నదని వెనుకటి జాబులలో నేను వ్రాసిఉన్నాను. ఈజిప్టులో నాలుగువేల సంవత్సరములకు క్రితము మమ్మీలు అను రక్షిత మృతకళేబరములను కప్పుటకు సన్నని ఇండియా మస్లిను వాడేవారు. ప్రాక్పాశ్చాత్య దేశములలో హిందూదేశ శిల్ప కౌశల్యము ప్రసిద్ధిగాంచెను. రాజకీయముగా పతనమైనప్పటికీ భారతశిల్పులు తమకరకౌసలమును విస్మరించలేదు. వ్యాపారము కొరకు ఇండియాకు వచ్చిన ఇంగ్లీషు వర్తకులున్నూ, విదేశ వర్తకులున్నూ విదేశపు సరుకును ఇండియాలో అమ్ముటకు రాలేదు. వారు వచ్చినది, ఇండియాలో తయారైన సున్నితమైన వస్తువులను

కొనుక్కొని యూరోపులో పెద్ద లాభములకమ్ముటకే. యూరోపియన్ వర్తకులు తొలుదొల్త ముడి వస్తులచే ఆకర్షింపబడి ఇండియాకురాలేదు. వారు ఇండియాలో తయారైనవస్తువులచే అకర్షింపబడియే వచ్చిరి. ఇండి యాలో ప్రభుత్వాధికారము పొందకముందు తూర్పుఇండియా సంఘము ఇండియాలో తయారైన నూలుబట్టలను, ఉన్నిబట్టలను, పట్టుబట్టలను, బుటేదారి పనిచేసిన వస్త్రములను అమ్మి లాభములు పొందుచుండెను. నూలు, పట్టు, ఉన్ని వస్త్రములు తయారు చేయుటలో ప్రత్యేకముగా ఇండియా ఎక్కువ నేర్పు సంపాదించింది. రమేశ చంద్రదత్తు చెప్పు చున్నాడు—"బట్టలనేత ఇండియా ప్రజలకు జాతీయ పరిశ్రమగాఉండెను. వేలకొద్ది స్త్రీలు నూలు వడకు కార్యమున నిమగ్నులై యుండిరి." హిందూదేశమున తయారైన వస్త్రములు ఇంగ్లాండుకు, యూరోపులోని ఇతర ప్రాంతములకు, చీనాకు, జపానుకు, బర్మాకు, అరేబియాకు, పరిషియాకు, ఆఫ్రికాలో కొన్ని ప్రాంతములకూ పోవుచుండెను.

1757 లో క్లైవు, బెంగాలులోనున్న మూర్షిదాబాదు నగరము నిట్లు వర్ణించెను—"ఈ నగరము ఎంతో విస్తరించి యుండెను. జనా కీర్ణమై యుండెను. లండనువలె భాగ్యవంతమై ఉండెను. కాని ఒక్క తేడామాత్రమున్నది. మూర్షిదాబాదులోని కొందరు జనులు, లండనులోని జనులకన్న ఎంతో భాగ్యవంతులు." ఇది ప్లాసీ యుద్ధము జరిగిన సంవత్సరమే. ఈ సంవత్సరమందే ఇంగ్లీంషువారు బెంగాలులో స్థిర పడ్డారు. బెంగాలు, రాజకీయముగా పతనమగు సమయమున భాగ్య వంతముగా ఉండెను. ఎన్నో పరిశ్రమలందుండెను. ప్రపంచము వివిధ భాగములకు అది తన సున్నితమగు వస్త్రములను పంపుచుండెను. సున్నితమగు మస్లినులకు ముఖ్యముగా డక్కానగరము ప్రసిద్ధిగాంచెను. వాటితో గొప్ప ఎగుమతి వ్యాపారము సాగించుచుండెను.

ఈ కాలమున ఇండియా వట్టి పల్లెటూళ్ళ వ్యవసాయ దేశమే కాక ఎంతో అభివృద్ధి చెందియుండెను. వెనుకటి కాలముననూ, నేటి

కాలమునందూ, అది ప్రధానముగా వ్యవసాయ దేశముగా ఉన్నమాట వాస్తవమే. ముందుకూడా అది అట్లే ఉండి తీరవలెను. కాని పల్లె జీవనముతోపాటూ, వ్యవసాయముతోపాటూ పట్టణవాసముకూడ వృద్ధి నందినది. ఈ పట్టణములలో శిల్పులూ, చేతిపనులవాళ్ళూ సమావేశమగు చుండిరి. అందరును కలిసి ఉత్పత్తి చేయుచుండిరి—అనగా నూరుగాని, అంతకు పైగాగాని శిల్పులను సమావేశపరచి వారిచే పనిచేయించు చిన్న ఫ్యాక్టరీలు అప్పుడుండెను. తరువాత కాలమున యంత్రయుగమున అవతరించిన పెద్ద ఫ్యాక్టరీలకూ వీటికీ పట్టి పోలికాలేదు. పారిశ్రామిక పరివర్తనము రాక పూర్వము పదహరు యూరోపులో, ముఖ్యముగా నెదర్లాండులలో ఇట్టి ఫ్యాక్టరీలు అనేక ముండెడివి.

ఇండియా అప్పుడు మార్పు చెందుచుండెను. అది వస్తునిర్మాణము చేసే దేశముగా ఉండెను. ఈ పట్టణములలో బూర్జువా తరగతి ప్రజలు తయారగుచుండిరి. ఈ ఫ్యాక్టరీల యజమానులు పెట్టుబడిదారులు. వీరు పనివాళ్ళకు ముడి సరుకు సరఫరా చేసేవారు. కాల క్రమమున ఈ తరగతి ప్రజలు, యూరోపులోవలె, ప్రబలులై ఫ్యూడల్ తరగతి ప్రజలను అంతరింపజేసి వారి స్థానమును తామాక్రమించేవారు. సరిగా ఆ కాలమునందే బ్రిటిషువారు ఇండియాకు వచ్చిరి. తత్కారణమున ఇండియా పరిశ్రమలకు భంగపాటు కలిగెను.

మొట్టమొదట తూర్పు ఇండియా సంఘమువారు హిందూదేశ పరిశ్రమలను ప్రోత్సహించిరి. ఇందుకు కారణము—వారా పరిశ్రమల ద్వారా ధనమును ఆర్జించుచుండిరి. విదేశములలో, ఇండియాలో తయారైన సరుకు అమ్ముటవల్ల బంగారమూ, వెండీ దేశమునకు వచ్చెను. కాని ఇంగ్లాండులోనున్న వస్తునిర్మాతలు ఈ పోటీని సహించలేదు. కావున, 18 వ శతాబ్ది తొలి భాగములో తమ ప్రభుత్వము వారి చేత ఇంగ్లాండుకు వచ్చు హిందూదేశపు సరుకుపై పన్నులు వేయించిరి. ఇండియాలో తయారైన కొన్ని సరుకులు ఇంగ్లాండుకు రాకూడదని

నిషేధించిరి. హిందూదేశపు వస్త్రములను కొన్నింటిని బహిరంగముగా ధరించుట నేరముకింద భావింపబడెను. శాసనము సహాయముతో వారీ బహిష్కరణమును అమలు జరిపిరి. నేడు ఇండియాలో బ్రిటిషు వస్త్ర బహిష్కరణమను మాట ఎత్తుకుంటే జైలు తప్పదు. హిందూదేశ వస్తువులను ఇంగ్లాండు బహిష్కరించుటవల్ల ఆట్టేఇబ్బంది లేకపోయేది. ఇంకా ఇతర వ్యాపార రంగములెన్నో ఉండెను. కాని ఇంగ్లాండు ఆ కాలమున తూర్పు ఇండియా సంఘముద్వారా ఇండియాలో చాలా భాగము తన వశమునందుంచుకొనెను. హిందూదేశ పరిశ్రమలకు హాని కలుగు విధముగా ఇంగ్లాండు తన పరిశ్రమలను ముందుకు నెట్టుకొని పోవుచుండెను. ఎట్టి పన్నులూ చెల్లించవలసిన అవసరము లేకుండా ఇంగ్లీషు వస్తువులు ఇండియాలో దిగవచ్చును. ఇండియాలో శిల్పులు, పనివాళ్ళు తూర్పు ఇండియా సంఘముయొక్క ఫ్యాక్టరీలలో పని చేయు టకు బలవంతము చేయబడ్డారు. వారు హింసలపాలు చేయబడ్డారు. ఇండియాలో ఒక ప్రదేశమునుంచి వేరొక ప్రదేశమునకు వస్తువులు రవాణా చేసినప్పుడు సుంకములు చెల్లించవలసి యుండుననే నియమము కారణముగా ఇండియాలో నాటు వ్యాపారము కుంటుపడింది.

ఇండియాలో నేత పరిశ్రమ మిక్కిలి సమర్థముగా ఉండుటవల్ల, అభివృద్ధినందుచున్న ఇంగ్లీషువారి యాంత్రికపరిశ్రమ సమేతము దానితో పోటీ చెయ్యలేకపోయెను. అందువల్ల 80% సుంకము విధించి దానిని రక్షించుకోవలసివచ్చెను. పందొమ్మిదో శతాబ్ది తొలి రోజులలో ఇండి యాలో తయారైన పట్టు వస్త్రములు, నూలు వస్త్రములు ఇంగ్లాండులో తయారైన వాటికంటె చవుకగా ఇంగ్లాండులోనే అమ్మకమగుచుండెను. ఇంగ్లాండు ఇండియాను పాలిస్తూన్నందు వల్లనూ, ఇండియా పరిశ్రమలను అణగద్రొక్కవలెనని అది సంకల్పించుకొన్నందువల్లనూ ఈ పరిస్థితులు చిరకాలముపాటు నిలవలేదు. ఏమైనప్పటికీ ఇండియాలోని కుటీర పరి శ్రమలు - యంత్ర పరిశ్రమలతో చిరకాలము పోటీ పడజాలవుకదా!

యంత్రములతో వస్తువులు బహుళముగా కొద్దికాలములో చేయవచ్చును. అవి కుటీరములలో తయారైన వస్తువులకంటె చాలా చౌకగా ఉంటవి. కాని కాలానుగుణముగా ఇండియా క్రమేణా మారుటకు ఇంగ్లాండు ఆటంకము కల్పించెను. బలవంతాన తన సరుకును ఇండియాలో అది వ్యాపింప జేసెను.

ఇట్లు కొన్ని వందల సంవత్సరములపాటు "తూర్పు ప్రపంచమునకు లాంకషైరు వంటిదని పేరుగాంచినట్టిన్ని, 18 వ శతాబ్దిలో యూరోపుకు విరివిగా వస్త్రములు సరఫరా చేసినట్టిన్ని ఇండియా తన పదవిని గోల్పోయి బ్రిటిషు సరుకులను వాడుకొనే దేశముగా మారిపోయెను. కాలక్రమేణా ఇండియాకు యంత్రము రావలసినదేకాని రాలేదు. కాని యంత్రముతో తయారు జేయబడ్డ వస్తువులు మాత్రము బయటనుంచి వచ్చిపడ్డవి. విదేశములకు ఇండియాలో తయారైన వస్తువులను తీసుకుపోతూ ఇండియాకు వెండి, బంగారాలు తెచ్చే ప్రవాహము అటునుంచి ఇటు తిరిగింది. అప్పటినుంచి విదేశ వస్తువులు ఇండియాకు రా మొదలు పెట్టినవి, వెండి బంగారాలు ఇండియానుంచి బయటకు పోయినవి.

ఈ దాడికి ప్రతిఫలముగా మొట్టమొదట దెబ్బతిని పడిపోయినది ఇండియా నేత పరిశ్రమ. ఇంగ్లాండులో యంత్ర పరిశ్రమలు వృద్ధియగుచూ రాగా ఇండియాలోని ఇతర పరిశ్రమలకు నేత పరిశ్రమకు పట్టిన గతే పట్టింది. సాధారణముగా దేశ ప్రభుత్వముయొక్క ప్రధాన కర్తవ్యము దేశ పరిశ్రమలను ప్రోత్సహించి రక్షించుట. ప్రోత్సాహ రక్షణములమాట అటుండగా తూర్పు ఇండియా సంఘమువారు బ్రిటిషు పరిశ్రమకు పోటీ వచ్చిన ప్రతీ పరిశ్రమనూ అణచివేసిరి. ఇండియాలోని నౌకా నిర్మాణ పరిశ్రమము కూలిపోయెను. లోహపు పనివాళ్ళు తమ పరిశ్రమలు సాగించలేకపోయిరి. గాజు పరిశ్రమా, కాగితపు పరిశ్రమా కూడా నీరసించిపోయెను.

మొట్టమొదట విదేశ వస్తువులు రేవు పట్టణములకూ, వాటికి సమీపమందున్న నాటు ప్రాంతములకూ చేరుచుండెను. రోడ్లు, రైల్వేలు నిర్మించడం కారణముగా విదేశ వస్తువులు దేశములోని దూరప్రాంతములకు పో మొదలు పెట్టినవి. అందువల్ల గ్రామములలోని శిల్పులు తమ వృత్తులు మానుకోవలసివచ్చెను. సూయజ్ కాలువ త్రవ్వుటవల్ల ఇంగ్లాడుకును, ఇండియాకును మధ్యనున్న దూరము తగ్గినది. బ్రిటిషు వస్తువులిప్పుడు చౌకగా ఇండియాకు తెచ్చుటకు వీలుపడినది. ఇట్లు విదేశ యంత్ర వస్తువులు రానురాను అధికముగా వచ్చి మారుమూల గ్రామములకు కూడా పోజొచ్చెను. పంధొమ్మిదో శతాబ్దిలో ఈ విధముగా జరుగుచుండెను. ఇప్పుడుకూడా కొంతమట్టుకు ఇట్లు జరుగుచున్నది. గత కొద్ది సంవత్సరములనుండి మాత్రము దీనికి కొంత అటంకమేర్పడినది. ఈ విషయమై ముందు ముందు ప్రసంగించుకొందము.

పాకులాడుతూ క్రమ క్రమంగా దేశములో వ్యాపించిన బ్రిటిషు సరుకు—అందు ముఖ్యముగా బట్టలు—ఇండియాలోని పరిశ్రమలు అంతరించుటకు కారణము. ఇంతకన్న విషాదకరమైన విషయ మింకొకటి ఉన్నది. పనిపాటలు పోగా మిగిలిన వేలాది శిల్పుల మాట ఏమిటి? ఉద్యోగమును పోగొట్టుకొన్న నేత పనివాళ్ళూ, ఇతర పనివాళ్ళూ వేలాది ఉండిరి. వారిమాట ఏమిటి? పెద్ద ఫ్యాక్టరీలు తలయెత్తినప్పుడు ఇంగ్లాండులో కూడా శిల్పులకు వృత్తులు పోయినవి. వారు చాలా బాధపడ్డారు. కాని వారికి కొత్త ఫ్యాక్టరీలలో పని దొరికినది. కొత్త పరిస్థితులలో వారు క్రమంగా కుదటబడ్డారు. ఇండియాలోని శిల్పులకు ఈ విధంగా అన్యవృత్తి దొరకలేదు. పని చేయుటకు ఫ్యాక్టరీలు ఇక్కడ లేవు. ఇండియా నేటి పారిశ్రామిక దేశమవడానికి బ్రిటిషువారు ఇష్టపడలేదు. ఫ్యాక్టరీలను స్థాపించుటకు వారు ప్రోత్సాహమియ్యలేదు. కాబట్టి దరిద్రులై కడుపు మాడుచున్న శిల్పులు, ఇల్లులేక, పనిలేక వ్యవసాయమునకు దిగవలసివచ్చినది. కాని వ్యవసాయ వృత్తిలో అప్పటికే చాలా

మంది ఉండుటచేతనున్నూ, అదనముగా భూమి లేనందుననున్నూ వ్యవసాయవృత్తిలోకూడా వారికి సావకాశము చిక్కలేదు. చితికిపోయిన శిల్పులు కొందరు రైతులైరి; కొందరు భూమిలేని కూలీలుగా తయారై కూలిపనులు సంపాదించుకొనుట కెదురు చూచుచుండిరి. అనేకమంది తిండిలేక మరణించి యుందురుకూడా. 1834 లో ఇండియాలోనున్న గవర్నరు జనరలు ఈ విధముగా రిపోర్టు వ్రాసినాడట—"వాణిజ్య చరిత్రలో ఇట్టి దైన్యము ఎన్నడూ కని విని ఉండలేదు. నేతపనివాళ్ళ ఎముకలు ఇండియా మైదానములను తెలుపుచేస్తున్నవి."

ఈ నేత పనివాళ్ళూ, శిల్పులూ పెక్కురు పట్టణములలోనూ, నగరములలోనూ నివసించుచుండిరి. వారి వృత్తులు పోవుటతోడనే వారు పల్లెటూళ్ళుపట్టి భూమిని ఆశ్రయించవలసిన వారైరి. కాన పట్టణముల జనసంఖ్య తగ్గిపోయెను. గ్రామముల జనసంఖ్య పెరిగెను. అనగా ఇండియాలో గ్రామవాసమెక్కువై పట్టణవాసము తగ్గిపోయెను. ఈ గ్రామవాసకార్యము 19 శతాబ్ది అంతలోనూ జరిగెను. ఇంకను అది ఆగ లేదు. ఈ కాలములో ఇండియాలో ఇట్లు జరుగుట వింత విషయము. ప్రపంచమందంతటా యంత్ర పరిశ్రమముకునూ, పారిశ్రామిక విధానము నకునూ ఫలితముగా గ్రామములనుండి ప్రజలు పట్టణములకు ఆకర్షింప బడిరి. ఇండియాలో ఇందుకు వ్యతిరేకముగా జరిగెను. నగరములనూ, పట్టణములునూ చిన్నవై నీరసించెను. అధిక సంఖ్యాకులగు ప్రజలు వ్యవసాయము నాశ్రయించి కష్టజీవితముల గడుపుచుండిరి.

ఇండియాలోని ప్రధాన పరిశ్రమలతోపాటు వాటిని ఆశ్రయించిన చిల్లర పరిశ్రమలుకూడా అంతరించ మొదలుపెట్టినవి. ఏకులు చేయుట, రంగులు వేయుట, అద్దకము అను పరిశ్రమలు నానాటికీ తగ్గిపోయెను. నూలు తీయుట ఆగిపోయెను. వేలాది ఇండ్లనుండి రాటములు అదృశ్య మైనవి. దీనివల్ల రైతులకు వచ్చు అదనపు ఆదాయము పోయినది. నూలు వడకుటవల్ల రైతు కుటుంబములకు కొంత ఆదాయము వచ్చేది.

వ్యవసాయాదాయముతో ఇది చేర్చుకుని వారు కాలక్షేపము చేసేవారు. యంత్రపరిశ్రమ ప్రారంభమైనప్పుడు పడమటియూరోపులో ఇట్లేజరిగెను. కాని అక్కడ ఆ మార్పు సహజముగా వచ్చినది. అక్కడ పాత పద్ధతి అంతరించినప్పుడు కొత్తపద్ధతి ఒకటి దానిస్థానే వచ్చింది. ఇండియాలో ఈ మార్పు బలవంతాన వచ్చినది. కుటీర పరిశ్రమలనే పాత పద్ధతి పట్టుపెట్టబడినది. కాని కొత్తపద్ధతి ఏదీ దానిస్థానే రాలేదు. బ్రిటిషు పరిశ్రమను కాపాడే ఉద్దేశముతో బ్రిటిషు అధికారులు అట్టి పద్ధతిని తల యెత్తనీయలేదు.

బ్రిటిషువారిక్కడ అధికారమును సంపాదించినప్పుడు ఇండియా వస్తునిర్మాణము చేసే భాగ్యవంతమగు దేశముగా నుండెనని మనము తెలిసికొంటిమి. తరువాత దేశములో యంత్రములను ప్రవేశపెట్టి దానిని పారిశ్రామికము చేయుట జరుగవలసి ఉన్నది. కాని ముందుకు పోవుటకు బదులు ఇండియా, బ్రిటిషు రాజనీతి కారణముగా, వెనుకకుపోయెను. వస్తు నిర్మాణము చేయుటకూడా వెనుకబట్టెను. క్రమేణా అది వ్యవ సాయ దేశమైపోయెను.

పని పాటలు లేని శిల్పులును, ఇతరులును వ్యవసాయముపై ఆధారపడవలసి వచ్చెను. భూమికి ఒత్తిడి తీవ్రమయ్యెను. నానాటికీ తీవ్రతరమయ్యెను. హిందూదేశ దారిద్ర్య సమస్యకిది పునాది. మన కష్టములన్నింటికీ ఇదేకారణము. ఈ ఆది సమస్యను పరిష్కరిస్తేనేతప్ప రైతుయొక్కయు, గ్రామవాసియొక్కయు అగచాట్లు అంతమొందవు.

వ్యవసాయము తప్ప మరో వృత్తిలేని బహు సంఖ్యాకులు, భూమిపై ఆధారపడి దానిని చిన్నచిన్న ముక్కలుగా ఖడించివేసినారు. అందరికీ సరిపోయినంత భూమి లేకుండుట ఇందుకుకారణము. రైతు కుటుంబమునకున్న కొద్ది భూమి వారిని పోషించలేదు. మంచి కాలములో కూడా దారిద్ర్యమూ, తిండిలేకపోవడమూ పరిపాటి అయినది. కాల మానమున్నా తరుచు సరిగాలేదు. వారు ఋతువుల, పంచ భూతముల,

ఋతు పవనములపై ఆధారపడి ఉండిరి. కాటకములు, మహావ్యాధులు వ్యాపించి వేలాది జనులను తమ పొట్ట బెట్టుకొను చుండెను. వారు "బనియా" వద్దకు వెళ్ళి డబ్బు అప్పులు తీసుకొనేవారు. వారి అప్పు నానాటికీ పెరిగిపోయేది. తీర్చే ఆశగాని, సావకాశముగాని లేకపోయాయి. జీవనము దుర్భరమైనది. పందొమ్మిదో శతాబ్దిని, బ్రిటిషు పాలనమున, ఇండియాలో బహు సంఖ్యాకుల అవస్థ ఈ విధముగా ఉండెను.

## 111

# ఇండియాలోని గ్రామము, రైతు, భూస్వామి

డిశంబరు 2, 1932

వెనుకటి జాబులో బ్రిటిషువారు ఇండియాలో అవలంబించిన రాజనీతిని గురించి చెప్పాను. తత్ఫలితముగా కుటీర పరిశ్రమలు అంతరించిన వనిన్నీ, చేతిపనివాళ్లు పల్లెలుపట్టి వ్యవసాయవృత్తి నవలంబించవలసి వచ్చినదనిన్నీ చెప్పాను. ఇతరవృత్తులేమీలేని అనేకమంది భూమిని ఆశ్రయించడంవల్ల కలిగిన ఒత్తిడే ఇండియాలో ఏర్పడిన గొప్ప సమస్య అనికూడా చెప్పాను. ఇందువల్లనే చాలావరకు ఇండియా బీద స్థితిలో ఉన్నది. భూమిని వీరు వదలిపెట్టునట్లు చేసి, భాగ్యోత్పాదకములగు వృత్తులలో వీరిని ప్రవేశపెట్ట గలిగినట్లయితే వీరివల్ల దేశము భాగ్యవంత మవుతుంది. అంతేకాదు. భూమిమీద వత్తిడికూడా తగ్గుతుంది. వ్యవసాయమూ బాగుపడుతుంది.

భూమిమీద అమితముగా వత్తిడి ఏర్పడుటకు బ్రిటిసు రాజనీతి కారణము కాదనిన్నీ, ఇండియా జనసంఖ్య పెరగడమే కారణమనిన్నీ తరుచు చెప్పడంకద్దు. ఇది సరియైనవాదముకాదు. గత 100 సంవత్సరములలోనూ ఇండియా జనసంఖ్య పెరిగినమాట వాస్తవమే. ఇతర దేశము

లనేకములోకూడా ఈ విధముగానే జనసంఖ్య పెరిగింది. యూరోపులో— అందు ముఖ్యముగా ఇంగ్లాండు, బెల్జియం, హాలెండు, జర్మనీలలో— ఇండియాలోకంటె అధికముగా జనసంఖ్య పెరిగింది. ఒకదేశ జనసంఖ్య పెరగడమూ, లేదా ప్రపంచ జనసంఖ్య పెరగడమూ, పెరిగిన జనులకు ఆహారము నేర్పాటు చేయడమూ, జనసంఖ్య నవసరమైనప్పుడు అరికట్టడమూ—అనే విషయములు చాలా ప్రధానమైనవి. ఈ విషయములిప్పుడు ఎత్తుకుంటే ఇతర విషయములతో కలిసిపోయి గందరగోళమవుతవి. ఇండియాలో భూమిమీద వత్తిడికి నిజమైన కారణము వ్యవసాయము వినా అన్యవృత్తులు లేకుండుటయే అనిన్నీ, జనసంఖ్యపెరగడం కారణము కాదనిన్నీ నేను స్పష్టముగా విశదపరచదలచితిని. ఇతర వృత్తులూ, పరిశ్రమలూ నెలకొల్పినట్లయితే నేటి ఇండియా జనసంఖ్యకు చేతినిండా పని ఉంటుంది. వారు వర్ధిల్లగలరు. కొంత కాలము గడచిన తరువాత ఇండియా జనసంఖ్య పెరగడమును గురించి తగిన చర్య తీసుకోవలసి ఉంటుంది.

ఇండియాలో బ్రిటిషువా రవలంబించిన రాజనీతికి సంబంధించిన ఇతర విషయములనుగురించి మనమప్పుడువిచారింతము. మొట్టమొదట పల్లెటూరి నెత్తుకొందము.

నేను నీకు అనేక పర్యాయములు ఇండియాలోని పంచాయతీలను గురించి వ్రాసి ఉన్నాను. ఎన్ని దండయాత్రలు వచ్చినా, ఎంత మార్పు వచ్చినా అవి అట్లాగే నిలిచి ఉన్నవనిచెప్పాను. 1830 లో ఒక బ్రిటిషు గవర్నరు, సర్ ఛార్లస్ మెట్కాఫ్ అనువాడు ఈ గ్రామ సంఘములను గురించి ఈ విధముగా వ్రాసియున్నాడు.

> "ఈ గ్రామ సంఘములు చిన్న ప్రజాప్రభుత్వములవంటివి. వాటికి కావలసిన సర్వ విషయములూ పరిష్కరించుకొనే అధికారము వాటికుండెను. విదేశములతో సంబంధములు వాటికి లేవు. ఏది నిలిచినా, ఏది నిలవకున్నా ఇవిమాత్రము శాశ్వత

ముగా నిలిచేటట్లుతోచును. ప్రతిఒక్క గ్రామసంఘము స్వతంత్ర మైన చిన్న రాష్ట్రమువలె ఉండెను. అది అన్ని విధములా ప్రజలకు సౌఖ్యము కూర్చుచుండెను. ఎక్కువగా స్వేచ్ఛ ననుభవించుటకు తోడ్పడుచుండెను."

ప్రాచీన గ్రామ సంఘములగూర్చి చేసిన ఈ వర్ణన వాటికి చాలా గౌరవ ప్రదముగా ఉండెను. దీనినిబట్టి చూచినట్లయితే ఆనాటి గ్రామ పరిస్థితులు బహు చక్కగా ఉన్నట్లు తోచును. తమ తమ గ్రామములలో వారికంత స్వేచ్ఛ యుండుట ఒక మంచివిషయము. అందు ఇతర మంచి విషయములుకూడా కలవు. కాని అందలిలోపములను మనము విస్మరించరాదు. మిగత ప్రపంచముతో సంబంధము లేకుండ తమకేవిధముగాను లోటులేని గ్రామ జీవనమును గడపుటవల్ల ఏ విషయమందును అభివృద్ధి కలుగదు. దేశముల అన్యోన్య సహకారమువల్లనే పెరుగుదలా వృద్ధీ కలుగును. ఒక వ్యక్తిగాని, ఒక సంఘముగాని తనకు తానై ఒంటరిగా బ్రతికినట్లయితే ఆ వ్యక్తిగాని, సంఘముగాని కూపస్థమండూకమువలె తయారగును. ఒంటెత్తుగుణమూ, సంకుచితాభిప్రాయములూ, మూఢ విశ్వాసములూ వారిలో పెరుగును. పట్టణవాసులతో పోల్చి చూస్తే పల్లెటూరి ప్రజలు తరుచు సంకుచితాభిప్రాయులుగానూ, మూఢ విశ్వాసము కలవారుగానూ కనబడుదురు. కాబట్టి అనేక మంచి విషయములతో కూడుకొన్న గ్రామ సంఘములు అభివృద్ధిచెందు కేంద్రములు కాజాలవు. అవి వెనుకబడ్డ పాతకాలపుసంస్థలు. ముఖ్యముగా పట్టణములందే చేతిపనులూ, పరిశ్రమలు వర్ధిల్లుచుండెను. చాలా గ్రామములలో అనేకులు నేత పనివాళ్లు ఉండేవారన్నమాట వాస్తవమే.

గ్రామ సంఘములు దేనికది ప్రత్యేకముగా ఒకదానితో ఒకటి అట్టే సబంధం లేకుండా ఉండడానికి కారణము ప్రయాణ సదుపాయములు లేకపోవడమే. గ్రామములకూ గ్రామములకూ మధ్యనుంచి రోడ్లులేవు. ఇందువల్లనే కేంద్రప్రభుత్వము గ్రామ వ్యవహారములలో అట్టే కలుగ

జేసి కొనడములేదు. పెద్ద నదుల ప్రక్కగాని, సమీపమందుగాని ఉన్న గ్రామములు, పట్టణములూ పడవలమీద రాక పోకలు చేయవచ్చును. కాని ఈ విధముగా పనికివచ్చేనదులు ఎక్కువలేవు. ప్రయాణ సౌకర్యములు లేని కారణము చేతనే దేశములోపల వర్తకము బాహాటముగా జరుగ వీలులేకుండెను.

చాలా సంవత్సరములపాటు తూర్పు ఇండియా సంఘమువారు ధనార్జనమందును, వాటాదార్లకు లాభములు పంచిపెట్టుటయందును నిమగ్నులై ఉండిరి. రోడ్లు వేయుటకు వారు డబ్బు ఖర్చుపెట్టలేదు. విద్యకసలే ఖర్చుపెట్టలేదు. దేశారోగ్యమునకును, వైద్యశాలలు మున్నగువానికిని అసలే ఖర్చుపెట్టలేదు. కాని కొంతకాలము జరిగిన పిమ్మట, బ్రిటిషువారు ఇండియాలోని ముడి పదార్థములను కొంటూ బ్రిటనులో యంత్రముమీద తయారైన వస్తువులను ఇక్కడ అమ్ముతూ ఉండడం పరిపాటియైన తరువాత, ప్రయాణ సౌకర్యములను కల్పించు విషయమై వారు భిన్న మార్గము నవలంబించిరి. అభివృద్ధి నందుచున్న విదేశ వర్తకమునకనుకూలముగా నుండుటకు హిందూదేశ సముద్ర తీరములందు కొత్త నగరములు తలయెత్తినవి. ఈ నగరములు—బొంబాయి, కలకత్తా, మద్రాసు, మరికొన్నాళ్ళకు కరాచీవంటివి— ప్రత్తి మున్నగు ముడి పదార్థములను, విదేశములకు ఎగుమతి చేయడానికి పోగుచేస్తూ, విదేశములలో యంత్రములమీద తయారైన వస్తువులను, ముఖ్యముగా ఇంగ్లాండునుండి వచ్చిన వాటిని ఇండియాలో అమ్మకము నిమిత్తమై అందుకొంటూ ఉండేవి. పడమటి దేశములలో అభివృద్ధి నందుచున్న—లివర్పూల్, మాంచెస్టర్, బర్మింగుహామ్, షెఫీల్డు వంటి—పారిశ్రామిక నగరములవంటివి కావివి. యూరోపియన్ నగరములు వస్తునిర్మాణము చేయు కేంద్రములు: వస్తువుల తయారు చేసేటందుకు పెద్ద ఫ్యాక్టరీలు అందుండెను. ఈ వస్తువులను రవాణా చేయుటకు రేవు పట్టణములుండును. ఇండియన్ నగరములన్ననో—అందు ఎట్టి వస్తువులను

తయారుకావు. విదేశ వర్తకము కొరకు ఏర్పరచబడ్డ డిపోలు మాత్రమే అవి. పారతంత్ర చిహ్నములవి.

బ్రిటిషు నీతి కారణముగా ఇండియాలోని పట్టణములందుండు ప్రజలు పల్లెలకు పోయి భూమిని ఆశ్రయిస్తున్నారని ఇదివరలో నీకు వ్రాసియుంటిని. ఆ కారణమున ఇండియా నానాటికీ పల్లెవాసమగుచున్న దనిన్నీ వ్రాసియుంటిని. ఇది ఇట్లా జరుగుచున్నప్పటికీ, ఈ కార్యముకు ప్రతిబంధం లేకుండా సముద్రతీరమందలి నూతన పట్టణములు వృద్ధి నందుచుండెను. ఇవి ఇట్లు పెరుగుటవల్ల చిన్న నగరములూ, పట్టణ ములూ దెబ్బతినుచుండెను. కాని పల్లెలకెట్టి ఇబ్బందీ లేకుండెను. ప్రజలు పల్లెల నాశ్రయించుచునే ఉండిరి.

ముడి వస్తువులను పోగుచేయుటకునూ, విదేశ వస్తువులను దేశముమీద వ్యాపింపజేయుటకునూ వీలుగా ఉండుటకై సముద్రతీర పట్టణములకు దేశాంతర్భాగములతో సంబంధముండవలెను. రాష్ట్ర రాజ ధానులుగా మరికొన్ని నగరములుకూడా వృద్ధినందజొచ్చెను. ఈ కారణ ముల వల్ల ప్రయాణ సౌకర్యములు కల్పింపవలసివచ్చెను. రోడ్లు వేయ బడెను. తరువాత రైళ్లు వేయబడెను. మొట్టమొదటి రైల్వే 1853 లో బొంబాయిలో వేయబడెను.

హిందూదేశ పరిశ్రమలను నాశనము చేయుటవల్ల క్రొత్త పరిస్థితు లేర్పడెను. ఈ పరిస్థితుల కనుగుణముగా సంచరించుట గ్రామ సంఘము లకు కష్టముగా నుండెను. కాని మంచిరోడ్లు, మంచిరైళ్లు పడి దేశ మందంతటా వ్యాపించుటవల్ల ప్రాచీన గ్రామసంఘములు, ఎంతోకాలము నుంచి చక్కగా పనిచేస్తున్నవే అయినప్పటికీ, విచ్ఛిన్నమై నశించినవి. ప్రపంచమేవచ్చి గుమ్మముముందర నిలిచి పిలుస్తూ ఉన్నప్పుడు ఈ చిన్న గ్రామ ప్రజాప్రభుత్వములు ప్రపంచముతో సంబంధం పెట్టుకో కుండా ఎట్లా ఉండగలవు? వస్తువులొక గ్రామమునుండి వేరొక గ్రామము నకు సులభముగావెళ్లుటకు అనుకూలములున్నవి కాబట్టి ఒక గ్రామములో

వస్తువులకున్న ధరనుబట్టి వేరొక గ్రామమందలి వస్తువుల ధరలు నిర్ణయమౌతూండేవి. ప్రపంచమందు ప్రయాణ సౌకర్యములు అభివృద్ధి చెందుచు రాగా కెనడా, అమెరికా సంయుక్త రాష్ట్రములలోని గోధుమల ధరలు ఇండియా గోధుమల ధరలో మార్పు కలిగిస్తవి. ఈ విధముగా, పరిస్థితుల ప్రభావంవల్ల, హిందూదేశ గ్రామపద్ధతి ప్రపంచ ధరలకు కట్టుబడవలసివచ్చెను. గ్రామమునందలి ఆర్థిక విధానము విచ్ఛిన్నమై పోయినది. ఒక కొత్త విధానము బలవంతముగా రైతుమీద వచ్చి పడినది. ఇది అతనిని విస్మితుని చేసినది. గ్రామములో అమ్మకమునకై, ఇదివరలో ఆహార పదార్థములూ ఇతర సరుకూ అతడు ఉత్పత్తి చేసే వాడు. ఇప్పుడన్ననో ప్రపంచ వ్యాపార రంగమునకై అతడు సరుకు ఉత్పత్తిచేయ మొదలుపెట్టెను. ప్రపంచమందలి ఉత్పత్తి, ప్రపంచ మందలి ధరలు అనే సుడిగుండములో పడి అతడు మునిగిపోయెను. పంటలుపాడైనప్పుడు ఇదివరలో కాటకములు ఇండియాలో ప్రవేశించేవి. అప్పుడు వారు దేశముయొక్క ఇతర ప్రాంతములనుండి ఆహార పదార్థ ములను తెప్పించుకొనుటకు వీలుండేవికావు. అందువల్ల తిండికి కరువు వచ్చేది. ఇప్పుడు ఒక వింతవిషయము పొడచూపింది. తినడానికి కావలసి నంత దొరుకుచున్నా ప్రజలు మాడవలసివచ్చింది. ఒకవేళ గ్రామములో ఆహార పదార్థములు లేకున్నా ఇతర ప్రదేశములనుండి రైళ్లు మున్నగు సాధనములద్వారా ఆహార పదార్థాలు త్వరలో తెప్పించుకోవచ్చును. ఆహార పదార్థాలు లేకపోలేదు. కాని కొనుక్కొనుటకు ప్రజలకు డబ్బు లేదు. కాబట్టి ఇప్పుడున్నది డబ్బు కాటకము. తిండి కాటకము కాదు. ఇంతకన్న వింతవిషయము—పంటలు బాగా పండినప్పుడుకూడా రైతులకు కష్టములు తప్పలేదు. ధరలు మందగించిన గత మూడు సంవత్సరముల లోనూ ఇట్లేగదా జరిగింది!

ఇట్లు ప్రాచీన గ్రామవిధానము అంతరించింది. పంచాయతీలు అదృశ్యమైనవి. ఇందుకు మనము విచారించవలసిన పనిలేదు. ఆ

విధానము నేటి పరిస్థితుల కనుగుణముగా లేదు. కాని నేటి పరిస్థితుల కనుగుణముగా క్రొత్త విధానమేదీ దానిస్థానే రాకుండానే అది అంత రించింది. సరియైన విధానము పొడచూపుటకు మనమింక కృషి చేయ వలసి ఉన్నది.

బ్రిటిషు రాజనీతి కారణముగా భూమికి, రైతుకు పరోక్షముగా తటస్థించిన ఫలితములను గురించి మనము ఇంతవరకూ చర్చించుకొన్నాము. తూర్పుఇండియా సంఘమువారు భూమివిషయమున అవలంబించిన ప్రత్యక్ష రాజనీతిని గురించి ఇప్పుడు విచారింతము. ఈ నీతి కారణముగా రైతు ఏమయినాడు? భూమీ, దానికి సంబంధించిన యావద్విషయములూ ఎట్టి మార్పు చెందినవి? ఇది చాలా క్లిష్ట విషయము. చదవడానికి విసుగుగాకూడా ఉంటుంది. కాని మనదేశములో బీదరైతు లెందరో ఉన్నారు. వారికష్టము లెట్టివో మనము తెలిసికో వలసి ఉన్నది. వారికెట్టి సేవచేసి వారి పురోభివృద్ధికి మనమేవిధముగా తోడ్పడవలసి ఉంటుందో మనము ఆలోచించవలెను.

జమీందార్లనీ, తాలూకాదార్లనీ, వారి కౌలుదార్లనీ అనడం మనము వింటున్నాము. కౌలుదార్లు అనేక తరహాలుగా ఉన్నారు. కౌలుదార్లకింద మళ్ళీ కౌలుదార్లు ఉన్నారు. ఈ క్లిష్ట విషయాలలోకి నిన్నుతీసుకుపోను. స్థూలముగా చూస్తే, నేటి జమీందారులు మధ్యవర్తులు—అనగా వారు వ్యవసాయదారునకు, దొరతనమునకు మధ్యగా వర్తిస్తూంటారు. వ్యవసాయ దారుడు వారి కౌలుదారు, భూమి జమీందారులదని భావన. ఆ భూమిని వ్యవసాయదారుడు ఉపయోగించుకొన్నందుకు వారికి శిస్తు (అనగా ఒక విధమగు పన్ను) చెల్లించును. వసూలు చేసిన ఈ శిస్తులో కొంతభాగము జమీందారు, ప్రభుత్వమునకు, తన భూమిపై పన్ను కింద, చెల్లించును. ఇట్లు భూమినుండి వచ్చు ఫల సాయము మూడు భాగములగుచున్నది. ఒక భాగము జమీందారుకు పోవును. ఒక భాగము ప్రభుత్వమునకు పోవును. మూడవ భాగము కౌలుదారైన వ్యవసాయ

దారునకు మిగులును. ఈ భాగములు సరిసమానమైనవి కావుసుమా! వ్యవసాయదారుడు పొలములో పనిచేయును. అతడు దున్నును, విత్తును, అనేక విధములుగా పాటుపడును. తత్కారణమున భూమి ఫలించును. అతడు పడ్డ కష్టములకు ఫలమతడనుభవించవలెనని తోచును. సంఘము తరఫున పనిచేసే ప్రభుత్వము సంఘ శ్రేయస్సుకొరకు ముఖ్య కార్యములనేకము చేయవలసి ఉన్నది. పిల్లలందరికీ చదువు చెప్పించవలెను. మంచి రోడ్లు వేయవలెను. ప్రయాణ సౌకర్యములు కల్పించవలెను. వైద్యశాలలు నిర్మించవలెను. దేశారోగ్యమును కాపాడుటకు తగిన చర్య తీసుకోవలెను. ఉద్యానములు పెంచవలెను. వస్తు ప్రదర్శనశాలలుంచవలెను. ఇంకా ఎన్నో చేయవలెను. ఇందుకొరకై దానికి డబ్బు కావలెను. కాబట్టి పండిన పంటలో కొంత భాగము అది తీసుకొనుట న్యాయమే. ఎంత భాగము తీసుకోవలెననేది వేరొక విషయము. వ్యవసాయ దారుడు ప్రభుత్వమునకిచ్చేది తిరిగి అతనికే వస్తుంది. రావలసి ఉంటుంది. రోడ్లు, విద్య, ఆరోగ్యము, మున్నగు వాటిద్వారా తిరిగి వస్తుంది. నేటి కాలమున ఇండియాలో ప్రభుత్వము నెరపుచున్నది విదేశ ప్రభుత్వము. ఇట్టి ప్రభుత్వమును మనము ఇష్టపడము. కాని సక్రమంగా నడపబడే స్వతంత్ర దేశమున ప్రజలే ప్రభుత్వమగుదురు.

భూమిమీదనుంచి వచ్చే ఫల సాయములో రెండు భాగములను గురించి మనము చర్చించుకొన్నాము—వ్యవసాయదారునికి చెందే భాగము ఒకటి. ప్రభుత్వమునకు చెందే భాగము ఒకటి. మూడవ భాగము మధ్యవర్తియైన జమీందారుకు పోతుందన్నానుకదా: ఈ మొత్త మతనకి చెందడానికి అతడు చేసే పని యేమిటి? దీనిని స్వీకరించుట కతనికి అర్హత ఉన్నదా? అతడు చేసే పని ఏమీలేదు. పంట పండుటకాతడు ఎటువంటి సాయమున్నూ చేయకుండానే ఫలసాయములో పెద్ద భాగమునతడు గ్రహిస్తున్నాడు. అతడు బండికి అయిదవ చక్రమువంటివాడు. అతడుండవలసిన అవసరమేలేదు. అతడుండడం ఒక ఆటంకంకూడా. అవసరమైన

భారముకాదు యిది. దీనిని మోసేవాడూ, బాధపడేవాడూ వ్యవసాయ దారుడు. తాను కష్టపడి ఆర్జించిన దానిలో ఒకపాలు అతనికియ్యవలెను. ఈ కారణము వల్లనే, జమీందారుగాని, తాలూకాదారుగాని అవసరములేని మధ్యవర్తి అనిన్నీ, జమీందారీ పద్ధతి చెడ్డదనిన్నీ, దానిని మార్చి మధ్య వర్తిని లేకుండా చేయవలసి ఉంటుందనిన్నీ పలువురు అభిప్రాయ పడతారు. నేడు ఈ జమీందారీపద్ధతి ఇండియాలో మూడు రాష్ట్రములలో —బెంగాలు, బీహారు, సంయుక్త రాష్ట్రములలో—అమలులోనున్నది.

ఇతర రాష్ట్రములలో వ్యవసాయదారులైన రైతులే, మధ్యవర్తుల అవసరం లేకుండా, ప్రభుత్వమునకు నేరుగా పన్నులు చెల్లిస్తారు. వీరిని ఒక్కొక్కప్పుడు భూస్వాములైన రైతులు అంటారు. ఒక్కొక్క ప్పుడు, పంజాబులోవలె, వీరిని జమీందారులంటారు. కాని ఈ జమీం దారులు బెంగాలు, బీహారు, సంయుక్త రాష్ట్రములలోని పెద్ద జమీందారుల వంటి వారు కారు.

ఇంత వ్యాఖ్యానమైనది కాబట్టి ఇప్పుడు ఒక విషయము చెప్పు తున్నాను. బెంగాలు, బీహారు, సంయుక్త రాష్ట్రములలో ఉండే జమీందారీ పద్ధతి ఇండియాకు క్రొత్త. ఇది బ్రిటిషువారి సృష్టి. వారు రాకముందు ఇండియాలో ఇది లేదు.

వెనుకటి కాలములో ఇట్టి జమీందార్లుకాని, భూస్వాములుకాని, మధ్యవర్తులుకాని లేరు. వ్యవసాయదారులు తమ ఫలసాయములో కొంతభాగము ప్రభుత్వమునకు నేరుగా ఇచ్చేవారు. ఒక్కొక్కప్పుడు గ్రామమందలి వ్యవసాయదారులందరి పక్షమునా పంచాయతీ పన్నులు వసూలు చేసి చెల్లించేది. అక్బరు కాలములో, రాజా తోడరుమల్లు అనే ప్రసిద్ధుడగు ఆర్థికమంత్రి భూమిని జాగ్రత్తగా సర్వే చేయించెను. వ్యవ సాయ దారుని వద్దనుంచి ప్రభుత్వము ఫలసాయములో మూడవవంతు తీసుకొనుచుండెను. ఇష్టమున్న వ్యవసాయదారుడు ధన రూపముగా కూడా పన్ను చెల్లించవచ్చును. ఆనాడు పన్నులు మొత్తముమీద భార

ముగా లేవు. పిమ్మట మొగలు సామ్రాజ్యము చిదికిపోయినది. కేంద్ర ప్రభుత్వము నీరసించినది. పన్నులు సరిగా వసూలు చేయలేకపోయింది. అప్పుడొక క్రొత్త వసూలు పద్ధతి పొడచూపింది. పన్నులు వసూలు చేయుటకు ఉద్యోగుల నేర్పరిచిరి. వారికి జీతములు లేవుకాని, వసూలు చేసిన దానిలో పదవ వంతు వారు తీసుకొనవచ్చును. వారిని రివెన్యూ ఫార్మర్లు (పన్నులు వసూలు చేసే వ్యవసాయదారులు) అనేవారు. ఒక్కొక్కప్పుడు వీరిని జమీందార్లనీ, తాలూకా దార్లనీ కూడా అనే వారు. కాని ఈ మాటలకున్న అర్థము నేడున్న అర్థముకాదు.

కేంద్ర ప్రభుత్వము క్షీణిస్తూన్నకొద్దీ ఈ పద్ధతి దుష్టమగుచూ వచ్చింది. అది ఎట్టి స్థితికి వచ్చినదంటే—ఒక ప్రదేశములో పన్నులు వసూలు చేయడానికి వేలములుకూడా వేసేవారు. ఎవరు ఎక్కువగా పాడుకుంటారో వారికా ఉద్యోగము దక్కేది. దీనికి అర్థమేమిటంటే— ఈ ఉద్యోగము సంపాదించినవాడు నిర్భాగ్యుడగు వ్యవసాయదారు వద్ద నుంచి ఎంత వసూలు చేయడానికి వీలుంటుందో అంతా వసూలు చేయ వచ్చు. ఈ స్వతంత్రమునతడు విశృంఖలంగా వినియోగించేవాడు. ఈ రివిన్యూ ఫార్మర్లను తొలిగించడానికి గవర్నమెంటుకు శక్తి చాలక పోయింది. కాబట్టి క్రమేణా ఈ ఉద్యోగాలు వంశ పరంప రాగతము లైనవి.

తూర్పు ఇండియా సంఘము బెంగాలులో మొదట సంపాదించి నట్లు చెప్పబడే చట్ట సమ్మతమైన హక్కు—మొగలు చక్రవర్తి తరపున రివిన్యూ ఫార్మరుగా ఉండి పన్నులు వసూలు చేయడమే. 1765 లో చక్రవర్తి దయచేసిన దివాని గ్రాంటు ఇదియే. ఇట్లు తూర్పు ఇండియా సంఘము మొగలు చక్రవర్తికి ఒకవిధమగు దివాను అయినది. కాని ఇదంతా బూటకము. 1757 లో జరిగిన ప్లాసీ యుద్ధానంతరము బెంగా లులో బ్రిటిషువారు ప్రబలులైనారు. పాపము మొగలు చక్రవర్తికి ఎక్కడా ఎట్టి అధికారమూ లేదు.

తూర్పు ఇండియా సంఘమున్నూ, అందలి ఉద్యోగులున్నూ మితిలేని ఆశకలవారై ఉండిరి. బెంగాలు ఖజానావారు ఖాళీచేసిరి. ఎక్కడ ధనం కనిపిస్తే అక్కడ వారు దానిని బలవంతముగా గ్రహించుచుండిరి. బెంగాలు, బీహారులను పిప్పిచేసి ఎంత భూమి శిస్తు వసూలు చేయుటకు వీలున్నదో అంతా వసూలు చేయడానికి ప్రయత్నించిరి. తమకింద పని చేయుటకు చిన్న రివిన్యూ ఫార్మర్లను వారు ఏర్పరిచి, అక్రమముగా వారు ఇవ్వవలసిన పన్నును పెంచిరి. కొద్ది కాలములో పన్నులు రెట్టింపయినవి. దయా దాక్షిణ్యములు లేకుండా పన్నులు వసూలు చేయుచుండిరి. సకాలమున పన్నులు చెల్లించలేని వారిని పంపివేయుచుండిరి. రివిన్యూ ఫార్మర్లు వ్యవసాయదారుల పట్ల క్రూరముగా వర్తించుచుండిరి. బలాత్కారముగా పన్నులు వసూలుచేయుచుండిరి. పన్నులు పెంచి, వ్యవసాయ దారులను హింసించి వసూలుచేస్తూ, ఇచ్చుకోలేనివారిని పొలముల నుండి తరిమివేయుచుండిరి. ప్లాసీ యుద్ధము జరిగి 12 సంవత్సరములు కాకముందే, దివానీ గ్రాంటు పుచ్చుకొన్న నాల్గు సంవత్సరముల లోపలనే బెంగాలు, బీహారులలో దారుణ క్షామము సంభవించినది. జనసంఖ్యలో మూడవవంతు తుడిచిపెట్టుకుపోయినది. తూర్పు ఇండియా సంఘము వారి రాజనీతి, అనావృష్టి ఈ క్షామమునకు కారణము. వెనుక ఒక జాబులో 1769—70 లో వచ్చిన క్షామమును గురించి వ్రాసి ఉన్నాను. దేశములో క్షామము తాండవిస్తూన్నప్పటికి తూర్పు ఇండియా సంఘము వారు పూర్తిగా శిస్తులు వసూలు చేస్తూండెరని చెప్పి ఉన్నాను. కంపెనీ ఉద్యోగులు బహుసామర్థ్యముతో ఈపని చేశారని చెప్పుకోవలసిఉన్నది. పురుషులూ, స్త్రీలూ, పిల్లలూ లక్షలాది మరణించిరి. అయినా ఈ ఉద్యోగులు శవములనుండికూడా పూర్తిశిస్తు వసూలుచేసిరి. ఇంగ్లాండులో ఉన్న భాగ్యవంతులకు లాభములు పంచిపెట్టుటకు చేసిన పని ఇది.

ఈ విధముగా ఇరవై ఏళ్ళ పైచిల్లర జరిగింది. దేశములో కాటక మున్నప్పటికీ తూర్పు ఇండియా సంఘమువారు బలాత్కారాన్ని డబ్బు

వసూలు చేయుచుండిరి. చక్కని బెంగాలు రాష్ట్రము ధ్వంసము చేయ బడింది. పెద్ద రివిన్యూ ఫార్మర్లకుకూడా చిప్ప చేతికి వచ్చింది. ఇక బీదరైతు అవస్థ ఎట్లా ఉండినదీ ఊహించుకోవలసిందే. పరిస్థితులు ఎంతో పాడుగా ఉండెను. చివరకు తూర్పు ఇండియా సంఘము కళ్లు తెరిచి పరిస్థితులు బాగుచెయ్యడానికి ప్రయత్నించింది. అప్పుడున్న గవర్నరు జనరలు, లార్డు కారన్‌వాలీస్, ఇంగ్లాండులో ఒక పెద్దభూస్వామి. ఇంగ్లాండులో మాదిరిని ఇండియాలో భూస్వాములను ఏర్పరుచుటకు నిశ్చయించెను. కొంతకాలమునుంచి రివిన్యూ ఫార్మర్లు భూస్వాముల వలెనే ప్రవర్తించుచుండిరి. కారన్ వాలీసు వారితో ఒక నిర్ణయమునకు వచ్చి వారిని భూస్వాములుగా చూడజొచ్చెను. దీనికి ఫలితమేమనగా— తొలిసారి ఇండయాలో మధ్యవర్తి అనేవాడు తలఎత్తెను. వ్యవసాయ దారులు వట్టి కౌలుదార్లయిరి. బ్రిటిషువారీ భూస్వాములతో (జమీందారులతో) నేరుగా లావాదేవీలు పెట్టుకొనుచుండిరి. వీరు కౌలుదార్లను ఇష్టమువచ్చినట్లు చేసుకొనవచ్చును. భూస్వామి క్రౌర్యమునుండితప్పించు కొనుటకు బీదరైతుకెట్టి మార్గమూ లేదు. రక్షణా లేదు.

1793లో బెంగాలు, బీహారులలోని జమీందారులతో కారన్‌వాలీసు చేసుకొన్న నిర్ణయమునకు "శాశ్వత శిస్తు విధానము" అని పేరు. ఈ విధానము అనే పదమునకర్థము—ప్రతీ జమీందారున్నూ గవర్నమెంటుకు ఇయ్యవలసిన భూమి శిస్తును నిర్ణయము చేయుట. బెంగాలు, బీహారు లలో ఇది శాశ్వతముగా నిర్ణయము చేయబడ్డది. మార్పు చేయుటకు వీలులేదు. తరువాత కొంతకాలమునకు బ్రిటిషు పాలనము అయోధ్య కున్నూ, ఆగ్రాకున్నూ ఈశాన్యముగా వ్యాపించినప్పుడు బ్రిటిషువారు తమపద్ధతిని మార్చుకొనిరి. జమీందారులతో వారు తాత్కాలిక నిర్ణయము చేసికొనిరి. బెంగాలులోవలె శాశ్వత నిర్ణయముకాదు. ఈ తాత్కాలిక నిర్ణయమును అప్పుడప్పుడు సాధారణముగా ముప్పై సంవత్సరముల కొకమారు, పునర్విమర్శ చేస్తూ చెల్లించవలసిన భూమిశిస్తును కొత్తగా

నిర్ణయించేవారు. పునర్విమర్శ చేసి కొత్త నిర్ణయమునకు వచ్చినప్పుడల్లా భూమి శిస్తు పెరిగేది.

దక్షిణమున మద్రాసులోనూ దాని చుట్టుపట్టులా జమీందారీపద్ధతి అమలులోలేదు. ఇచ్చట రైతులే భూమికి యజమానులై ఉండిరి. కాబట్టి తూర్పు ఇండియా సంఘమువారు రైతులతోనే నేరుగా నిర్ణయమునకు వచ్చిరి. కాని ఇతర ప్రదేశములందువలెనే ఇచ్చటకూడా కంపెనీ ఉద్యోగస్తులు దురాశా పరులై భూమి శిస్తును అత్యధికముగా నిర్ణయించి క్రూరముగా, బలాత్కారముగా వసూలు చేయుచుండిరి. శిస్తు చెల్లించకుంటే వెంటనే రైతును పొలము విడిచి పొమ్మనేవారు. పాపమతడు ఎక్కడికి పోయేదీ? భూమికి గిరాకీ హెచ్చుగా ఉండెను. తిండిలేక శ్రమపడేవారెప్పుడూ ఉంటూనే ఉండిరి. ఏ షరతులమీదనైనాసరే భూమిని తీసుకోటానికి వారు సిద్ధముగా ఉండిరి. చిరకాలమునుండి బాధపడుచున్న రైతుకు కష్టములు దుర్భరమైనప్పుడు తరుచు అల్లరులూ, వ్యావసాయిక సంక్షోభములూ తటస్థించుచుండెను.

పందొమ్మిదో శతాబ్ది మధ్యభాగమున బెంగాలులో ప్రజలకు మరొక ఉపద్రవము సంభవించెను. నీలిమందు వ్యాపారమును సాగించుటకై కొందరు ఇంగ్లీషులు భూస్వాములైరి. నీలిమందు మొక్కలు సేద్యముచేయు విషయమున కౌలుదార్లతో వారు కఠినమగు షరతులను ఏర్పరుచుకొనిరి. ఇంగ్లీషు భూస్వాముల భూములలో, నిర్ణయించబడ్డ ప్రదేశమందే కౌలుదార్లు నీలిమందు మొక్కలు పెంచవలెను. ఇంగ్లీషు భూస్వాములకు—వీరినే ప్లాంటర్లు (Planters) అంటారు—వారు నిర్ణయించిన ధరలకు వాటిని అమ్మవలెను. ఈ పద్ధతికే ప్లాంటేషన్ పద్ధతి అని పేరు. కౌలుదార్లపై బలవంతాన రుద్దిన షరతులు మిక్కిలి కఠినముగా ఉండుటవల్ల వారు వాటి ప్రకారము నడుచుకొనుట మిక్కిలి కష్టముగా ఉండెను. అప్పుడు ప్లాంటర్లకనుకూలముగా బ్రిటిషు గవర్నమెంటు కలుగజేసికొని ప్రత్యేక శాసనములను పుట్టించెను. ఆ శాసనముల

ప్రకారము పాపమూ కౌలుదార్లు నీలిమందు మొక్కలు సేద్యము చేయ వలసి ఉండెను. శిక్షలతో కూడుకొన్న ఈ శాసనములు కౌలుదార్లను ప్లాంటరులకు కొన్నిపట్ల బానిసలునుగా చేసివేసెను. నీలిమందు ఫ్యాక్టరీల ఏజెంట్లు కౌలుదార్లను భీతావహులను చేయుచుండిరి. ప్రభుత్వము రక్షణ తమకున్నదిగదా అని ఈ ఏజెంట్లు, ఇంగ్లీషువారూ, ఇండియనులూకూడా, ఇష్టమువచ్చినట్లు పీడించుచుండిరి. తరుచు నీలిమందు ధర పడిపోయి నప్పుడు వరి మొదలైన ఇతర పంటలు పండించుకొంటే వ్యవసాయ దారుడికి లాభకరంగా ఉంటుంది. కాని అట్లా చెయ్యనిచ్చేవారుకారు. వ్యవసాయదారుడు ఎంతో కష్టమూ, హైన్యమూ అనుభవించాడు. చివరకు కోపోద్రేకుడై తిరుగబడ్డాడు. రైతులు ప్లాంటర్లపై తిరగబడి ఒక ఫ్యాక్టరీ కొల్లగొట్టారు. కాని వారిని చితుకకొట్టి లొంగదీసుకొన్నారు.

ఈ జాబులో కొంత విపులముగానే పందొమ్మిదో శతాబ్ది మందలి వ్యావసాయిక పరిస్థితులను గురించి వ్రాశాను. హిందూదేశ వ్యవసాయ దారుని అవస్థ నానాటికీ ఏవిధంగా క్షీణించిందో చెప్పడానికి ప్రయత్నించాను. పన్నులు వసూలు చేసేవాడూ, భూస్వామీ, బనియా, ప్లాంటరూ, అతని ఏజెంటూ, తూర్పుఇండియా సంఘముద్వారానో, నేరుగానో కలుగ జేసికొనే అందరికంటె పెద్ద బనియా అయిన బ్రిటిషు గవర్నమెంటూ— వీరూ వారూ అనడం ఎందుకు అతనితో సంబంధమున్న ప్రతివాడూ వ్యవసాయదారుణ్ణి స్వలాభమునకై పీడించేవారని చెప్పాను. ఈ పీడనకు మూలకారణము, బ్రిటిషువారు ఇండియాలో బుద్ధిపూర్వకంగా అను సరించే రాజనీతి. కుటీర పరిశ్రమలను విధ్వంసముచేసి వాటి స్థానే ఇతర పరిశ్రమలను ప్రవేశపెట్టక పోవడమూ; వృత్తి పోగొట్టుకున్న శిల్పు లను గ్రామములకు తరమడమూ; తన్మూలముగా భూమిపై ఒత్తిడి కలగడమూ; భూస్వామి దుష్టచర్యలూ; ప్లాంటేషన్ పద్ధతీ; భూములపై పన్నులధికముగా వేయడం అసాధారణ శిస్తులూ వాటిని దండించి వసూలు చేయడమూ; రైతును అప్పిచ్చే బనియా వద్దకు తోలడం;

బనియా ఇనుప సంకెళ్ళనుంచి రైతు తప్పించుకోలేకపోవడం; శిస్తు సకాలమున ఇచ్చుకోలేనందుకు పొలములనుండి రైతులను పంపించి వేయడమూ; అన్నింటికంటె హెచ్చు—పోలీసువానియొక్క, వస్నులు వసూలు చేసేవానియొక్క, భూస్వామి ఏజెంటుయొక్క, ఫ్యాక్టరీ ఏజెంటుయొక్క రాక్షసత్వమూ—ఇవి కారణముగా రైతు ఉత్సాహము చచ్చింది. అతని ఆత్మకూడా చచ్చినట్లే. దీనికంతకీ ఫలితం ఏమై ఉంటుంది—అనివార్యమైన విషాదము, భీషణ విపత్తు.

దారుణ క్షామములు తలపెట్టినవి. లక్షలాది జనులు నశించిరి. ఆశ్చర్యకరమైనవిషయ మేమిటంటే-తిండిలేక ప్రజలు మలమలమాడుతూ న్నప్పటికీ గోధుమలూ. ఇతర ధాన్యములూ పరదేశములకు, భాగ్య వంతులగు వర్తకుల లాభముల కొరకు ఎగుమతి చేయబడుచుండేవి. కాని అసలు ప్రమాదం భోజన పదార్థములు లేకపోవుటవల్ల తటస్థించ లేదు. దేశముయొక్క ఇతర ప్రాంతములనుండి రైతుకు భోజన పదార్థ ములు తీసుకొని రావచ్చును. కాని కొనుక్కొనుటకు డబ్బులేదు. 1861 లో ఉత్తర హిందూస్థానములో, అందు ముఖ్యముగా మన రాష్ట్రములో గొప్ప కరువువచ్చింది. అప్పుడు నూటికి 8½ మంది చొప్పున జనసంఖ్య నశించిందని చెప్పబడ్డది. 15 సంవత్సరముల తరువాత 1876 లో మరొక దారుణక్షామము రెండు సంవత్సరములపాటు ఉత్తర మధ్య ఇండియాలలోనూ, దక్షిణ ఇండియాలోనూ చెలరేగింది. ఇందధిక ముగా బాధపడ్డది—సంయుక్త రాష్ట్రములూ, మధ్యరాష్ట్రములూ, పంజా బులో కొంత భాగమున్నూ. సుమారు కోటిమంది నశించారు. మళ్ళీ ఇరవై ఏళ్ళు గడచిన తరువాత, 1896 లో వెనుకవచ్చిన ప్రాంతము లందే మరో కరువు వచ్చింది. హిందూదేశ చరిత్రలో ఇంత ఘోర క్షామము మరెప్పుడూ వచ్చినట్లు లేదు. ఈ క్షామము కారణముగా ఉత్తర మధ్య ఇండియాలు క్షీణించి అణగారి పోయినవి. 1900 లో మళ్ళీ ఇంకో కరువు వచ్చింది.

ఒక చిన్న పేరాలో 40 సంవత్సరముల కాలములో తటస్థించిన నాలుగు ఘోర క్షామముల గూర్చి చెప్పి ఉన్నాను. ఈ భయంకర చరిత్రలో ఇమిడి ఉన్న బాధలూ, ఘోరత్వమూ నేను చెప్పనూలేను, నీవు గ్రహించనూలేవు. నీవు గ్రహించవలెనని నాకులేదు. ఇది గ్రహిస్తే నీకు కోపము వస్తుంది. తీవ్రమైన కాఠిన్యభావము నీలో ఉదయిస్తుంది. ఈ వయస్సులో నీకట్టి భావము కలగడము నాకిష్టములేదు.

ఫ్లారెన్సు నైటింగేలును గురించి నీవు విన్నావుకాదూ? ధైర్యశాలిని యగు ఇంగ్లీషు స్త్రీ ఆమె. యుద్ధములో క్షతగాత్రులైన వారికి పరిచర్య చేయుటకై దాదులను తొలుదొల్త ఏర్పాటు చేసిన దీమే. 1878 లో ఆమె ఇట్లువ్రాసెను—"తూర్పుదేశములలో—బహుశా ప్రపంచ మంతటిలోనూ మనకు కనిపించే మిక్కిలి విచారకరమగు దృశ్యము మన తూర్పు సామ్రాజ్యమందున్న వ్యవసాయ దారుడే". "ప్రపంచ మంతటిలో మిక్కిలి సస్య ప్రదమని పేరుగన్న దేశములో, క్షామ మనేది ఎన్నడూ తలయెత్తని దేశములో పలు ప్రదేశములందు, దీర్ఘ కాలముపాటు, కడుపునిండా తిండిలేక ప్రజలు బాధపడుట, మన శాసనముల ఫలమే" అని ఆమె సూచించెను.

అవును, నిజమే. దించుకుపోయిన కళ్ళతో, ఆశా విరహితమైన వ్యాకుల దృష్టులతో కనిపించే మన వ్యవసాయ దారునికన్న విచార కరములగు దృశ్యము లేమున్నవి? ఎన్నెన్ని సంవత్సరములపాటు ఎతెంత భారము ఈ రైతులు వహించారో! కొంతవరకు మంచిస్థితిలో నున్న మనము ఆభారములో కొంత భాగమని మరిచిపోకూడదు. మన మందరమూ—హిందూదేశస్థుడూ, విదేశస్థుడూకూడా—చిరకాలమునుండి బాధ ననుభవించుచుండే రైతును స్వప్రయోజనార్థమై పీడించాము. అతని వీపుమీద కూర్చుంటిమి. అతని వెన్ను విరిగిందంటే ఆశ్చర్యమేమిటి?

చిట్టచివరకు ఆశాకిరణము పొడచూపింది. మంచిరోజులు రాగల వనీ, భారము తగ్గుననీ కించిత్తు సూచనలు కనిపించినవి. ఒక పురుషుడు

ఉదయించాడు. అతడు రైతు కళ్లల్లోకి సూటిగాచూచాడు. వడలిపోయిన అతని హృదయములోకి సూటిగా చూచాడు. అతని దీర్ఘ బాధను కని పెట్టాడు. ఆ పురుషుని దృష్టిలో ఇంద్రజాలమున్నది. అతని స్పర్శలో ఉద్రేకోత్సాహములున్నవి. అతని కంఠములో వివేకమున్నది. అమర శాంతము నిలిచే ఆశ, ప్రేమ, విశ్వాసములున్నవి. అధోగతి పాలై ఉన్న రైతూ, కార్మికుడూ ఇతరులూ అతనిని చూచినప్పుడు, అతనిని విన్నప్పుడు వారి మృత హృదయములు జీవము పోసుకొని మేల్కొన్నవి. అవి పులకరించినవి. వాటిలో ఒక క్రొత్త ఆశ ఉదయించింది. వారు "మహాత్మా గాంధీకి జై!" అని ఉచ్చైస్స్వరములతో ఘోషించిరి. తమ బాధాకుహరములనుండి బయటికి నడిచివెళ్ళుటకు సిద్ధమైరి. కాని ఇంతకాలమునుంచి వారిని అణచిపెట్టి ఉంచిన పాతయంత్రము వారిని సులభముగా వెళ్ళనియ్యలేదు. అది కదిలింది. క్రొత్త ఆయుధములూ, క్రొత్త శాసనములూ, క్రొత్త ఆర్డినెన్సులూ వారిని అణచివేయుటకై బయటపెట్టింది. వారిని బంధించుటకు క్రొత్త సంకెళ్ళు తయారుచేసింది. అయితే తరువాత ఏమి జరిగింది? అది నా చరిత్రలో భాగముకాదు. అది ఇంకా భావికి సంబంధించిన విషయము. "రేపు" "నేడై" నప్పుడు మనకావిషయము తెలియగలదు. కాని ఫలితము విషయమై సందేహ ముంటుందా?

# 112

# ఇండియాను బ్రిటను పరిపాలించిన వైఖరి

డిశంబరు 5, 1932

పందొమ్మిదో శతాబ్దిలో ఇండియా ఎట్లున్నదీ నీకు మూడు పెద్ద ఉత్తరములు వ్రాసి తెలిపాను. అది ఒక పెద్దగాథ. అది ఒక పెద్ద బాధ. ఈ చరిత్రను ఇంకా కుదించి ఉన్నట్లయితే అది అర్థము కావడమే కష్టము. ఈ కాలమునకు నేను హెచ్చు ప్రాముఖ్యమిస్తున్నానుకాబోలు!

ఏ ఇతర దేశములకూ, ఏ ఇతర కాలములకూ నేనింత ప్రాముఖ్యమియ్య లేదు. అది అస్వాభావికము కాదు. నేను హిందూదేశస్థుడను కాబట్టి ఇండియా అంటే నాకిష్టము. దానినిగురించి నాకు ఎక్కువ తెలుసును కాబట్టి విపులముగా వ్రాయగలను. అంతేకాదు. ఈ కాలమునకు సంబంధించిన చరిత్ర పట్టి చరిత్ర మాత్రమేకాదు. ఇప్పుడు మనకు కానవచ్చు నేటి ఇండియా పందొమ్మిదో శతాబ్ది వేదనకు ఫలితముగా పుట్టినది. ఇప్పుడున్న ఇండియాను మనము తెలిసికోదలుచుకొంటే దానిని బాగు చేయుటకుగాని, పాడుచేయుటకుగాని పనిచేసిన శక్తులను గురించి మన మొక్కింత తెలుసుకోవలెను. అప్పుడే మనము వివేకముతో దానిని సేవించగలము. మనమేమార్గ మవలంబించవలెనో, ఏమిచెయ్యవలెనో తెలుసుకోగలము.

హిందూదేశ చరిత్రలోని ఈ కాలమును గురించి నేను చెప్పడం పూర్తికాలేదు. ఈ జాబులలో నేను ఒక్కొక్క అంశమును తీసుకొని దానిని గురించి నీకు చెప్పుతున్నాను. గ్రహించుటసులభమని ఒక్కొక్క అంశమును గురించి నేను ప్రత్యేకముగా చెప్పుతున్నాను. కాని నేను ఏయే ఉద్యమములను గురించీ, మార్పులనుగురించీ చెప్పియుంటినో, ఈ జాబులోనూ, ముందు వ్రాసే జాబులలోనూ చెప్పబోవుచున్నానో ఇవన్ని సుమారు ఏకకాలములో సంభవించాయనిన్నీ, అవి ఒకదాని కొకటి సంబంధం కలిగి ఉన్నవనిన్నీ, అవి కారణముగా నేటి పందొమ్మిదో శతాబ్ది ఇండియా తయారైనదనిన్నీ నీకు బోధపడగలదు.

బ్రిటిషువారు చేసిన కార్యములూ, దుష్కార్యములూ తెలుసుకొని వారి రాజనీతినీ, దానికిఫలితముగా ఇండియాలో వ్యాపించిన దుఃఖమునూ తలుచుకొని నీకొక్కొక్కమాటు కోపము కలుగవచ్చును. కాని ఇది ఎవరితప్పు? మన దుర్బలత్వమూ, మన అజ్ఞానమూ దీనికి కారణము కాదా? దుర్బలత్వమూ, అజ్ఞానమూ నిరంకుశత్వాన్ని ఆహ్వానిస్తవి. మనలో అన్యోన్య కలహములు చెలరేగడంవల్ల బ్రిటిషువారు లాభము

పొందారంటే ఆ తప్పు మనదే. మనలో మనము కొట్లాడుకోవడం మన తప్పు. ప్రత్యేక జనసంఘముల స్వార్థ పరత్వాన్ని ఆధారం చేసుకొని వారు మనలను విడదీసి దుర్బలులనుగా చేయగలిగారంటే ఆ తప్పు మనదే. మనమిట్లా చెయ్యనియ్యడమనేది బ్రిటిషు వారి ఆధిక్యతకు చిహ్నము. కాబట్టి నీకు కోపమేవస్తే నీవు దుర్బలత్వముమీదా, అజ్ఞానముమీదా, అన్యోన్య కలహశీలత్వముమీదా కోపించు. మన కష్టములకు కారణము లివే.

బ్రిటిషువారి నిరంకుశత్వము అని అంటాము మనము. నిజానికి ఎవరి నిరంకుశత్వమిది? దీనివల్ల లాభములు పొందేవారెవరు? బ్రిటిషు జాతి అంతా లాభము పొందడంలేదు. ఎందుకంటావా, లక్షలాది బ్రిటిషు ప్రజలు సుఖముగాలేరు. వారూ బాధల పాలవుతున్నారు. హిందూదేశస్థులలో కొద్దిమంది కొన్ని తరగతులవారు, ఇండియాను బ్రిటిషువారు స్వప్రయోజనమునకై ఉపయోగించుటవల్ల, కొద్దిగా లాభమును పొందినవారు ఉన్నమాట యదార్థము. ఇక దోషనిరూపణ చేసేదెట్లా? ఇది వ్యక్తులతో సంబంధించిన విషయము కాదు. పరిపాలనా పద్ధతికి సంబంధించినది. మనమొక మహా యంత్రము వశములో ఉన్నాము. అది లక్షలాది హిందూ దేశస్థులను స్వలాభమునకై పీడించి అణచివేస్తోంది. నూతన సామ్రాజ్య తత్వమనేదే ఈ యంత్రము. పారిశ్రామిక ధనిక పద్ధతికి పుట్టిన బిడ్డ ఇది. ఇండియాను స్వార్థమున కుపయోగించుటచే కలిగిన లాభములు చాలామట్టుకు ఇంగ్లాండుకు పోవును. కాని ఇంగ్లాండులో ఆ లాభములు సుమారు పూర్తిగ ప్రత్యేక తరగతుల జనులకే పోవును. లాభములలో కొంత భాగము ఇండియాలోకూడా నిలుచును. ఇండియాలో కొన్ని తరగతుల జనులకు అవిపోవును. కాబట్టి మనము వ్యక్తులమీదగాని, బ్రిటిషు వారందరి మీదాగాని ఆగ్రహించడం తెలివి తక్కువపని. ఒకపద్ధతి దుష్టముగాఉండి దానివల్ల మనకు బాధకగులుతూ ఉంటే దానిని మార్చవలసి ఉంటుంది. ఆ పద్ధతిని నడిపించేవారు ఎట్టి

వారైనా ఒకటే. దుష్ట పద్ధతిని నడిపించేవారు సజ్జనులైనా వారేమీ మంచి చెయ్యలేరు. ఎంతటి సద్భావము కలవాడైనా మట్టినీ, రాళ్ళనీ వండి వండి మంచి ఆహారముగా చేయలేడు. అల్లే సామ్రాజ్య తత్వ మున్నూ, పెట్టుబడిదారి పద్ధతిన్నీ అని నా అభిప్రాయము. వాటిని బాగు చేయడం అసాధ్యము. బాగుచెయ్యడానికి మార్గము వాటిని అంతరింప చెయ్యడమే. కాని ఇది నా అభిప్రాయము. కొందరు భిన్నాభిప్రాయు లున్నారు. నేను చెప్పిన విషయమే యదార్థమని నీవు నమ్మనక్కర లేదు. సమయము వచ్చినప్పుడు నీకు నచ్చిన విధముగా నీవు నిశ్చయము నకు రావచ్చును. కాని ఒక్క విషయములో మాత్రము చాలామంది ఏకాభిప్రాయులై ఉన్నారు. అది—పాలనా విధానము దుష్టమనుట. కాబట్టి వ్యక్తులపై కోపించుటవల్ల లాభము లేదు. మనకు మార్పు కావలసివస్తే ఈ విధానాన్ని మనము ప్రతిఘటించి మారుద్దాము. ఇండియాలో దీని దుష్ట ఫలితములను మనము చూచాము. చీనా, ఈజిప్టు మున్నగు పలు దేశములను గూర్చి విచారించినప్పుడు ఈ విధానమే మనకక్కడ కని పిస్తుంది. ధనిక—సామ్రాజ్యపద్ధతి అనే ఆ యంత్రమే పనిచేస్తూ అన్య దేశ ప్రజలను పీడిస్తోంది.

మళ్ళీ మనము మనకథ ఎత్తుకుందాము. బ్రిటిషువారు వచ్చినప్పుడు మన కుటీర పరిశ్రమలు ఉచ్ఛస్థితిలో ఉన్నవని చెప్పిఉన్నాను. ఉత్పత్తి పద్ధతులలో సహజముగా కలిగే అభివృద్ధి కారణముగా, పయినుండి ఎవరూ కలుగజేసికోకుండా ఉన్నట్లయితే ఇండియాలో యంత్రపరిశ్రమ ఎప్పుడో ఒకప్పుడు ప్రవేశించేది. దేశములో ఇనుమూ, బొగ్గూ ఉన్నవి. పారిశ్రామిక పరివర్తనము వచ్చుటకు ఇవియే కారణమనిన్నీ, నిజము నకు వీటివల్లనే కొంతవరకు పరివర్తనము కలిగినదనిన్నీ ఇంగ్లాండు విషయములో మనము చూచి ఉన్నాము. ఇండియాలోకూడా ఈ విధం గానే చివరకు జరిగి ఉండేది. రాజకీయ పరిస్థితులు కొంత గందర గోళముగా ఉండుటచేత కొంత ఆలస్యమయేదేమో! కాని బ్రిటిషువారు

మధ్యలో వేలుపెట్టారు. అప్పటికే మహాయంత్రోత్పత్తి చేస్తూ ఉన్న దేశమునకూ, సంఘమునకూ చెందియున్నవారు వారు. అట్టి మార్పే ఇండియాలో రావాలనిన్నీ, అట్టి మార్పు తేగల జనులను ప్రోత్సహించాలనిన్నీ వారు కోరతారని మన మనుకోవచ్చును. కాని వారట్లా చెయ్యలేదు. యదార్థానికి వారందుకు వ్యతిరేకంగా సంచరించారు. ఇండియా తమకు ప్రతిస్పర్థి కాగలదనే ఊహతో దాని పరిశ్రమలన్నీ వారు భగ్నము చేశారు. యంత్ర పరిశ్రమలు తలఎత్తకుండా అణచివేశారుకూడా.

ఇట్లు ఇండియాలో కొంతవరకు అసాధారణమైన పరిస్థితులు సంభవించాయి. ఆనాడు యూరోపులో మిక్కిలి వృద్ధినొందిన బ్రిటిషు వారు ఇండియాలో చాలా వెనుకబడియున్న, అభివృద్ధి సహించని తరగతి ప్రజలతో జట్టుకట్టి ఉండడం మనము గమనించవచ్చును. చస్తూన్న ఫ్యూడల్ తరగతికి వారు బోట్లుపెట్టి నిలిపారు. భూస్వాములను సృష్టించారు. అర్థ-ఫ్యూడల్ రాజ్యములలో వందలాది ఇండియన్ రాజులను, తమపై ఆధారపడిఉన్నవారిని వారు నిలబెట్టారు. ఇండియాలో వారు ఫ్యూడల్ పద్ధతిని బలపరిచారు. కాని ఈ ఇంగ్లీషువారే యూరోపులో మధ్య తరగతుల (బూర్జువా) విప్లవమునకు మార్గదర్శులైరి. ఈ విప్లవమే పార్లమెంటుకు శక్తినీ, అధికారాన్నీ ఇచ్చింది. పారిశ్రామిక విప్లవ విషయమున కూడా వారే మార్గదర్శకులైరి. ప్రపంచములో పారిశ్రామిక ధనిక పద్ధతి వచ్చుటకీ విప్లవమే కారణము. ఈ విషయములలో వారు ముందంజ వేశారు. కాబట్టే ప్రతిస్పర్థుల తలదన్ని వారు మహా సామ్రాజ్యాన్ని స్థాపించగలిగారు.

ఇండియాలో బ్రిటిషువారిట్లు సంచరించుటకు కారణమూహించుట కష్టముకాదు. ధనిక పద్ధతికి (Capitalism) ఆధారభూతమైనవి-హింసా పూర్వకమగు పోటీ ఒక్కటీ, స్వార్థోపయోగము (exploitation) ఒక్కటీ. ఇది ముదిరినప్పుడు సామ్రాజ్యవాదముగా తయారగును. కాన అధికారము చేతనున్నది కాబట్టి బ్రిటిషువారు తమ ప్రతిస్పర్థులను అంత

రింపజేశారు. ఇతర ప్రతిస్పర్థులు తల ఎత్తకుండా బుద్ధి పూర్వకంగా ఆటంకపెట్టారు. ఇండియాలోని ప్రజాసామాన్యముతో వారు స్నేహముగా ఎట్లా ఉంటారు ? వారిని స్వలాభమునకై పీడించుటకేకదా వారు ఇండియాలో ఉన్నది ? స్వార్థపరత్వముతో ప్రజలను పీడించే వారికీ, పీడితులకూ ఎట్లా పొత్తు కుదురుతుందీ ? కాబట్టి బ్రిటిషువారు, ఇండియాలో ఇంకా నిలిచిఉన్న ఫ్యూడల్ విధాన శిధిలములపై ఆధారపడ్డారు. బ్రిటిషవారు వచ్చినప్పుడే వీటిలో ఏమి పసలేదు. కాని బ్రిటిషువారు బోట్లుపెట్టి నిలబెట్టి వారినికూడా కొద్దిగా స్వలాభానికై దేశాన్ని ఉపయోగించుకోమన్నారు. ఆ విధానంవల్ల ఎట్టిప్రయోజనమూ లేకున్నా అది నిలిచిఉన్నది. కాని బ్రిటిషువారి ప్రోద్బలమువల్ల దానికి తాత్కాలికంగా కొంత ఉపశమనం కలిగింది. ఈ బోట్లు తీసివేసినప్పుడు అవి పతనమైనా కావాలి లేదా కొత్త పరిస్థితులకు అనుగుణంగానైనా నడుచుకోవాలి. బ్రిటిషువారి అనుగ్రహాన్ని ఆధారంగా చేసుకొని ఉన్న స్వదేశ సంస్థానములు 700 ఉన్నవి. అందు పెద్దవీ, చిన్నవీకూడా కలవు. పెద్ద సంస్థానములేవో నీకు తెలుసునుకాదూ ! అవి హైదరాబాదు, కాశ్మీరము, మైసూరు, బరోడా, గ్వాలియరు మున్నగునవి. ఈ సంస్థానముల నేలు పలువురు రాజులు ఫ్యూడల్ రాజ వంశోద్భవులు కారు. ఇది వింతవిషయము. మన దేశములో పెద్ద జమీందార్లు చాలామందికికూడా ప్రాచీన రాజ వంశములతో సంబంధము లేదు. ఒక్కరాజుమాత్రమున్నాడు. అతడు ఉదయపుర రాణా. సూర్యవంశమునకుచెందిన రాజపుత్రుడతడు. పురాతన కాలమునుంచిన్నీ వస్తూన్న రాజవంశమిది. బహుశా ఈ విషయములో అతనితో సరితూగగలవాడు, సజీవుడై ఉన్న జపాను రాజైన మికాడో.

ఇండియాలోని మతములు మార్పు సహించకుండుటకు కారణముకూడా బ్రిటిషు పరిపాలనమే. ఇది వింతగా కనిపించవచ్చును. బ్రిటిషువారు క్రైస్తవ మతావలంబులు. అయినా వారి రాకవల్ల హిందూ మతమున్నూ, ఇస్లామున్నూ బిరుసెక్కినవి. కొంతవరకు ఇది సహజమే.

విదేశయాత్రలుసంభవించినప్పుడు దేశమందలి మతములూ, సంస్కృతీ, ఆత్మసంరక్షణార్థము కాఠిన్యము వహించును. ఈ విధముగానే హిందూ మతము, ముస్లిం దండయాత్రల అనంతరము కర్కశమయ్యెను. వర్ణ వ్యవస్థ వృద్ధి అయ్యెను. ఇప్పుడు బ్రిటిషు దండయాత్రల అనంతరము హిందూ, ఇస్లాం మతములు ఈ విధముగానే ప్రవర్తించెను. ఇది ఇట్లా ఉండగా, ఇండియాలోని బ్రిటిషు ప్రభుత్వము, తెలియకా తెలిసీకూడా ఈ రెండు మతములలోని సాంప్రదాయకులకూ చేయూతనిచ్చెను. మతము విషయమునా, మతాంతరులను స్వమతములో చేర్చుకొను విషయమునా బ్రిటీషు వారికంతగా ఆసక్తిలేదు. వారికి ధనార్జనము ప్రధానము. మత విషయములలో కలుగజేసికొన్నట్లయితే ప్రజలు కుపితులయి తిరుగ బడుదురని వారు భయపడుచుండిరి. అట్టి అపోహసైతము కలుగకుండా వారు దేశ మతములను, అంటే మతముయొక్క బాహ్యరూపములను రక్షించి పోషించడముకూడ చేశారు. దీనికి ఫలితమేమిటంటే తరుచు ఈ బాహ్య రూపమే నిలిచింది. అంతస్సారము నశించింది.

పూర్వాచార పరాయణులకు కోపము వస్తుందేమోనన్న భయము ప్రభుత్వమునకుండేది. కాని సంస్కరణ విషయములలో మాత్రము ప్రభుత్వము వారిపక్షము చేరేది. సంస్కరణోద్యమ మీ విధముగా పోషింపబడింది. విదేశ ప్రభుత్వము తనకుతానై సంఘ సంస్కరణము లను ప్రవేశపెట్టలేదు. అది ఎట్టి మార్పు తెచ్చుటకు ప్రయత్నించినా ప్రజలు గర్హిస్తారు. హిందూ మతమున్నూ, హిందూ ధర్మ శాస్త్రము లున్నూ అనేక విషయములలో మారుచుండెను. పురోవృద్ధి గాంచు చుండెను. ఇట్టి అభివృద్ధి ఇటీవలి శతాబ్దులలో మందగించినప్పటికీ ఆ కార్యము జరుగుచూనే ఉండెను. హిందూ ధర్మ శాస్త్రము ప్రధానముగా ఆచారము ననుసరించియుండెను. ఆచారములు మారుతవి; పెరుగుతవి. బ్రిటిషు పరిపాలన క్రింద హిందూ ధర్మశాస్త్రము పెరుగుట మానినది. పూర్వాచార పరాయణుల సలహాతో ధర్మశాస్త్రము తయారు చేయబడి

నది. దీనికి మారే స్వభావంలేదు. అప్పటికే మందముగానున్న హిందూ సంఘాభివృద్ధి ఆగిపోయింది. ముస్లిములకు నూతన పరిస్థితులెంత మాత్రమూ కిట్టలేదు. వారు తమగూటిలో దూరి కూర్చుండిరి.

"సతి" అనే తప్పు పేరుకల సహగమనము అనే దురాచారాన్ని (మరణించిన భర్తతో భార్య చిచ్చురుకుట) మాన్పించితిమని బ్రిటిషు వారు గొప్పలు చెప్పుకుంటారు. రాజారామమోహనరాయి నాయకత్వమున హిందూ సంఘ సంస్కర్తలు పోరగా పోరగా ఎన్ని సంవత్సరములకో గాని వారు చర్య తీసుకోలేదు. అయినా కొంత ప్రతిష్ట వీరికి దక్కవలసినదే. బ్రిటిషువారికి పూర్వమందున్న పాలకులు-ముఖ్యముగా మహారాష్ట్రులు ఈ ఆచారమును నిషేధించారు. పోర్చుగీసువాడైన అల్బూకర్కు గోవాలో ఈ అచారమును అంతరింపజేసెను. హిందూ సంస్కారుల ఆందోళనము వల్లనూ, క్రైస్తవ మిషనరీల ప్రయత్నముల వల్లనూ సహగమనమును బ్రిటిషువారు రూపుమాపిరి. నేనెరిగినంత వరకు మతమునకు సంబంధించిన ఈ యొక్క సంస్కారమునే బ్రిటిషు ప్రభుత్వము తీసుకువచ్చెను.

దేశములోనున్న సాంప్రదాయకులతోనూ, వెనుకంజ వేసేవారితోనూ ఈ విధంగా బ్రిటిషువారు చెయ్యి కలిపారు. తమ పరిశ్రమలకు కావలసిన ముడి వస్తువులను మాత్రమే ఉత్పత్తి చేసే వ్యవసాయ దేశముగా ఇండియాను చెయ్యవలెనని వారు ప్రయత్నించారు. ఇండియాలో ఫ్యాక్టరీలు వృద్ధికాకుండా వారు ఇండియాలోకి దిగుమతి అయిన యంత్రముల మీద సుంకములు విధించారు. ఇతర దేశములు తమ తమ పరిశ్రమలను వృద్ధి చేసుకొన్నవి. పారిశ్రామిక విధానమును ప్రవేశపెట్టి మనోవేగముతో జపాను పురోభివృద్ధి చెందిన వార్త ముందు ముందు మనము తెలుసుకొంటాము. కాని ఇండియాలో బ్రిటిషు ప్రభుత్వము పరిశ్రమాభివృద్ధికి ఆటంకములు కలిగించింది. యంత్రములమీద సుంకము విధించుటచేత, ఇండియాలో కూలి చవగ్గా దొరుకుతూన్నప్పటికీ ఒక

ఫ్యాక్టరీ నిర్మించడానికి ఇంగ్లాండులో అయ్యే ఖర్చుకన్న నాలుగింతలు ఖర్చు ఇండియాలో అవుతూ ఉండేది. ఇట్టి ఆటంకములు కల్పించుటచేత పరిశ్రమలు అందుకోవడం ఆలస్యమవుతుంది. అంతే. కాని జరుగ నున్నది జరుగక మానదు. శతాబ్ది మధ్యలో ఇండియాలో యాంత్రిక పరిశ్రమ అభివృద్ధి చెంద నారంభించింది. బ్రిటిషువారి పెట్టుబడితో బెంగాలులో జనపనార పరిశ్రమ ప్రారంభమైనది. రైళ్లు రావడం పరి శ్రమలు అభివృద్ధిచెందడానికి సహాయభూతమైనది. 1880 సంవత్సరము తరువాత, చాలావరకు ఇండియనుల పెట్టుబడితోనే, బొంబాయి, అహ మదా బాదులలో బట్టల మిల్లులు వృద్ధి చెందినవి. పిమ్మట గనులు తవ్వు పరిశ్రమ వచ్చినది. బట్టల మిల్లులు మినహా, మెల్లగా పాకుతూ వస్తూన్న ఇతర పరిశ్రమలన్నీ చాలావరకు బ్రిటిషు పెట్టుబడితోనే తల యెత్తినవి. బ్రిటిషు ప్రభుత్వము ప్రతికూలముగా ఉన్నప్పటికీ ఈ కార్య ములు జరిగినవి. ప్రభుత్వమువారు యథేష్టవర్తక సిద్ధాంతము (లేసే ఫేర్) అని అంటూనే ఉన్నారు. ప్రజలు లేవనెత్తిన పరిశ్రమలలో కలుగ జేసుకో కూడదంటూనే ఉన్నారు. కాని బ్రిటిషు గవర్నమెంటు వారు ఇంగ్లాండులో జరుగుచున్న ఇండియన్ వ్యాపారమును తమకు పోటీగా ఉన్నదని భావించినప్పుడల్లా, వృద్ధి చెందకుండా అణచివేశారు. సుంక ములు వేసీ, నిషేధములు చేసీ ఈ పని వారు 18 వ శతాబ్దిలోనూ, 19వ శతాబ్ది తొలి భాగమందునూ సాధించారు. తాము వర్తకమున అగ్ర స్థానాన్ని పొందారు. కాబట్టి లేసేఫేర్ సిద్ధాంతాన్ని గురించి ముచ్చ టించ వచ్చును. నిజమునకు వారు ఉపేక్షభావముతో ఊరుకొన్నారను కుంటావేమో? కొన్ని భారత దేశ పరిశ్రమలను వారు నిరుత్సాహ పరి చారు. ముఖ్యముగా బొంబాయి, అహమదాబాదులలో అభివృద్ధి గాంచు చున్న బట్టల పరిశ్రమకు వారు అడ్డు తగిలారు. ఈ బట్టల మిల్లులలో తయారయే బట్టలమీద వారు పన్ను విధించారు. దీనికి ప్రత్తిమీద వేసే ఎక్సైజు పన్ను అని పేరు. లాంకషైరులో తయారయే బట్టలు ఇండి

యాలో తయారయే బట్టలతో పోటీ చేయడానికి వీలుగా ఉండుటకొరకే ఇట్టి పన్ను విధించ బడింది. సామాన్యముగా ప్రతి దేశమున్నూ పర దేశమునుంచి వచ్చే సరుకుమీద పన్ను విధించడం కద్దు. తన పరి శ్రమలు రక్షించుకోవడమునకున్నూ, ఆదాయము వృద్ధి చేసుకోవడమున కున్నూ ఇట్లా చేస్తారు. కాని ఇండియాలో బ్రిటిషువారు ఇండియాలోనే తయారైన సరుకుపై పన్నులు విధించారు. ఇది ఎంతో అసామాన్య మగు కార్యము. ఎంత ఆందోళన చేసినప్పటికిన్ని లాభము లేక పోయింది. మొన్న మొన్నటి వరకూ ఈ ఎక్సైజు పన్ను విధిస్తూనే ఉండిరి.

ఈ విధముగా ప్రభుత్వము వ్యతిరేకముగా ఉన్నప్పటికీ, నేటి పరిశ్రమలు ఇండియాలో మందగతితో నడిచినవి. పారిశ్రామికాభివృద్ధి చేయవలసిందని ఇండియాలోని భాగ్యవంతులు గోల చేశారు. చివరకు 1905 లో ప్రభుత్వమువారు "కామర్సు అండ్ ఇండస్ట్రీ" (వాణిజ్యము— పరిశ్రమ) శాఖను ఒకటి కొత్తగా పెట్టారు. అయినా ప్రపంచయుద్ధము వచ్చేవరకూ ఈ శాఖ చేసిందేమీలేదు. పరిశ్రమలు అభివృద్ధి చెందుట వల్ల పరిస్థితులుమారినవి. నగరములలోని ఫ్యాక్టరీలలో పనిచేయు కార్మి కుల తరగతి ఒకటి తలయెత్తింది. గ్రామములలో భూమికి ఒత్తిడి విశే షముగా ఉంటూన్నదనిన్ని, గ్రాసవాసములకు అనుకూలత లేదనిన్ని చెప్పియున్నాను. అందువల్ల చాలామంది గ్రామస్థులు పట్టణములు చేరు కొని ఫ్యాక్టరీలలో ప్రవేశించారు. అంతేకాదు. బెంగాలు, అస్సాము లలో లేచిచున్న తేయాకు తోటల (Plantations) లో కూడా కూలి పనులు చేయడానికి ప్రవేశించారు. ఇందువల్లనే చాలామంది, హెచ్చు కూలి వస్తుందని చెప్పడంవల్ల, పరదేశాలకు వెళ్ళారు. ఇట్టి పరదేశ గమనము (Emigration) ముఖ్యముగా దక్షిణ ఆఫ్రికా, ఫిజీ, మార్షస్ దీవులు, సింహళములకు జరిగినది. కాని అందువల్ల కూలివాళ్ళకు ఎట్టి లాభమూ కలుగలేదు. కొన్ని దేశములలో ఇట్టి పరదేశగాములను బాని

సల కన్న అన్యాయంగా చూచారు. అస్సాం తేయాకు తోటలలో వారి స్థితి బానిసల స్థితికంటె మెరుగుగా లేదు. నిరుత్సాహముతో హతాశులై వారిలో పలువురు తిరిగి తమ గ్రామములకు వచ్చి వేయవలసి వచ్చింది. కాని గ్రామములలో దున్నుకోడానికి వారికి భూమి ఎక్కడున్నది? కాబట్టి అక్కడకూడా వారి నాహ్వానించేవారు ఎవరూ లేకుండిరి.

ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులకు కూలి కొంత హెచ్చు అయి నప్పటికీ దానివల్ల వారికేమీ లాభించలేదు. నగరాలలో ప్రతీ వస్తువుకీ ధర ఎక్కువ. పట్టణములో కాపురము ధనముతోకూడుకొన్నది. వాళ్ళు నివసించేవి పాడుగుడిసెలు. అపరిశుభ్రముగా, తేమగా, చీకటిగా ఉంటవి. ఫ్యాక్టరీలలో పరిస్థితులు కూడా పాడుగానే ఉన్నవి. గ్రామా లలో వాళ్ళకు తిండిలేకున్నా కావలసినంత సూర్యరశ్మి, పరిశుభ్ర వాయువూ ఉన్నవి. ఫ్యాక్టరీ కార్మికులకు తగినంత సూర్యరశ్మి, పరి శుభ్రవాయువూ దొరకవు. పోనీ ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టి చక్కగా జీవించవలెనంటే వారి సంపాదన అందుకు చాలదు. స్త్రీలూ, పిల్లలూ సమేతం దినమునకు చాలా గంటల కాలము ఫ్యాక్టరీలలో పనిచేయాలి. చంటిపిల్లలున్న తల్లులు, తమ పనికి ఆటంకం లేకుండా పిల్లలకు నల్ల మందువేసి పండుకోబెట్టేవారు. ఇట్టి దుర్భర పరిస్థితులలో ఫ్యాక్టరీ కార్మికులు పనిచేస్తూండేవారు. వారికి సౌఖ్యమూ పూజ్యము. అసంతుష్టి పెరిగింది. దిక్కుతోచక అప్పుడప్పుడు వారు సమ్మెకట్టేవారు—అంటే పని మానివేసేవారు. కాని వారికి బలములేదు. భాగ్యవంతులైన వారి యజమానులు, తరుచు ప్రభుత్వము వారి సహాయముతో, వారిని సులభ ముగా అణచి వేయగలరు. క్రమేణా వారు ఐకమత్యముతో పని చేయడంవల్ల లాభముంటుందని గ్రహించారు. కార్మిక సంఘములు (ట్రేడు యూనియన్లు) వారు స్థాపించుకొన్నారు.

ఇది పాతకాలపు పరిస్థితుల వర్ణన అనుకుంటావేమో! ఇండి యాలో కార్మికుల పరిస్థితులు కొంత బాగుపడ్డమాట వాస్తవమే. వీద

కార్మికునికి అనుకూలములు కొద్దిగా కల్పించడానికి కొన్ని శాసనములు పుట్టిన మాట వాస్తవమే. కాని నేడు సమేతం నీవు కాన్పూరుగాని, బొంబాయిగాని, ఫ్యాక్టరీలున్న ఇతర ప్రదేశములుగాని చూడడం తటస్థిస్తే కార్మికులు నివశించే ఇళ్లుచూచి ముక్కుమీద వేలు వేసుకొంటావు.

ఇండియాలోని బ్రిటిషువారిని గురించీ, బ్రిటిషు ప్రభుత్వమును గురించీ ఈ జాబులోనూ, వెనుకటి జాబులలోనూ వ్రాసి ఉంటిని. ఈ ప్రభుత్వస్వరూప మెట్టిది? అది ఎట్లా పనిచేసింది? మొదట ఉన్నది తూర్పు ఇండియా సంఘము. దాని వెనుక బ్రిటిషు పార్లమెంటు. తిరుగుబాటు జరిగిన పిమ్మట 1858 లో బ్రిటిషు పార్లమెంటు అధికారాన్ని వహించింది. పిమ్మట కొంత కాలానికి అప్పుడు ఇంగ్లాండును పాలిస్తూ ఉన్న రాణీ కైజర్ ఈ హింద్ (ఇండియా చక్రవర్తిని) అయినది. ఇండియాలో గవర్నరు జనరల్ ఉంటున్నాడు. అతడే రాజ ప్రతినిధిన్నీ (వైస్రాయి). అతడిక్రింద పనిచేసే ఉద్యోగస్తు లనేకమంది. కొంచెము హెచ్చు తక్కువగా నేటివలెనే అప్పుడున్నూ ఇండియా రాష్ట్రములుగానూ, సంస్థానములుగానూ విభజింప బడియున్నది. స్వదేశ రాజులేలు సంస్థానములు సగము స్వతంత్రములు. నిజానికి అవి పూర్తిగా బ్రిటిషువారిమీద ఆధారపడి ఉన్నవి. పెద్ద సంస్థానములు ప్రతి ఒకదానిలోనూ రెసిడెంటు అనే ఒక ఇంగ్లీషు ఉద్యోగస్తుడు ఉంటాడు. సంస్థాన పరిపాలనపై అతడు అధికారము చెలాయిస్తాడు. సంస్కారణము లంటే అతనికి పట్టదు. సంస్థాన ప్రభుత్వము ఎంత పాడుగా ఉన్నా, ఎంత పాతబడిఉన్నా అతనికి ప్రశంసలేదు. అతడికి కావలసింది సంస్థానములో బ్రిటిషు అధికారాన్ని గట్టి చేసుకోవడం.

ఇండియాలో మూడవ వంతు సంస్థానములు. మిగత రెండు పాళ్ళూ బ్రిటిషు ప్రభుత్వముకింద ఉన్నవి. ఈ భాగమునకే బ్రిటిషు ఇండియా అనిపేరు. బ్రిటిషు ఇండియాలో పెద్ద ఉద్యోగస్తులందరూ బ్రిటిషువారే. శతాబ్ది చివర భాగములో మాత్రము కొద్ది ఇండియనులు

ఆ ఉద్యోగములలో ప్రవేశించారు. అయినప్పటికీ అధికారమంతా బ్రిటిషు వారి చేతులలో ఉండెను. మిలిటరీ ఉద్యోగస్తుల మాట అటుంచితే ఈ పెద్ద ఉద్యోగస్తులందరూ ఇండియన్ సివిల్ సర్వీసులోనివారే. ఇండియా ప్రభుత్వమంతా ఈ ఇండియన్ సివిల్ సర్వీసు వారి చేతులలోనే ఉండెను. ఒకరికొకరు ఉద్యోగములిచ్చుకొనేటట్టిన్నీ, వారు చేసే పనులకు ప్రజల సమ్మతి పొందనట్టిన్నీ ఇట్టి ఉద్యోగస్తుల ప్రభుత్వమునకు అధికార వర్గ పాలనము (Bureaucracy) అంటారు.

ఇండియా సివిల్ సర్వీసును గురించి మనము చాలా వింటున్నాము. వారు విలక్షణ పురుషులు. కొన్ని సందర్భములలో వారు సమర్థులే. పరిపాలనా విధానాన్ని వారు నిర్ణయించారు. బ్రిటిషు పరిపాలనమునకు బలము కల్పించారు. వారూ చాలా లాభం పొందారు. బ్రిటిషు ప్రభుత్వాన్ని స్థిరస్థాయిగా చెయ్యడానికి పనికివచ్చేటట్టిన్నీ, పన్నులు పసూలు చేయడానికి పనికివచ్చేటట్టిన్నీ ప్రభుత్వ శాఖలను అన్నింటినీ సమర్థతతో నిర్వహించేవారు. ఇతర శాఖలపట్ల ఉదాసీన భావము చూపారు. ఇండియన్ సివిల్ సర్వీసు వారికి ఉద్యోగాలిచ్చింది ప్రజలు కాదు. ప్రజలకు సంజాయిషీ చెప్పవలసిన బాధ్యత వారికిలేదు. కాబట్టి ప్రజల శ్రేయస్సుకు సంబంధించిన ప్రభుత్వ శాఖలను వారుపేక్షించారు. ఇట్టిసందర్భములలో వారు దురహంకారులైనారంటే ఆశ్చర్యం ఏమిటి ? గర్వాంధులైనారంటే ఆశ్చర్యం ఏమిటి ? ప్రజాభిప్రాయాన్ని తృణముతో సమానంగా చూచారంటే ఆశ్చర్యం ఏమిటి ? వారికి విశాల దృష్టిలేదు. ఉన్నది సంకుచిత దృష్టే. లోకంలో అందరికంటె తామే తెలివైన వాళ్ళమని అనుకుంటూ ఉండేవారు. ఉద్యోగస్తుల శ్రేయస్సే ఇండియా శ్రేయస్సని వారి అభిప్రాయము. వారు నిరంతరము ఒకరి నొకరు పొగడుకుంటూ ఉండేవారు. అడ్డులేని అధికారమువల్ల వచ్చే ఫలమిట్టిదేకదా! ఇండియాపై యజమానులు ఇండియన్ సివిల్ సర్వీసు వారే క్రియకు. బ్రిటిషు పార్లమెంటు చాలా దూరంలో ఉండడంవల్ల

వారు కలుగజేసికొనేవారు కారు. పార్లమెంటు శ్రేయస్సూ, బ్రిటిషు పరిశ్రమల శ్రేయస్సూ వీరు చూస్తూ ఉడడంవల్ల కలుగజేసికోవడానికి అవసరమూ లేకపోయింది. హిందూదేశ ప్రజల శ్రేయస్సుమాటా ? ఆ విషయాన్ని వారికి నచ్చ జెప్పడానికి ఎట్టి మార్గములూ లేకుండెను. వారు చేసిన పనులను ఏకొద్దిగా విమర్శించినా వారికెంతో కోపం వచ్చేది. సహనమన్న మాటే లేదు వారికి.

అయినా ఈ ఇండియన్ సివిల్ సర్వీసులో మంచివాళ్ళూ, పెద్ద మనుష్యులూ, సమర్థులూ చాలామంది ఉండిరి. కాని వారు మాత్రం ప్రవాహానికి ఎదురీదగలరా ? ఇండియాను లాక్కుపోతూన్న ప్రవాహాన్ని మళ్ళించగలరా ? ఇండియన్ సివిల్ సర్వీసువారు ఇంగ్లాండు లోని పారిశ్రామికులకూ, ధనవంతులకూ ఏజెంట్లుమాత్రమే. ఈ పారిశ్రామికులూ పెట్టుబడిదార్లూ ఇండియాను తమ లాభము కోసం వినియోగించుకోవడమే అభిమతముగా గలవారు.

తమ శ్రేయస్సూ, బ్రిటిషు పరిశ్రమల శ్రేయస్సూ కాపాడుకోవలసి వచ్చినప్పుడు మాత్రము అధికార పాలకవర్గము వారు సమర్థతతో పని చేసేవారు. దేశ పురోభివృద్ధికీ, దేశారోగ్యమునకూ తోడ్పడే విద్య, ఆరోగ్యము, ఆసుపత్రులు, ఇంకా అనేక ఇతర విషయములను వారు ఉపేక్షించారు. అనేక సంవత్సరములపాటు వారీవిషయములనుగురించి ఆలోచించనేలేదు. పాతకాలంలో ఉండే వీధి బడులు అంతరించాయి. తరువాత మెల్లగా, సందేహిస్తూ ఈ విషయాలు ఎత్తుకొన్నారు. ప్రజలకు విద్య కరపడం విషయములో ప్రాధాన్యము వహించింది వారి అక్కరలే. పెద్ద ఉద్యోగాలన్నీ బ్రిటిషువారు స్వీకరించారు. చిల్లర ఉద్యోగాలలోనూ, గుమస్తా ఉద్యోగాలలోనూ వారు ప్రవేశించరుగద ; వారికి గుమస్తాలు కావలసి వచ్చారు. గుమాస్తాలను తయారు చేయడానికే బ్రిటిషువారు ఇండియాలో స్కూళ్ళూ, కాలేజీలూ పెట్టారు. నాటి నుంచీ విద్యయొక్క పరమావధి ఇదే. ఈ స్కూళ్ళలోనూ, కాలేజీల

లోనూ విద్య నార్జించినవారు గుమస్తాలుగా ఉండడానికే సమర్థులు. కొంతకాలం పోయేసరికి గవర్నమెంటులోనూ, ఇతర ఆఫీసులలోనూ ఉన్న ఉద్యోగములకు మించిన గుమస్తాలు తయారైనారు. చాలా మందికి ఉద్యోగాలు దొరకలేదు. చదువుకొన్న నిరుద్యోగులనే ఒక కొత్త తరగతి తయారైనది.

నూతన ఆంగ్లేయవిద్యకు తొలుదొలుత ఎక్కినవారు బెంగాలులు. కాబట్టే తొలిరోజులలో గుమాస్తా ఉద్యోగాలన్నీ బెంగాలులకే చిక్కినవి. 1957 లో మూడు విశ్వకళాశాలలు స్థాపించబడినవి—కలకత్తాలో, బొంబాయిలో, చెన్నపట్టణములో. గమనించవలసిన ఒక విషయం ఏమిటంటే—ఈ కొత్త చదువుకు ముస్లిములు ఎక్కలేదు. గుమాస్తా ఉద్యోగాలూ, గవర్నమెంటు ఉద్యోగాలూ దక్కించుకోవడంలో వారు వెనకబడ్డారు. తరువాత ఇదివక ఇబ్బందికింద పరిణమించింది.

గమనించవలసిన వేరొక విషయం ఏమిటంటే—గవర్నమెంటు వారు విద్య కరపడానికి ప్రారంభం చేసినారు కాని బాలికల విద్యను పూర్తిగా ఉపేక్షించారు. ఇందు ఆశ్చర్యమేమీ లేదు. చదువు చెప్పించడానికి కారణం గుమాస్తాలు కావలసి. మగ గుమాస్తాలు వారికి కావలసి వచ్చారు. వెనుకబడ్డ సాంఘికాచారాలు కారణంగా మగవాళ్లే అందుకు సిద్ధమయ్యారు. కాబట్టి బాలికా విద్య ఉపేక్షింపబడింది. ఎంతో కాలము జరిగిన పిమ్మట స్త్రీ విద్య కొద్ది కొద్దిగా ప్రారంభమయినది.

## 113

# ఇండియా తిరిగి మేల్కొనుట

డిశంబరు 7, 1932

బ్రిటిషువారు ఇండియాలో తమ పరిపాలనము నెట్లు గట్టి చేసుకున్నారో, వారి రాజనీతి కారణంగా ఇండియా ఎట్లు దరిద్ర దేశమై కష్టముల పాలైనదో నేను చెప్పియుంటిని. దేశములో శాంతి నెలకొన్న

మాట వాస్తమే. పరిపాలన సక్రమముగా నడిచినమాటకూడా వాస్తవమే. మొగలు సామ్రాజ్యము విచ్ఛిన్నమైన పిమ్మట వచ్చిన అల్లరుల అనంతర మీ శాంతి భద్రతలు కోరదగ్గవే. దొంగల గుంపులును, బందిపోటు దొంగల జట్టులును అణచివేయబడ్డవి. కాని నూతన ప్రభుత్వంకింద అణగారిపోతూ ఉన్న పొలముకాపుకూ, ఫ్యాక్టరీ కార్మికునకూ ఈ శాంతి భద్రతలవల్ల ప్రయోజనమేమిటి? కాని బ్రిటిషు దేశముపైని గాని, బ్రిటిషు ప్రజలమీదగాని ఆగ్రహించడము తెలివితక్కువ అని మళ్ళీ చెప్పుతున్నాను. మన వలెనే వారున్నూ పరిస్థితులకు దాసులయ్యారు. జీవితము చాలా కఠినముగానూ, క్రూరంగానూ ఉంటుందనే విషయము చరిత్ర చదివి మనము నేర్చుకున్నాము. దానిని బట్టి ఉద్వేగము చెంద డము కాని, ఇతరులను దూషించడము కాని తెలివితక్కువ పని. దాని వల్ల ప్రయోజనం లేదు. దారిద్ర్యమునకూ, దుఃఖమునకూ, ఇతరుల స్వార్థ పరత్వానికీ కారణములు తెలుసుకోడానికి మనము ప్రయత్నించి వాటిని తొలగించడానికి పని చెయ్యడం తెలివైన పని. అట్లా చెయ్య కుండా మనము వెనుక బడ్డట్లయితే మనకు కష్టములు తప్పవు. ఇండియా ఇట్లే వెనుకబడింది. అది ఒక మాదిరిగా స్థాణువుగా మారింది. దాని సంఘము పాత సంప్రదాయాలతో కరడుగట్టుకు పోయింది. సంఘసంస్థ జీవాన్నీ, శక్తినీ కోల్పోయింది. చలనము లేకుండా నిలిచిపోయింది. ఇండియా కష్టముల పాలయినదంటే ఆశ్చర్యమేమిటి? ఆమె కష్టము లకు బ్రిటిషువారు కారణ భూతులు కావడం తటస్థించింది. వారు కాకుంటే వేరొకరైనా ఈ విధంగా ప్రవర్తించేవారే.

కాని ఇంగ్లీషువారివల్ల ఇండియాకు ఒక గొప్ప లాభము కలిగినది. వీర్య వంతులైన వారితో కొత్తగా సంసర్గ కలుగుటవల్ల ఇండియాకు కదలిక పుట్టింది. జాతీయత, రాజకీయైక్యత అనే భావములు రేకెత్తి నవి. ఈ సంసర్గ బాధాకరమైనప్పటికీ, మన ప్రాచీన దేశమునూ, ప్రజలను పునరుజ్జీవితులను చేయడానికి అవసరమైనది. గుమాస్తాలను

తయారు చేయుటకు ఉద్దేశింపబడ్డ ఇంగ్లీషు చదువులవల్ల అనాటి పాశ్చాత్యాభిప్రాయములు ప్రజలు తెలిసికో వీలయినది. ఒక కొత్త తరగతి ప్రజలు తలయెత్తిరి. వారే ఇంగ్లీషు చదువుకొన్న ప్రజలు. వీరి సంఖ్య తక్కువే. వీరికి ప్రజాసామాన్యముతో సంబంధములేదు. కాని వీరే నూతన జాతీయోద్యమమును నడిపించవలసిన వారై ఉండిరి. ఈ తరగతి ప్రజలు మొట్టమొదట ఇంగ్లాండన్నా, ఇంగ్లీషువారి స్వాతంత్ర్య భావములన్నా ఎంతో మెచ్చుకుంటూ ఉండేవారు. ఆ కాలమునందే ఇంగ్లాండులోని ప్రజలు స్వాతంత్ర్యమునుగురించీ, ప్రజాస్వామికమును గురించీ చర్చలు చేసుకుంటూ ఉండిరి. కాని ఇండియాలో స్వలాభము కొరకు ఇంగ్లాండు నిరంకుశ ప్రభుత్వము సాగిస్తోంది. అయితే తగిన సమయము వచ్చినప్పుడు ఇంగ్లాండు ఇండియాకు స్వాతంత్ర్యము నిస్తుందని వారాసించేవారు.

పాశ్చాత్య భావ సంసర్గవల్ల హిందూ మతములో కొంతవరకు మార్పు వచ్చింది. ప్రజా సామాన్యమునకు అట్టి భావములతో సంబంధం లేదని చెప్పి ఉంటిని. బ్రిటిషు ప్రభుత్వనీతి పూర్వాచార పరాయణులకు సహాయకారిగా ఉండెను. ప్రభుత్వోద్యోగులు, వైద్యులు, న్యాయవాదులు వంటి వృత్తిపరులు—వీరు నూతన మధ్య తరగతి ప్రజలుగా ఉండిరి. వీరిలో మార్పు వచ్చినది. పందొమ్మిదో శతాబ్ది తొలి రోజులలో పాశ్చాత్య పద్ధతులమీద హిందూ మతమును సంస్కరించుటకు బెంగాలు దేశములలో ప్రయత్నములుజరిగెను. గత కాలమున హిందూ మతమును సంస్కరించిన వారు పలువురుండిరి. అందు కొందరినిగురించి ఈ జాబులలో నీకు వ్రాసి ఉంటిని. కాని ఈ నూతన సంస్కరణ ప్రయత్నము—క్రైస్తవమును, పాశ్చాత్య భావములను పురస్కరించుకొని వచ్చినది. ఈ ప్రయత్నమును చేసినవాడు రాజా రామమోహనరాయి. ఇతడు మహనీయుడు. గొప్ప పండితుడు. సహగమన నిషేధ సందర్భమున ఇతని పేరు మనము పేర్కొని ఉంటిమి. ఇతనికి సంస్కృతము,

అరబ్బీ, మున్నగు భాషలెన్నో చక్కగా వచ్చును. పలుమతముల నీతడు శ్రద్ధతో పఠించెను. మతము పేరిట చేయు పూజాపురస్కారము లితనికి కిట్టవు. సంఘ సంస్కారము జరుగవలెననియు, స్త్రీలకు విద్య నేర్పవలయుననియు ఇతడు వాదించెను. ఈతడు స్థాపించిన సంఘము నకు బ్రహ్మ సమాజమని పేరు. అది నాటినుండి నేటివరకూ చిన్న సంస్థగానే ఉండెను. అనగా అందలిసంఖ్య తక్కువన్నమాట. బెంగాలు లోని ఇంగ్లీషు చదువుకొన్నవారే ముఖ్యముగా అందుండిరి. ఠాకూరు కుటుంబము బ్రహ్మ సమాజములో చేరెను. కవీశ్వరుడైన రవీంద్రనాథ ఠాకూరు తండ్రి, మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు, ఈ సమాజమునకు చాలా కాలము వరకూ ప్రాపుగా ఉండెను. ఈ సమాజమందలి వేరొక ప్రసిద్ధ నాయకుడు కేశవ చంద్రసేను.

ఈ శతాబ్దిలోనే కొంతకాలమైన పిదప వేరొక మత సంస్కరణో ద్యమము పంజాబులో పొడచూపెను. ఈ సంఘ స్థాపకుడు స్వామి దయానంద సరస్వతి. దీనిపేరు ఆర్య సమాజము. హిందూ మతమున కాలక్రమమున ప్రవేశించిన ఆచారములను పెక్కింటిని అతడు నిరసిం చెను. వర్ణ భేదములుండరాదని అతడు వాదించెను. "వేదకాలమునకు పోవలెను" అని ఆదేశించెను. మస్లిం, క్రైస్తవ భావముల ప్రోద్బల ముచే తల యెత్తిన సంస్కరణోద్యమమైనప్పటికీ ఆర్య సమాజము నిజమునకు వీర్యవంతమై కయ్యమునకు కాలుదువ్వు ఉద్యమముగా తయారైనది. హిందూ మతములోని పలుతెగలలో ఆర్య సమాజమే ఇస్లాం మతమునకు మిక్కిలి సమీపములో ఉండెను. అయినా, చిత్ర మేమిటంటే ఆర్య సమాజము ఇస్లాంకు ప్రతిస్పర్థి, విరోధి అయినది. హిందూ మతము స్థావరమైనది. ఆత్మరక్షణ మాత్రమే అది చేసుకొను చుండెను. అట్టి మతమును, తన ధర్మములను ప్రజలలో ప్రచారము చేయునట్టిన్నీ, అన్య మతములపై కాలు దువ్వునట్టిన్నీ మతముగా మార్చుటకు చేసిన ప్రయత్నమే ఇది. హిందూ మతమును పునరుద్ధరింప

జేయుట ఆర్య సమాజము ఉద్దేశము. ఈ ఉద్యమమునకు శక్తినిచ్చిన విషయము అందలి జాతీయతా ఛాయలే. అది నిజముగా తలయెత్తు చున్న హిందూ జాతీయత అని చెప్పవచ్చును. అది హిందూ జాతీయత అనే కారణమువల్లనే భారత జాతీయత కాజాలకపోయినది.

బ్రహ్మ సమాజముకన్న ఆర్య సమాజము, ముఖ్యముగా పంజాబులో, విరివిగా వ్యాప్తినందింది. కాని అందలి సభ్యులు మధ్య తరగతి వారు మాత్రమే. ఆర్య సమాజము విద్యా ప్రచార మమితముగాచేసినది. బాలురకూ, బాలికలకూ స్కూళ్ళనూ, కాలేజీలనూ అనేకము అది స్థాపించినది.

ఈ శతాబ్దిలోనే వేరొక మహనీయుడుండెను. ఈ జాబులో నేను ప్రశంసించిన వారికన్న భిన్నుడు. అతని పేరు రామకృష్ణ పరమహంస. సంస్కరించవలెనను భావముతో అతడెట్టి సంఘమును లేవనెత్తలేదు. సేవకే అతడు ప్రాధాన్య మిచ్చెను. దేశమందన్ని దిక్కుల రామకృష్ణ సేవాశ్రమములు దుర్బలులకు, దరిద్రులకు సేవ చేయుచున్నవి. రామకృష్ణుని ప్రధాన శిష్యుడు వివేకానందస్వామి. జాతీయత నాతడు వాగ్ధాటితో, సమర్థతతో బోధించెను. ఇది ఇస్లాంకు వ్యతిరేకముకాదు. ఏ మతమునకును వ్యతిరేకముకాదు. ఆర్య సమాజము బోధించిన సంకుచిత జాతీయతకందు స్థానములేదు. అయినా వివేకానందుని జాతీయత హిందూ జాతీయతయే. దాని వేళ్ళు హిందూ మతములోనికి, సంస్కృతి లోనికి తన్నుకొని ఉండెను.

ఇండియాలో 19 వ శతాబ్దిలో తొలి జాతీయతా సంచలనములు హిందూ మతమునకు సంబంధించి యుండుట గమనించ దగినది. హిందూ జాతీయతతో ముస్లిములు ఐక్యము కలిగించుకోకుండుట సహజమేకదా. వారు దానికి దూరముగా ఉండిరి. ఇంగ్లీషు చదువులకు వారు దూరముగా ఉండుటచేత నూతన భావములు వారి మనస్సులను చలింప జేయలేదు. బుద్ధి సంచలనమున్నూ వారిలో అంతగా కలుగలేదు. అనేక

సంవత్సరములు గడచిన పిమ్మట వారు తమ గూడునుంచి బయటకి వచ్చిరి. అప్పుడు హిందువులలోవలెనే వారిలోకూడా జాతీయత మత స్వరూపము ధరించెను. మస్లిం సంప్రదాయములనూ, సంస్కృతినీ పోషించదగ్గ మస్లిం జాతీయతగా ఏర్పడెను. అధిక సంఖ్యాకులగు హిందువుల మధ్యనుండుటవల్ల తమ మతవాసనలు హరించి పోవునేమో అని అది భయపడుచుండెను. కాని ఈ మస్లిం ఉద్యమము చాలా సంవత్సరముల తరువాత. ఈ శతాబ్దాంతమున. తలయెత్తినది.

గమనించదగ్గ వేరొక విషమేమనగా--హిందూ ఇస్లాం మతములకు సంబంధించిన ఈ ఉద్యమములు పాశ్చాత్య దేశములనుండి వచ్చిన క్రొత్త శాస్త్రాభిప్రాయములతోనూ,రాజకీయాభిప్రాయములతోనూ, తమతమ మతములందలి పాత అభిప్రాయములనూ, ఆచారములనూ సాధ్యమైనంతవరకు సరిపుచ్చుటకు ప్రయత్నించినవి. ఆ పాత అభిప్రాయములనూ, ఆచారములనూ పట్టిచూచి నిర్భయముగా పరీక్ష చేయుటకు వారు సంసిద్ధులు కాలేదు. నూతన శాస్త్రాభిప్రాయములనూ, రాజకీయ సాంఘిక భావములనూ వారుపేక్షించనూ లేకపోయిరి. కాన ఆ రెంటిని సమన్వయించుటకు వారు ప్రయత్నించిరి. ఈనూతనాభిప్రాయములన్నీ తమతమ గ్రంథములలోనున్నవే అని చూప యత్నించిరి. ఈ ప్రయత్నము నెగ్గేదికాదు. సరళముగా ఆలోచించ నీయకుండా ప్రజలనది ఆటంక పెట్టినది. ధైర్యముతో స్వతంత్రాలోచనలు సలిపి ప్రపంచమును మార్చివేయుచున్న ఈ నూతన శక్తులనూ, భావములనూ గ్రహించుటకు బదులు ప్రాచీన ఆచార సంప్రదాయములకు వారు బానిసలై ఉండిరి. ముందుచూపుతో, ముందుకుపోవుటకు బదులు వారింత కాలమూ నిష్ప్రయోజనముగా వెనుకకు చూచుచునే ఉండిరి. తల వెనుకకు తిరిగి దృష్టివెనుకపై పునకే ఉన్నట్లయితే ముందుకు పోవడం సులభముకాదు.

ఇంగ్లీషు విద్య నభ్యసించిన వారి సంఖ్య నగరములలో మెల్లగా పెరుగ జొచ్చెను. న్యాయవాదులు, వైద్యులు మున్నగు వృత్తిపరు

లున్నూ, వ్యాపారస్థులున్నూ ఒకనూతన మధ్యతరగతిగా తలయెత్తిరి. వెనుకటి రోజులలో ఒక మధ్యతరగతి ఉండెను. కాని బ్రిటిషు రాజనీతి ప్రభావంవల్ల వారు చాలావరకు అంతరించిరి. ఈ నూతన బూర్జువాజీ—మధ్య తరగతి—బ్రిటిషు పరిపాలనా ఫలితముగా తలయెత్తెను. ఒక విధముగా చూచిన ఈ మధ్య తరగతి ప్రజలు బ్రిటిషు పరిపాలనపై ఆధారపడ్డవారే. ప్రజా సామాన్యమును స్వప్రయోజనమునకై ఉపయోగించుకొనుటలో వీరికిన్నీ కొద్ది బాధ్యత కలదు. దివ్యాన్నముల నారగించు బ్రిటిషు పాలకుల విస్తళ్ళకింద రాలిన మెతుకులు వారు స్వీకరించుచుండిరి. బ్రిటిషు పరిపాలనముకు సహాయముచేసే చిల్లర ఉద్యోగస్తులు వీరిలో కొందరు. పలువురు న్యాయస్థానముల నాశ్రయించి న్యాయవాదులై వ్యాజ్యెముల మూలమున ధనవంతులగుచుండిరి. వ్యాపారస్థులు బ్రిటిషు సరుకును లాభమునకో, కమీషన్‌కో అమ్ముచు బ్రిటిషు వ్యాపార పరిశ్రమల నడిపించు మధ్యవర్తులుగా మెలగుచుండిరి.

ఈ కొత్త మధ్యతరగతిలోని బహు సంఖ్యాకులు హిందువులు. ఇందుకు కారణము—ఆర్థికముగా మస్లిములకంటె వారు మంచి స్థితిలో నుండుటా, గవర్నమెంటు ఉద్యోగములకూ, వృత్తులకూ దారి చూపించే ఇంగ్లీషు విద్య వారు అభ్యసించుట. సాధారణముగా మస్లిములు హిందువుల కంటె బీద స్థితిలో ఉండిరి. ఇండియన్ పరిశ్రమలను బ్రిటిషు వారు భగ్నము చేయుటవల్ల నాశమైన నేతగాండ్రలో పలువురు మస్లిములు. అన్ని రాష్ట్రములలోకన్న బెంగాలులో మస్లిముల సంఖ్య హెచ్చు. వీరు రైతులు లేదా కొద్ది ఇనాందార్లు. భూస్వామి సామాన్యముగా హిందువై ఉండెను. గ్రామములో అప్పిచ్చువాడును, చిల్లర దుకాణదారుడును అయిన బనియాకూడా హిందువే. ఈ భూస్వామిన్నీ, బనియాయున్నూ రైతును పీడించి అతని తమ స్వలాభమునకు ఉపయోగించుకొనుచుండిరి. ఈ విషయము జ్ఞాపక ముంచుకొనుట మంచిది. హిందూ మస్లిమ్ స్పర్థలకు మూలబీజ మిందున్నది.

ఈ విధముగా దక్షిణ హిందూ స్థానమున అగ్రవర్ణములకు జెందిన హిందువులు నిమ్న జాతులవారిని పీడించుచుండెరి. నిమ్న జాతుల సమస్యను గురించి ఈ మధ్య మనము తరుచుగా, బాపు ఉపవాసానంతరము, వింటున్నాము. అస్పృశ్యతకు నిలువ నీడలేకుండా గర్హింపబడుచున్నది. వందలకొద్ది దేవాలయములును, ఇతర స్థలములును నిమ్న జాతులు ప్రవేశించుటకు తెరువబడినవి. కాని ఈ సమస్యకు మూల కారణమైన ఆర్థిక దుస్థితి తొలిగకున్న నిమ్న జాతులు నిమ్నజాతులుగానే నిలిచి పోదురు. అస్పృశ్యులు వ్యవసాయ కూలీలు మాత్రమే. వారు సేద్యము చేసికొనుటకు భూమి ఉండరాదు. ఇతర ప్రతి బంధకములు ఇంకా వారికి చాలా ఉన్నవి.

హిందూదేశ మంతయున్నూ, ప్రజాసామాన్యమున్నూ నానాటికీ బీద స్థితికి వస్తూన్నా ఈ కొత్త మధ్య తరగతి ప్రజలు మాత్రము కొంత వరకు బాగుపడ్డారు. స్వోపయోగము కొరకు దేశమును పీడించుటలో వారును భాగస్వాములగుట ఇందుకు కారణము. న్యాయవాదులున్నూ, ఇతర వృత్తుల వారున్నూ, వర్తకులున్నూ కొంత ధనము కూడబెట్టిరి. వారు దానిని వడ్డీకి వేసికొని కొంత ఆదాయము చేసికొనదలచిరి. చాలా మంది బీదరైతుల వద్దనుండి భూములుకొనిరి. తాము భూస్వాములైరి. మిగిలినవారు, ఇంగ్లీషు పరిశ్రమల అభివృద్ధి చూచి ఇండియాలో ఫ్యాక్టరీలు నిర్మించుటకు పూనుకొనిరి. ఈ విధముగా ఇండియాలోని డబ్బు ఈ పెద్దయంత్ర కర్మాగారములు నిర్మించుటకు వినియోగపడెను. హిందూదేశ పారిశ్రామిక—పెట్టుబడిదార్ల తరగతి తలయెత్తుట అప్పుడు ప్రారంభమాయెను. ఇది జరిగినది 1880 లో. 50 సంవత్సరములక్రితము.

ఈ మధ్య తరగతి ప్రజల సంఖ్య పెరుగజొచ్చెను. వారి ఆకలి కూడ పెరుగజొచ్చెను. వారికి ఎక్కువ డబ్బు చేసుకోవలెనని కోరిక పుట్టెను. గవర్నమెంటు ఉద్యోగము లెక్కువగా సంపాదించవలెనని కోరికపుట్టెను. ఫ్యాక్టరీలు స్థాపించుటకెక్కువ సదుపాయములుకావలెనని

గవర్నమెంటును కోరిరి. బ్రిటిషువారు వారికన్నివిధములా అడ్డు తగులు చుండిరి. పెద్ద ఉద్యోగములన్నీ బ్రిటిషువారి కైవశమైయుండెను. బ్రిటిషు వారి లాభముల కొరకే పరిశ్రమలు నడుపబడుచుండెను. కాబట్టి ఈమధ్య తరగతివారు అందోళన మొదలుపెట్టిరి. ఇదియే నూతన జాతీయోద్యమ మునకు ప్రాతిపదిక. 1857 లో జరిగిన తిరుగుబాటు క్రూరముగా అణచి వేయబడిన తర్వాత ప్రజలు ఆందోళన చేయుటకుగాని, ఎట్టి ఉద్యమము నడిపించుటకు గాని తగిన స్థితిలో లేరు. వారు పూర్తిగా చితికిపోయిరి. వారికి తిరిగి జీవము వచ్చుసరికె చాలా సంవత్సరములు పట్టినది.

జాతీయభావములు త్వరలో వ్యాపించుచుండెను. అందు బెంగాలు ముందంజ వేసి నడిపించుచుండెను. బెంగాలీ భాషలో కొత్త పుస్తకము ములు వెలువడ్డవి. అవి బెంగాలులో జాతీయత వృద్ధి నందుటకు తోడ్పడ్డవి. భాషనుకూడ పోషించినవి. అట్టి గ్రంథములలో ఒక్కటి "ఆనందమఠము". బంకించంద్ర ఛటర్జీ దాని కర్త. వందే మాతరమను ప్రసిద్ధ గేయము ఆ గ్రంథములోనిదే. అలజడి పుట్టించిన ఒక బెంగాలీ గీతము పేరు "నీలి దర్పణము" (నీలిమందు పరిశ్రమను గూర్చి సర్వ మును వెల్లడిచేయు అద్దము). నీలిమందు తోటలలో కూలిపనిచేయు బెంగాలు గ్రామీణుల అగచాట్లను వర్ణించు గీతమది. ఈ తోటల గాథ నీకిదివరలో కొంత చెప్పియుంటిని.

రానురాను, హిందూదేశపు పెట్టుబడిదారుల పలుకుబడి వృద్ధి అగుచుండెను. పరిశ్రమలు పెరుగుటకు వారు అనుకూలములు కోరిరి. చివరకు 1885 లో ఈ నూతన మధ్య తరగతివారు తమ కష్టములు వెల్లడించుకొనుటకు ఒక సంస్థ ఉండుట అవసరమని నిర్ణయించుకొనిరి. ఇట్లు 1885లో ఇండియన్ నేషనల్ కాంగ్రెసు స్థాపించబడెను. ఈ సంస్థ నీవు బాగా ఎరుగుదువు. ప్రతీ బాలుడూ, బాలికా ఎరుగును. ఈ మధ్య ఇది చాలా పెద్దదై పలుకుబడి సంపాదించింది. ఇది ప్రజాసామాన్యము పక్షము వహించింది. కొంతవరకు దానికి అండ అయినది. ఇండియాలో

బ్రిటిషు పరిపాలన మూలాధారములే దుష్టమని అది వాదించింది. గొప్ప ప్రజా—ఉద్యమములను నడిపించింది. స్వాతంత్ర్య పతాకమును లేవనెత్తి, స్వేచ్ఛకై ధైర్యముగా పోరాడింది. నేడు సైతము అది పోరాటమును సాగిస్తూనే ఉన్నది. కాని ఇదంతా రాబోవు చరిత్ర. స్థాపించబడ్డ మొదటి రోజులలో కాంగ్రెసు బహు జాగ్రత్తగా సంచరించుచుండెను. బ్రిటిషు వారిపట్ల రాజభక్తి ప్రకటించుచుండెను. మితవాదులతో కూడి ఉండెను. చిల్లర సంస్కారణములను చేయమని మర్యాదగా గవర్న మెంటును కోరుచుండెను. భాగ్యవంతులగు మధ్య తరగతులకే అది ప్రతినిధిగా ఉండెను. బీదలగు మధ్య తరగతుల ప్రజలైనను అందు లేరు. ప్రాజాసామాన్యముకాని. రైతులుకాని, కార్మికులుగాని దాని నెరుగరు. ఇంగ్లీషు విద్య నభ్యసించినవారికొరకు ఉద్దేశింపబడిన సంస్థ మాత్రమే అది. మన సవతి తల్లి భాషయైన ఇంగ్లీషులోనే దాని వ్యవహారములు జరుగుచుండెను. భూస్వాముల యొక్కయు, ఇండియాలోని పెట్టుబడిదార్ల యొక్కయు, ఉద్యోగముల కొరకు తంటాలుపడు అక్షరాస్యులగు నిరుద్యోగుల యొక్కయు కోరికలనే అవి కోరుచుండెను. దరిద్రముతో కొట్టుకొంటూన్న ప్రజా సామాన్యమును అది ఉపేక్షించెను. వారి అక్కరలేమో అది తెలిసికొనలేదు. ఇంగ్లీషువారికి బదులు హిందూ దేశస్థులకే ఎక్కువగా గవర్నమెంటు ఉద్యోగముల నియ్యవలసినదని అది కోరెను. ఇండియాలో అసలుజబ్బు, ప్రజలను పీడిస్తూన్న యంత్రమనే సంగతి అది గమనించలేదు. ఈ యంత్రమును నడిపేవారు ఇండియనులైనా, విదేశీయులైనా ఒక్కటే అను అంశమున్నూ అది గుర్తించలేదు. మిలిటరీ ఉద్యోగ వర్గములలోనూ, సివిలు ఉద్యోగ వర్గములలోనూ ఇంగ్లీషు ఉద్యోగస్థుల కొరకు అమిత ధనము వెచ్చింపబడుచున్నదనిన్నీ, ఇండియానుండి ఇంగ్లాండుకు వెండి, బంగారాలు ప్రవాహము కట్టిపోవుచున్నవనిన్నీ కాంగ్రెసు మొర పెట్టింది.

తొలి రోజులలో కాంగ్రెసు తన ఆశయములు మితముగా పెట్టు

కొన్నదని చెప్పుటవల్ల దానిని నేను విమర్శిస్తున్నాననిగాని, త్యజీక
రిస్తున్నాననిగాని భావించవద్దు. అది నాపనికాదు. ఆ రోజులలో కాంగ్రె
సున్నూ, దాని నాయకులున్నూ గొప్పపని చేశారనే నా అభిప్రాయము.
భారత రాజకీయములలో సంభవించిన కష్ట సంఘటనలు కారణముగా
కాంగ్రెసు ఇష్టములేకున్నా క్రమక్రమంగా అతివాదములోనికి దిగింది.
కాని తొలిరోజులలో అది ఉండవలసినట్లే ఉన్నది. ఆ రోజులలో
ముందడుగు వేయుటకు దాని స్థాపకులకెంతో సాహసము కావలసి
వచ్చెను. నలుగురూ మన పక్షమున ఉండి మనలను పొగుడుతూ
ఉన్నప్పుడు మనము ఇప్పుడు వీరవాక్యాలు పలకడం సులభమే. కాని
ఒక మహా సంస్థను నడపడానికి పూనుకొనడం చాలాకష్టం.

1885 లో బొంబాయిలో మొదటి కాంగ్రెసు మహాసభ జరిగింది.
బెంగాలు వాడైన డబ్ల్యూ. సి. బొనర్జీ మొదటి అధ్యక్షుడు. ఆనాటి
ప్రసిద్ధులు సురేంద్రనాథ బెనర్జీ, బద్రుద్దీన్ తయాబ్జీ, ఫిరోజిషామెహతా.
కాని అందరినీ మించినవాడొక్కడున్నాడు. అతడు దాదాభాయినౌరోజీ.
"భారతదేశ మహా వృద్ధు" డయినాడు. ఇండియా గమ్యస్థానమును
తెలుపుటకు స్వరాజ్యమనుమాట మొట్టమొదట వాడిన నాయకుడితడే.
వేరొకని పేరు నే నుదహరిస్తాను. కాంగ్రెసు ప్రాచీన నాయకులలో బ్రతికి
యున్నవాడతడొక్కడే. అతనిని నీవు బాగా ఎరుగుదువు. అతడు
పండిత మదనమోహనమాలవ్యా. ఇండియానుద్దేశించి ఆయన యాభై
సంవత్సరములు పైగా కష్టపడి పనిచేసెను. వృద్ధుడై కష్టముల పాలై
నప్పటికీ చిన్ననాటి స్వప్నముల ఫలసిద్ధికై ఇంకనూ ఆయన పాటు
పడుతున్నాడు.

కాంగ్రెసు ఆనాటికానాడు బలము పోసుకొంటూ వృద్ధి చెందు
చుండెను. దీనికి ముందు పుట్టిన హిందూ జాతీయత ఆశయములవలె
దీని ఆశయములు సంకుచితముగా లేవు. అయినప్పటికీ ఇది ఇంకను
చాలావరకు హిందూ సంస్థగానే ఉండెను. కొందరు మస్లిము నాయకులు

అందు చేరిరి. కొందరు అధ్యక్షులైరి. కాని మొత్తముమీద మస్లిములు దానికి దూరముగానే ఉండిరి. ఆనాటి ఒక గొప్ప మస్లిము నాయకుడు సర్ సయ్యదు అహమదు ఖాన్. విద్యావిహీనతయే, అందు ముఖ్యముగా నూతన విద్య నభ్యసించకుండుటయే, మస్లిములు వెనుకబడుటకును, నష్ట మొందుటకును కారణమని అతడు గ్రహించెను. కాబట్టి ఈ విద్య నభ్యసింప మస్లిముల ప్రోత్సహించవలసి ఉంటుందని అతడు తలచెను. ఏకాగ్రముగా ఈ విద్య నభ్యసించిన పిమ్మటనే గాని రాజకీయములలో దిగకూడదనికూడ అతడు భావించెను. కాబట్టి కాంగ్రెసులో చేరవద్దని మస్లిములకతడు సలహా ఇచ్చెను. ప్రభుత్వముతో అతడు సహకరించి ఆలీఘరులో ఒక కాలేజీ మస్లిములకొరకు స్థాపించెను. అదియే విశ్వ కళాశాలగా నేడు పరిణమించినది. సర్ సయ్యదు సలహాను బహు సంఖ్యాకులగు మస్లిములు అనుసరించిరి. వారు కాంగ్రెసులో చేరలేదు. కాని కొద్దిమంది మస్లిములు మాత్రము కాంగ్రెసును అంటిపెట్టుకొని ఉండిరి. నేను బహు సంఖ్యాకులు, అల్ప సంఖ్యాకులు అన్నప్పుడు నా ఉద్దేశము ఇంగ్లీషు విద్య నభ్యసించి పై అంతస్థులోనున్న మధ్య తరగతి హిందువులనిన్నీ, మస్లిములనిన్నీ మాత్రమే. ప్రజా సామాన్యము నకు—హిందువులుకానీ, మస్లిములుకానీ—కాంగ్రెసుతో పనిలేదు. ఆ రోజులలో దానిపేరు విన్నవారు బహు కొద్దిమంది మాత్రమే. క్రింది అంతస్థులో ఉన్న మధ్య తరగతి ప్రజలకుకూడ అప్పుడు దానిపై లక్ష్యబుద్ధి లేదు.

కాంగ్రెసు పెరిగింది. దానికంటె వేగంగా జాతీయభావములూ, స్వాతంత్రేచ్ఛా పెరిగినవి. కాంగ్రెసు ఆశయములు సంకుచితముగా ఉండుటకు కారణము అది ఇంగ్లీషు చదువుకొన్నవారినుద్దేశించి యుండుటయే. కొంతవరకూ వివిధ రాష్ట్రము లేకీభవించుటకున్నూ, ఏకలక్ష్యము కలిగియుండుటకున్నూ ఇది తోడ్పడెను. కాని ప్రజా సామాన్యముతో కాంగ్రెసు సంబంధము పెట్టుకోకపోవుటవల్ల దానికి బలము కొరవడెను.

ఆసియాలో కదలిక పుట్టించిన ఒక విషయమును గురించు నేనొక జాబులో వ్రాసి ఉంటిని. అది చిన్న దేశమైన జపాను పెద్దదేశమైన రష్యాపై 1904-5 లో విజయము సాధించడము. దానిని చూచి ఇతర ఆసియా దేశములవలెనే ఇండియాకూడ సంతోషించెను. ఇండియా అనగా చదువుకొన్న మధ్యతరగతి ప్రజలు. వారికి ఆత్మవిశ్వాసము హెచ్చెను. ఒక్కొలి ప్రబలమైన యూరోపియన్ దేశములలో ఒకటైన రష్యాపై జపాను జయము పొందగలిగినప్పుడు ఇండియా యేల పొంద లేదు? చాలాకాలముపాటు భారతీయులు బ్రిటిషువారికంటె తక్కువ అని న్యూనతపడుచుండిరి. చిరకాలముపాటు బ్రిటిషువారు ఇండియాలో అధికారము చెలాయించుట, 1857 లో జరిగిన తిరుగుబాటును రాక్ష సముగా వారు అణచివేయుట కారణముగా భారతీయులు భయపడిఉండిరి. ఆయుధ శాసనము కారణముగా వారాయుధములు పట్టుటకు వీలులేదు. ఇండియాలో ఏమితటస్థించినా సరే—భారతీయులు తక్కువజాతివారనీ. ఒకరికి తలయొగ్గి ఉండవలసినవారనీ పాలకులు వారికి జ్ఞాపకముచేస్తూ ఉండిరి. వారభ్యసించే ఇంగ్లీషు చదువుకూడా వారు తక్కువ జాతి వారనే భావము కలిగించేదే. ఇండియా ఎప్పుడూ అరాజకముగా ఉండే దనిన్నీ, హిందువులూ, మస్లిములూ ఒకరినొకరు చంపుకొనేవారనిన్నీ ఇంగ్లీషువారు వచ్చి ఇట్టి హీనస్థితిలో ఉన్న దేశాన్ని రక్షించి దానికి శాంత సౌఖ్యములు చేకూర్చేరనిన్నీ అబద్ధపు తప్పుల తడకచరిత్ర వారికి బోధింపబడింది. సత్యాన్ని, చరిత్రనీ పూర్తిగా ఉపేక్షించి, ఆసియా వెనుకబడ్డ ఖండమనిన్నీ, యూరోపియనుల అధికారములోనే అది ఉండ తగ్గదనిన్నీ, యూరోపియనులు తామునమ్మి లోకమునకు వెల్లడిచేశారు.

కాబట్టి జపాను విజయము ఆసియాకు రసాయనమువలె పని చేసెను. ఇండియాలో మనకున్న న్యూనత్వ భావము సన్నగిల్లింది. బెంగాలు మహా రాష్ట్రములలో ముఖ్యముగా జాతీయ భావములు విరివిగా వ్యాపించినవి. అప్పుడే బెంగాలులో ఒక గొప్ప విశేషము సంభవించెను.

బెంగాలు ప్రజలకది ఉద్రేకము కలిగించెను. ఇండియానంతనూ కది లించెను. బ్రిటిషు గవర్నమెంటువారు బెంగాలు రాష్ట్రమును (అప్పుడు బీహారుకూడా దానితోకలిసి ఉండెను) రెండు భాగములుగా విభజించిరి. అందొక భాగము తూర్పు బెంగాలు. బెంగాలులోని మధ్యతరగతి ప్రజలలో జాతీయత వృద్ధి నందుచున్నందున వారీవిభజనకు అసమ్మతిని జూపిరి. రాష్ట్రమునట్లు విభజించి తమ్ము దుర్బలులనుగా జేయుటకు బ్రిటిషువారు యత్నించుచున్నట్లు వారు అనుమానించిరి. తూర్పు బెంగాలులో మస్లిముల జనసంఖ్య హెచ్చు. ఇట్లు విభజించుటవల్ల హిందూ ముస్లిము సమస్యకూడా పొడచూపెను. బ్రిటిషువారికి వ్యతిరేకముగా ఒక గొప్ప ఆందోళన బెంగాలులో బయలుదేరెను. భూస్వాములు పలువురు అందు చేరిరి. ఇండియన్ పెట్టుబడి దారులును చేరిరి. స్వదేశీ అనే నినాద మానాడే లేచినది. దానితోపాటు బ్రిటిషు వస్తువుల బహిష్కారణ కూడ వచ్చెను. ఇది ఇండియన్ పరిశ్రమకూ, పెట్టుబడికీ సహాయకారిగా ఉండెను. ఈ ఉద్యమము కొంతమట్టుకు ప్రజాసామాన్యమువరకూ కూడా పాకెను. హిందూ మతము కొంతవరకీ ఉద్యమమునకు ప్రోత్సాహ మిచ్చెను. దీనితోపాటు బెంగాలులో విప్లవ పూర్వకమైన హింసాకార్యములు చేయుట అవసరమని కొందరభిప్రాయపడిరి. భారతదేశ రాజకీయములలో బాంబు ప్రవేసించినదప్పుడే. బెంగాలు ఉద్యమమును నడిపించిన ఉత్తమ నాయకులలో అరవింద ఘోషు ఒక్కడు. అతడింకను జీవించియున్నాడు. ఫ్రెంచి ఇండియాలో ఉన్న పుదుచ్చేరిలో చాలా సంవత్సరములనుంచి అతడు ఏకాంతవాసియై ఉన్నాడు.

పడమటి ఇండియాలో మహారాష్ట్ర దేశమునకూడ అలజడి అధికముగా ఉండెను. హిందూమత ఛాయలతో ఉద్రిక్త జాతీయత అచ్చట పునరుద్భవించెను. అక్కడొక మహానాయకు డుదయించెను. అతని పేరు బాలగంగాధర తిలకు. హిందూదేశమందంతటా అతనిని లోకమాన్యుడందురు. తిలకు గొప్ప పండితుడు. ప్రాగ్దేశ శాస్త్రములను,

పాశ్చాత్య విద్యనుకూడ అతడభ్యసించెను. అతడొక గొప్ప రాజకీయ వేత్త. అంతకన్న విశేషము అతడొక గొప్ప ప్రజానాయకుడు. నేషనల్ కాంగ్రెసు నాయకులింతవరకూ ఇంగ్లీషు విద్య నభ్యసించిన వారినుద్దేశించి మాట్లాడుచుండిరి. ప్రజాసామాన్యము వారినెరుగదు. క్రొత్త ఇండియాలో ప్రజాసామాన్యమునుద్దేశించి పలుకుచు వారినుండి శక్తిపొందిన మొదటి రాజకీయ నాయకుడు తిలకు. వీర్యవంతమగు అతని మూర్తిమత్త్వములో ఒక క్రొత్త బలము అకుంఠిత సాహసము గోచరించెను. బెంగాలులోని జాతీయభావములకును, త్యాగమునకును అది పుష్టినిచ్చెను. భారతీయ రాజకీయముల పైఖరే మారిపోయెను.

అలజడిగానున్న 1906, 1907, 1908 సంవత్సరములలో కాంగ్రెసు ఏమి చేస్తూన్నట్లు? జాతీయ భావము మేల్కొన్న ఈ దినములలో కాంగ్రెసు నాయకులు జాతిని నడిపించుటకు బదులు వెనుకకు తగ్గిరి. అలజడిలేని రాజకీయములకే వా రలవడ్డారు. వారి రాజకీయములలో ప్రజాసామాన్యము లేదు. ప్రజ్వలిస్తూన్న బెంగాలువారి ఉత్సాహము వారికి కిట్టలేదు. తిలకులో రూపమునందిన మహారాష్ట్రుల స్థైర్య భావమున్నూ వారికి నచ్చలేదు. వారు స్వదేశీ మంచిదే అని మెచ్చుకొన్నారు. కాని బ్రిటిషు వస్తుబహిష్కారమంటే వెనుకతీశారు. కాంగ్రెసులో రెండు పక్షములు బయలుదేరినవి. తిలకును, కొందరు బెంగాలు నాయకులును నడిపించే అతివాద పక్షమొకటి. పాత కాంగ్రెసు నాయకులు నడిపించే మితవాదపక్షమొకటి. మితవాదులలో మిక్కిలి ప్రసిద్ధుడు ఒక యువకుడు. అతనిపేరు గోపాలకృష్ణ గోఖలే. అతడు మిక్కిలి సమర్థుడు. దేశసేవకే అతడు తన జీవితమును ధారపోసెను. గోఖలేకూడ మహారాష్ట్రుడే. తిలకుకును ఇతనికిని తరుచు భేటీ పడుచుండెను. 1907 లో కాంగ్రెసులో చీలిక రాక తప్పదయ్యెను. మితవాదులు కాంగ్రెసును తాము యథాపూర్వము నడుపజొచ్చిరి. అతివాదులకందు తావులేకపోయెను. మితవాదులు విజయమందిరి. కాని దేశములో వారి పలుకుబడి సన్న

గిల్లెను. తిలకు పక్షమునకు ప్రజలలో పలుకుబడి హెచ్చుగా ఉండెను. కాంగ్రెసు బలహీనమయ్యెను. కొంతకాలమువరకు దానికి పలుకుబడేలేదు.

ఈ కాలములో గవర్నమెంటువారు ఏమి చేస్తూన్నట్లు? భారత జాతీయతకు వారి సమాధానమేమి? వారికి ఇష్టములేని కోరిక చెల్లించమన్నప్పుడు వారు చేసేది దండప్రయోగమే. ఈ విధముగా గవర్నమెంటు ప్రజలను అణచివేయుటకు పూనుకొనెను. వారిని జైళ్ళకు పంపెను. ప్రెసు చట్టముల పేరున వార్తాపత్రికలను అణచివేసెను. వారికిష్టములేని ప్రతివాని చర్యలు పరిశీలించుటకు రహస్య రక్షకభటులను, గూఢచారులను అనేకమందిని నియోగించెను. అప్పటినుండియు ప్రసిద్ధులగు భారత రాజకీయ వేత్తల వెన్నంటి సి. ఐ. డీ భటులు తిరుగుచుండిరి. బెంగాలు నాయకులు అనేకులు కారాగారబద్ధులైరి. అన్నింటికన్న ప్రసిద్ధమైన విచారణ లోకమాన్య తిలకుకు సంబంధించినది. ఆరు సంవత్సరముల కాలమతనికి ఖైదు విధించిరి. మాండలేలో కారాగారమందున్నప్పుడే అతడొక ప్రసిద్ధ గ్రంథమును రచించెను. లాలా లజపతిరాయికూడ బర్మాలో దేశాంతరవాస మనుభవించవలసి వచ్చెను.

గవర్నమెంటు వారవలంబించిన కఠిన చర్యలవల్ల బెంగాలులో జాతీయభావ మంతరించలేదు. కాబట్టి కొందరినైనా శాంతింపజేయుటకు పరిపాలనలో కొంత సంస్కరణ ప్రవేశపెట్టబడెను. అప్పటి గవర్నమెంటు రాజనీతి—తరువాతా, ఇప్పుడూకూడా అంతే—జాతీయ వాదులలో చీలికలు పుట్టించడము. మితవాదులను కూడదీసుకొని అతివాదులను అణచివేయవలెనని వారు తలచిరి. 1908 ఈ నూతన సంస్కరణలు—మోర్లే—మింటో సంస్కరణలని వీటి పేరు—ప్రకటింపబడెను. మితవాదులీసంస్కరణలతో తృప్తినందిరి. మితవాదులను కూడదీసుకొనుట జయప్రదముగా జరిగినది. తమ నాయకులు జైళ్ళలో నుండుటచేత అతివాద పక్షమువారు నిరుత్సాహము పాలైరి. జాతీయోద్యమ మందుచేత నీరసించెను. బెంగాలులోమాత్రము విభజనకూడదను ఆందోళన జరుగు

చునే ఉండెను. చివరకు దానికి విజయము చేకూరెను. 1911లో బ్రిటిషు గవర్నమెంటువారు విభజన రద్దుచేసిరి. ఈ విజయము బెంగాలీలకు ఉత్సాహ కారణమయ్యెను. 1907 ఉద్యమము నీరసిల్లెను. రాజకీయముగా ఇండియా ఉదాశీనమయ్యెను.

1911 లోనే ఇండియాకు ఢిల్లీ నూతన రాజధాని అని ప్రకటింపబడెను. అనేక సామ్రాజ్యములు ఢిల్లీలో విరాజిల్లినవి. అనేక సామ్రాజ్యములందు అంతరించినవి.

యూరోపులో 1914 సంవత్సరమున ప్రపంచయుద్ధము ప్రకటింపబడినప్పుడు ఇండియా పరిస్థితు లిట్లుండెను. దీనితో 19వ శతాబ్ది ముగిసెను. యుద్ధమువల్ల ఇండియాలో పలు మార్పులు కలిగెను. కాని ఇందునుగురించి కొంత ముందు ముందు చెప్పవలసి ఉన్నది.

19వ శతాబ్ది ఇండియా పరిస్థితులను గురించి చెప్పడము చివరకు పూర్తి అయినది. నేటి కాలమునకు వచ్చుటకు ఇక 18 సంవత్సరములు మాత్రమే ఉన్నవి. ఇక మనము ఇండియాను వదలిపెట్టి, వచ్చేజాములో చీనాకు వెడదాము. అచ్చట వేరొక తరహాగా సామ్రాజ్యవాదులు స్వప్రయోజన పరులై ప్రజలను పీడించుట మనము చూడగలము.

## 114

## బ్రిటను బలవంతముగా నల్లమందును చీనాలో ప్రవేశపెట్టుట

డిశంబరు 14, 1932

పారిశ్రామిక యాంత్రిక విప్లవములవల్ల ఇండియాకు కలిగిన ఫలితములను విపులముగా చెప్పియుంటిని. ఇండియాలో నూతన సామ్రాజ్యతత్వ మే విధముగా పనిచేసినదీకూడా చెప్పియుంటిని. నేను భారతీయుడ నగుటచేత ఒక పక్షమునకు చెందినవాడను. కాబట్టి ఆ

పక్షమునకు సంబంధించిన విధముగా నా అభిప్రాయములను నేను వెల్లడి చేయక తీరదు. నిష్పాక్షిక బుద్ధితో, జాతీయవాదివలెగాక, శాస్త్రజ్ఞుని దృష్టితో ఈ విషయములు పరిశీలించుటకు నేను ప్రయత్నించుచుంటిని. నీవును అట్లే చేయవలెనని కోరుచున్నాను. జాతీయత ఆయా సందర్భము లలో మంచిదేకాని దానిని నమ్మడానికి వీలులేదు. నిజమైన చరిత్ర రచించుటకది తోడ్పడజాలదు. మనకును, మన దేశమునకును సంబంధించిన విషయములనది చూడనీయదు. ఒక్కొక్కప్పుడు సత్యస్వరూపము నది మార్చివేయును. ఇండియా అధునాతన చరిత్రను గురించి విచారించుచున్నప్పుడు మనము జాగ్రత్తగా ఉండవలెను. లేకుంటే మన కష్టముల కన్నింటికీ బ్రిటిషువారే బాధ్యులందుము.

పందొమ్మిదో శతాబ్దిలో బ్రిటిషు పారిశ్రామికులున్నూ, పెట్టుబడిదార్లున్నూ ఇండియానెట్లు స్వలాభమునకై ఉపయోగించుకొన్నారో చూచితిమి. ఇప్పుడు మనము, ఇండియాకు ప్రాచీన మిత్రమైనట్టిన్నీ, జాతులలో ప్రాచీనమైనట్టిన్నీ, ఆసియాలోని గొప్పదేశమైనట్టిన్నీ చీనాకు వెళ్లెదము. పాశ్చాత్యులీదేశమును పేరొకవిధముగా పీడించిరి. ఇండియావలె చీనాదేశము, ఏ యూరోపియన్ దేశమునకునూ వలసరాజ్యము కాలేదు. పరాధీన రాజ్యమున్నూ కాలేదు. 19 శతాబ్ది మధ్యకాలము వరకూ శక్తివంతమైన కేంద్ర ప్రభుత్వముండి ప్రజలను కూడగట్టుకొన గలుగుటచే ఈ దురవస్థ దానికి పట్టలేదు. మొగల్ సామ్రాజ్యము పతన మగుటతోడనే, ఇంతకు 100 ఏండ్లకు ముందు ఇండియా ఛిన్నాభిన్నమై పోయినట్లు మనము చూచిఉన్నాము. 19వ శతాబ్దిలో చీనా దుర్బల మయ్యెను. అయినా అది చివరవరకూ ఏకీభావముతోనే ఉండగలిగెను. విదేశ జాతులు పరస్పరము ఈర్ష్యలు పెట్టుకొని యుండుటచేత చీనా దుర్బలత్వమును పురస్కరించుకొని వారెక్కువ లాభము పొందజాలక పోయిరి.

చీనానుగురించి వెనుక వ్రాసిన జాబులో (94 జాబు) బ్రిటిషు

వారు చీనాతో తమ వర్తకమును వృద్ధిచేసుకొనుటకు చేసిన ప్రయత్నము లను గురించి చెప్పితిని. ఇంగ్లీషు రాజైన జార్జి III వ్రాసిన జాబుకు జవాబుగా మంచూ చక్రవర్తియైన చీన్‌లంగ్ అధికార పురస్సరముగా, అనుగ్రహ పూర్వకముగా వ్రాసిన జాబునుంచి విపులముగా ఉదహరించి నాను. ఇది 1792 లో జరిగెను. ఈ కాలమున యూరోప్పులో తుపాను రేగుచుండెను. ఫ్రెంచి విప్లవము జరుగుచున్న కాలమది. దీనితరువాత నెపోలియనూ, అతడు చేసిన యుద్ధములూ వచ్చెను. ఈ కాలమున ఇంగ్లాండు యుద్ధ కార్యములలో పూర్తిగా నిమగ్నమై యుండెను. నెపోలియన్‌తో తెగించి పోరాడుచుండెను. నెపోలియన్ పతనమై ఇంగ్లాండుకు కొంత విశ్రాంతి చిక్కు-వరకూ చీనాతో వర్తకము వృద్ధి చేసుకోవలెననే ప్రశంసయే ఇంగ్లాండుకు లేదు. 1816లో చీనాకు పేరొక రాయబార మంపబడెను. చీనా చక్రవర్తికి చూపవలసిన మర్యాదలలో కొంత తేడా ఉండుటవల్ల అతడు ఇంగ్లీషు రాయబారియైన అమ్హర్స్టు ప్రభువును చూడ నిరాకరించి, ఇంటికి పొమ్మనెను. చూపవలసిన మర్యాద—కో—టౌ—అను పేరుగలది. నేలమీద ఫాలముంచి చేయవలసిన ఒకవిధమగు దండప్రమాణమది.

ఈ రాయబారము నిష్ఫలమయ్యెను. ఇంతలో ఒక కొత్త వ్యాపారము—నల్లమందు వ్యాపారము—త్వరత్వరగా వృద్ధినందుచుండెను. దీనిని కొత్త వ్యాపార మనడము సరికాదేమో : ఎందుకంటే 15వ శతాబ్దిలోనే ఇండియా చీనాకు నల్లమందు మొట్టమొదట ఎగుమతి చేసింది. ఇండియా చీనాకు సద్వస్తువులనేకము వెనుకటి కాలంలో పంపించి ఉన్నది. అది పంపిన చెడ్డ వస్తువులలో చాలా చెడ్డది నల్లమందు. కాని అప్పటి వ్యాపారము పరిమితముగా ఉండెను. యూరోపియనులు, అందు ముఖ్యముగా బ్రిటిషు వ్యాపారమును గుత్తకుగొన్న తూర్పుఇండియా సంఘము కారణముగా 19వ శతాబ్దిలో ఈ వ్యాపారము పెరిగెను. మన్యపు జ్వరము రాకుండా తూర్పు దేశములందున్న దచ్చివారు నల్లమందుతో


బ్రిటను : చీనా
పర్వతములు
పర్వతమయ ప్రదేశములు
పెకింగ్
టీన్ చన్
కొరియా
నాన్‌కింగ్
హాంకో
షాంగ్‌హై
నింగ్‌పొ
ఫూచో
కాంటన్
అమొయ్
హాంగ్‌కాంగ్
ఫ్రెంచి ఇండోచీనా
బ్రిటిషువారు దేశములోకి ప్రవేశించిన ప్రధాన స్థలములు

పొగాకు చేర్చి పొగ తాగేవారట. వారిద్వారా నల్లమందు పొగతాగుట చీనాకు సంక్రమించింది. ఇదివరలో చీనావారు పట్టి నల్లమందునే పొగ తాగేవారు. ఇప్పుడు పొగాకుతో చేర్చడంకూడా నేర్చుకున్నారు. ప్రజల ఆరోగ్యము చెడుచున్నదనిన్నీ, నల్లమందు వ్యాపారమువల్ల అమిత ధనము దేశమునుండి పోవుచున్నదనిన్నీ భావించి చీనా ప్రభుత్వము వారు ఈ అలవాటును అరికట్ట పూనుకొనిరి.

1800 లో చీనా ప్రభుత్వమువారు ఒక ఉత్తరువు జారీ చేశారు. ఎట్టి ప్రయోజనమును ఉద్దేశించి అయినాసరే నల్లమందును దేశము లోనికి దిగుమతి చేయరాదు. అయితే ఈ వ్యాపారము విదేశీయులకు చాలా లాభకరముగా ఉండెను. దేశములోనికి నల్లమందు దొంగతన ముగా వారు ప్రవేశపెట్టుచునే ఉండిరి. ఇందుకై వారు చీనా ఉద్యోగస్తు లకు లంచము లిచ్చుచుండిరి. దానిమీద చీనా ప్రభుత్వము ఒక ఆంక్ష పెట్టెను—చీనా ఉద్యోగస్తులెవ్వరునూ విదేశవర్తకులను కలుసుకోరాదని. విదేశీయున కెవ్వనికైనను చీనా, మంచూ భాషలు నేర్పినవారికి తీవ్ర శిక్షలు వడుచుండెనుకూడా. ఇంతచేసినా ఏమీ లాభించలేదు. నల్లమందు వ్యాపారము జరుగుచునే పోయెను. బహుశా లంచగొండి తనము, దుర్వర్తనము అధికముగా ఉండియుండును. 1834 సంవత్సరాంతమున పరిస్థితులు విషమించెను. చీనా వర్తకము తూర్పు ఇండియా సంఘము గుత్తకు పుచ్చుకొన్నట్లు చెప్పితినిగదా. బ్రిటిషు ప్రభుత్వము దాని నిప్పుడు రద్దు చేసెను. బ్రిటిషు వర్తకులందరూ చీనావర్తకము చేయ వచ్చునని అది శాశించెను.

ఉన్నట్లుండి, దొంగతనముగా నల్లమందు అధికముగా దేశములో ప్రవేశింప దొడగెను. దీనిని అణచివేయుటకు తీవ్రచర్య తీసుకోవలెనని తుట్టతుదకు చీనా ప్రభుత్వమువారు తీర్మానించిరి. ఇందుకై వారొక సమర్థుని ఏర్పరచిరి. లిన్‌చే—సీ ని దొంగ వర్తకము నణచివేయుటకై ప్రత్యేక కమీషనరుగా ఏర్పరచిరి. అతడు వెంటనే తీవ్రచర్య తీసి

కొనెను. దక్షిణమున, కాంటన్ ఈ చట్ట విరుద్ధమగు వర్తకమునకు ముఖ్య కేంద్రము. అతడచ్చిటికివెళ్ళి, తమ వద్దనున్న నల్లమందు నంతనూ తనవశము చేయమని విదేశ వర్తకుల నాజ్ఞాపించెను. మొదట వారా ఆజ్ఞను పాటించలేదు. లిన్ తన ఆజ్ఞను వారు పాటించునట్లు నిర్బంధించెను. వారి వారి ఫ్యాక్టరీలలో వారిని కేటాయించి వేసెను. వారివద్ద పనిచేయు కార్మికులనూ, నౌకర్లనూ వారిని వదలిపెట్టునట్లు చేసెను. బయటనుంచి వారికి ఆహారమందకుండా చేసెను. ఇంత తీవ్రముగా పనిచేయుటవల్ల విదేశ వర్తకులు కాళ్ళ బేరమునకు వచ్చి 20,000 నల్లమందు పెట్టెలను చీనా ప్రభుత్వమునకు అప్పగించిరి. ఈ సరుకు యావత్తూ దొంగవర్తకముకొరకు ఉద్దేశింపబడినదే. కాన లిన్ ఈ సరుకును నాశము చేయించెను. నల్లమందు తేవడములేదని కప్తాను హామీ ఇస్తేనేతప్ప ఏ ఓడా కాంటన్ రేవులో ప్రవేశించరాదని విదేశ వర్తకులతో లిన్ చెప్పెను. ఈ విషయమై మాట తప్పితే ఓడనూ, అందలి సరుకునూ చీనాప్రభుత్వము తనవశము చేసుకొనును. కమీషనర్ లిన్ చేయవలసిన పని క్షుణ్ణముగా చేసెను. తనకు గవర్నమెంటు అప్ప జెప్పినపని చక్కగా చేసెను. కాని అందువల్ల కలిగే ఫలితములవల్ల చీనా బాధపడవలసి వచ్చునని అతడు గ్రహించలేదు.

ఫలితములేమనగా—బ్రిటనుతో యుద్ధము; చీనా పరాజయము; పరువునష్టము కలిగించు సంధి; చీనా ప్రభుత్వము నిషేధించకోరిన నల్ల మందు బలవంతముగా చీనాకు అంటగట్టుట. చీనా ప్రజలకు నల్లమందు మంచిదా, చెడ్డదా? అనే విషయం గణించదగ్గది కాదు; చీనా ప్రభుత్వము చేయదలచుకొన్న కార్యము గణించదగ్గది కాదు; కాని గణించదగిన దేమంటే—బ్రిటిషు వర్తకులకు నల్లమందు దొంగవర్తకము లాభకర మైనది. ఇందువల్ల వచ్చే ఆదాయమును నష్టపోవుటకు బ్రిటను సమ్మతించదు! కమీషనరు లిన్ నాశముచేసిన నల్లమందు చాలావరకు బ్రిటిషు వర్తకులదే. కాన దేశ గౌరవమును నిలబెట్టుకొనుటకు 1840 లో

బ్రిటను చీనాతో యుద్ధమునకు దిగెను. నల్లమందు యుద్ధము అనే దీని పేరు సముచితముగానే ఉన్నది. ఎందువల్లనంటే నల్లమందును బలవంతముగా చీనాకు అంటగట్టుటకు పోరాడి, విజయము సాధించిన యుద్ధమిది.

కాంటన్ రేవులోను ఇతర స్థలములలోను, అవరోధము (Bloc-kade) ను బ్రిటిషు నౌకాదళము కల్పించుటచేత చీనా ఏమీ చేయలేక పోయినది. రెండేండ్లు గడచిన పిమ్మట అది లొంగిపోక తీరిందికాదు. 1842 లో నాన్‌కింగ్ సంధి జరిగెను. దాని ప్రకారము 5 రేవు పట్టణముల ద్వారా విదేశ వ్యాపారము—అనగా ముఖ్యముగా ఆనాడు జరుగుచుండగలందులకు ఒడంబడికజరిగెను. ఆ రేవు పట్టణములకు "సంధి—రేవుపట్టణము"లని పేరు. అవి కాంటన్, షాంగ్‌హై, అమోయ్, నింగ్‌పో, ఫూచో, కాంటన్‌వద్దనున్న హాంకాంగ్‌ద్వీపమునుకూడా బ్రిటనుస్వాధీనము చేసుకొనెను. అంతేకాకుండా, నాశనము చేయబడ్డ నల్లమందుకు నష్టపరిహారముగానున్నూ, చీనాచే బలవంతముగా చేయించిన యుద్ధమునకయిన ఖర్చులకుగానున్నూ పెద్ద ధన మొత్తము బ్రిటను చీనానుండి బలవంతాన తీసుకొనెను.

ఈ విధముగా బ్రిటిషువారు నల్లమందు విజయమును సాధించిరి. చీనా చక్రవర్తి స్వయముగా ఇంగ్లాండు రాణీయైన విక్టోరియా రాణీగారికి సగౌరముగా ఒక మనవి పంపుకొనెను. చీనాలో బలవంతముగా ప్రవేశపెట్టబడ్డ నల్లమందు వ్యాపారమువల్ల ఎట్టి ముప్పు వాటిల్లేది అతడు చెప్పుకున్నాడు. రాణీవద్దనుంచి జవాబు లేదు. సరిగా 50 సంవత్సరములకు పూర్వము అప్పుడు రాజ్యమేలే చీన్‌లంగ్ చక్రవర్తి ఇంగ్లాండు రాజుకు వ్రాసిన లేఖ వేరొక తరహాగా ఉన్నదికదా!

పాశ్చాత్య దేశములనుండి వచ్చిన సామ్రాజ్య వాదులైన జాతులతో చీనా ఇబ్బందులు పడుటకిది ప్రారంభము. దాని బ్రతుకు అది బ్రతుకుచూ ఉండ వీలైనదికాదు. విదేశస్థుల వ్యాపారమది అంగీకరించక

తప్పిందికాదు. అంతేకాకుండా క్రైస్తవ మిషనరీలనుకూడా అది అంగీకరించవలసి వచ్చినది. చీనాలో ఈ మిషనరీలు ప్రముఖపాత్ర వహించిరి. సామ్రాజ్యతత్వ ప్రవేశమునకు వారు పురోగాములుగా పనిచేసిరి. తరువాత చీనా వద్ద అనేక బాధలకు ఈ మిషనరీలే కొంతవరకు కారకులు. వారమర్యాదగా ప్రవర్తించుచుండిరి. వారి ప్రవర్తన అసహ్యముగా ఉండెను. వారిని చీనా న్యాయస్థానములు విచారణ చేయరాదు. కొత్త సంధి షరతుల ప్రకారము విదేశీయులు చీనా చట్టమునకుగాని, చీనా న్యాయస్థానములకుగాని బద్ధులుకారు. తమ సొంత న్యాయస్థానములే వారిని విచారించవలెను. దీనినే "ఎక్స్ట్రా టెరిటోరియాలిటీ" అంటారు. అంటే తాను కాపురమున్న దేశ చట్టములకుబద్ధుడు కాకుండా ఉండుట. అది నేటికినీఉన్నది. దానినెవరూ సహించుటలేదు. మిషనరీ ప్రచారము వల్ల క్రైస్తవ మతమును స్వీకరించినవారు సైతము ఈ హక్కును కోరుచుండిరి. ఏవిధముగా చూచినా వారిందుకు అర్హులుకారు. అయితే నేమి? సామ్రాజ్యవాద జాతి ప్రతినిధియైన మిషనరీ వారి వెనుక ఉన్నాడు కదా! ఇట్లు గ్రామమునకు గ్రామమునకు విరోధములు పుట్టుచుండెను. గ్రామస్థులు కుపితులైనప్పుడు తిరుగబడి మిషనరీపై పడుచుండిరి. ఒక్కొక్కప్పుడు చంపుచుండిరి. అప్పుడు సామ్రాజ్యవాద జాతి తటాలున దిగివచ్చి తీవ్రముగా ప్రతీకారము చేయుచుండెను. చీనాలో తమ మిషనరీల హత్యలు చేయబడ్డ సందర్భములలో యూరోపియన్ జాతులకు ఎక్కువ లాభము వచ్చేది. ప్రతి హత్య తరువాతా వారు కొత్త హక్కులను బలవంతముగా తీసుకొనేవారు.

చీనాలో మిక్కిలి ఘోరము, క్రూరము అయిన తిరుగుబాటు క్రైస్తవ మతము స్వీకరించిన ఒక వ్యక్తివలన ప్రారంభింపబడ్డది. ఈ తిరుగుబాటును తైపింగు తిరుగుబాటు అందురు. హంగ్‌సీన్-చూఆన్ అనే ఒక ఉన్మత్తుడు 1850 ప్రాంతమున దీనిని లేవదీసెను. ఈ మతోన్మత్తునకు అసామాన్య విజయము చేకూరింది. "విగ్రహారాధకులను

చంపండి'' అనే కేక లేసుకుంటూ అతడు తిరిగెను. అసంఖ్యాకులు హత్యలపాలైరి. ఈ తిరుగుబాటువల్ల చీనాలో సగముభాగము నాశన మైనది. సుమారు పన్నెండు సంవత్సరముల కాలములో ఈ తిరుగుబాటు కారణముగా రెండుకోట్ల ప్రజలు చనిపోయినట్లు అంచనా వేయబడ్డది. ఈ తిరుగుబాటుకు కాని, దీని ననుసరించివచ్చిన హత్యలకుగాని క్రైస్తవ మిషనరీలను, విదేశ జాతులను బాధ్యులను చేయుట న్యాయముకాదు. మొట్టమొదట మిషనరీలు దీనిని అమోదించినట్లు కనిపించిరి. కొన్నాళ్లు పోయిన పిమ్మట హంగ్‌తో తమకు సంబంధము లేదని వారు చెప్పు కొనిరి. అయినా దీనికి బాధ్యులు క్రైస్తవ మిషనరీలే అని చీనా ప్రభు త్వము, నాడూ నేడూ నమ్మియుండెను. ఆనాటి, తరువాత కాలమునాటి మిషనరీ కార్యములు చీనా ప్రజలెంతగా అసహ్యించుకొనేవారో దీనినిబట్టి మనము గ్రహించవచ్చును. వారి దృష్టిలో మిషనరీ మతప్రచారము కొరకూ, సౌమనస్యభావము వృద్ధిచేయుటకూ రాలేదు. సామ్రాజ్యవాద ప్రచారము చేసే ఏజెంటు అతడు. ఒక ఇంగ్లీషు గ్రంథకర్త చెప్పినట్లు- "మొదట మిషనరీ, అతనివెనుకనే ఫిరంగులుపేల్చు పడవ, పిమ్మట దేశమును వశముచేసుకొనుట-చీనావారి దృష్టిలో ఈ వరుసలో సంఘట నలు సంభవించుచుండెను.'' ఈ విషయమును జ్ఞాపకముంచుకొనుట మంచిది. చీనాకు సంభవించిన కష్ట సందర్భములలో తరుచు మిషనరీ కనిపిస్తూఉంటాడు.

ఒక మతోన్మాది లేవనెత్తిన తిరుగుబాటు ఇంత విజయవంతముగా సాగుట అసాధారణ విషయము. చివరకది అణచివేయబడినది. దీనికి నిజమైన కారణమేమంటే-చీనాలో పాతపద్ధతి విచ్ఛిన్నమగుచున్నది. చీనానుగురించి నేను వ్రాసిన వెనుకటి జాబులో పన్నులు భారముగా ఉండేవనిన్నీ, ఆర్థిక పరిస్థితులు మారుచున్నవనిన్నీ, ప్రజలలో అసం తృప్తి పెరుగుచున్నదనిన్నీ వ్రాసి ఉన్నాను. మంచూ ప్రభుత్వమునకు వ్యతిరేకముగా రహస్య సంఘములు అంతటా తలయెత్తుచుండెను.

తిరుగుబాటు సూచనలు కనిపించుచుండెను. విదేశ వర్తకము, నల్ల మందు వ్యాపారము పరిస్థితులు విషమించుటకు కారణమైనవి. చీనాలో విదేశ వర్తకము గత కాలములో ఉంటూనే ఉండేది. కాని ఇప్పటి పరిస్థితులు వేరు. పశ్చిమ దేశములయందలి మహా యంత్ర పరిశ్రమ కారణముగా అనేక వస్తువులు వేగముగా తయారగుచుండెను. ఆయా దేశములలో వాటికి చెలామణిలేదు. కాబట్టి వారు ఇతరత్రా వ్యాపార రంగములను సంపాదించవలెను. కాన ఇండియా, చీనాలలో వ్యాపార రంగములను సంపాదించవలెనని తహతహ. ఈ వస్తువులున్నూ, నల్ల మందున్నూ పూర్వ వర్తకముయొక్క ఏర్పాట్లను తారుమారు చేసెను. ఆర్థికముగా గందరగోళము హెచ్చయ్యేను. ఇండియాలోవలెనే చీనా బజారులలోకూడ, ప్రపంచ ధరలనుబట్టి సరుకుల ధరలు మారిపోవు చుండెను. ఈ కారణములవల్ల ప్రజలలో అసంతృప్తి. కష్టములు పెరి గెను. తైపింగు తిరుగుబాటుకివి బలమిచ్చెను.

పాశ్చాత్య జాతులు మదాంధులై చీనా వ్యవహారములలో కలుగ జేసికొంటూన్న రోజులలో చీనా పరిస్థితులిట్లుండెను. అందువల్లనే చీనా వారికోరికలు ప్రతిఘటించలేకపోయెను. ఈయూరోపియన్ జాతులున్నూ, తరువాత జపానున్నూ చీనా కష్టములను, గందరగోళమును పురస్క రించుకొని దానినుండి హక్కులనేగాక దేశభాగములనుకూడా బలవంత ముగా తీసికొనుచుండిరి. ఇండియావలెనే చీనాకూడా ఒకటి రెండు పాశ్చాత్య జాతులయొక్కయు, జపాను యొక్కయు సామ్రాజ్యముగా. పరాధీన రాజ్యముగా మారిపోయి ఉండును. కాని ఈ జాతులు స్పర్ధలతో, అసూయలతో మెలగు చుండుటవల్ల అట్లు జరుగలేదు.

19 వశతాబ్దిలో చీనా పరిస్థితులు, ఆర్థికముగా అది చితికిపోవుట, తైపింగు తిరుగుబాటు, మిషనరీలయొక్కయు, పరదేశులయొక్కయు దురుసుతనము—వీటిని గురించి చెప్పుచూ అసలుకథ వదలిపెట్టాను. ఈ విషయములను తెలుసుకొంటేనేగాని ముందు జరుగబోవు విషయ

ములు అర్థముగావు. చరిత్రలో సంఘటనలు వాటి అంతట అవి సంభ వించవు. అవి సంభవించుటకు అనేక విధములగు కారణములుండును. కాని ఈ కారణములు వెల్లడిగా కనుపించవు. కార్యములవెనుక అవి ఒదిగియుండును. మొన్న మొన్నటివరకూ ఎంతో మహత్తర దశలో ఉండి బలవంతులై యుండిన మంచూ పాలకులు తమ అదృష్టము మారుట చూచి ఎంత విభ్రాంతులైనారో! వారి పతనమునకు కారణము వారి గతములోనే ఉన్నదని వారు గ్రహించియుండరు. పాశ్చాత్య దేశములలో జరిగిన పారిశ్రామికాభివృద్ధిని గురించి వారికి తెలియదు. చీనా ఆర్థిక విధానమునకది ఎంత ముప్పుతెచ్చిపెట్టినదీ వారు గ్రహించ లేదు. "అనాగరికుల"గు పరదేశుల రాక వారికి కోపకారణమయ్యెను. విదేశీయుల రాకలనుగురించి ఆనాటి చక్రవర్తి ఒక చక్కని ప్రాచీన చైనీయ గ్రంథోక్తిని వాడి ఉన్నాడు. అతడన్నమాట ఏమనగా—"నా పడక పక్క ఎవరినీ గుర్రుపెట్టనీయను" అని. ప్రాచీన గ్రంథములు హాస్యరసోపేతములై ప్రాజ్ఞత కరవుచుండెను. అవి కష్టకాలములందు స్థైర్యమవలంబించుటకూ, ప్రసన్న విశ్వాస మలవరచుకొనుటకూ పనికి వచ్చినా విదేశీయుల రాకనవి అరికట్టలేక పోయినవి.

నాన్‌కింగ్ సంధి ఫలితముగా బ్రిటను చీనాలోనికి ప్రవేశించుటకు మార్గమేర్పడినది. కాని లాభాలన్నీ బ్రిటను పుడిసిపుచ్చుకో వీలులేక పోయింది. ఫ్రాంసు, సంయుక్త రాష్ట్రములూకూడా రంగములో ప్రవే శించి చీనాతో వ్యాపార సంధులు చేసుకొన్నవి. చీనా ఏమీ చెయ్యలేక పోయింది. బలవంతముగా సంధులు జరుగుటవల్ల విదేశీయుడన్న చీనా వారికి ప్రేమగాని, గౌరవముకాని లేకపోయినవి. ఈ అనాగరికుల పొడ వారి కెంతమాత్రమూ కిట్టడంలేదు. విదేశీయున కయినా సంతుష్టి లేక పోయింది. చీనాను స్వలాభమునకై పీడించవలెననే తృష్ణ అతనిలో పెరిగింది. ఈ విషయములో దారి తీసినవారు బ్రిటిషువారే.

తైపింగ్ తిరుగుబాటులో చీనా చిక్కుకొని ఉండెను. విదేశీయు

లను నిరోధించలేకుండెను. కాన ఇది విదేశీయులకు తగిన అదనుగా ఉండెను. కాబట్టి ఏదో ఒక మిషమీద యుద్ధము ప్రకటించుటకు బ్రిటిషు వారు చూచుచుండిరి. 1856 లో కాంటన్‌లోని చీనా రాజ ప్రతినిధి ఒక ఓడలోని నావికులను, సముద్రముమీద దొంగతనము చేస్తున్నారనే కారణమున పట్టుకొనెను. ఆ ఓడ చీనా వారిదే. అందు విదేశీయులెవరూ లేరు. కాని అది బ్రిటిషు పతాకమును ఎగురవేసెను. అందుకై హాంకాంగ్ ప్రభుత్వము యొక్క అనుమతినది పొందెను. అయినా అప్పటికి అనుమతి ఇచ్చిన గడువుకూడా దాటిపోయెను. ఇట్లా ఉన్నప్పటికీ, తోడేలు మేకపిల్ల కథ వస్తుగా, బ్రిటిషు ప్రభుత్వమునకు చీనాపై యుద్ధము ప్రకటించుటకు సాకు దొరికెను.

ఇంగ్లాండునుండి చీనాకు సైన్యములు పంపబడెను. అప్పుడే ఇండియాలో 1857 లో తిరుగుబాటు సంభవించెను. ఈ సైన్యములన్నీ ఇండియాకు మరలింపబడెను. ఆ తిరుగుబాటును అణచివేయువరకూ చీనా యుద్ధము నిలిచియుండవలసి వచ్చెను. 1858 లో రెండవ చీనా యుద్ధము ప్రారంభమయ్యెను. చీనాలో ఎక్కడో ఒక ఫ్రెంచి మిషనరీ చంపబడ్డాడనే సాకున ఫ్రెంచివారుకూడా యుద్ధములో ప్రవేశించిరి. ఇట్లు బ్రిటిషువారూ, ఫ్రెంచివారూ కలిసి, తైపింగు తిరుగుబాటులో ఊపిరి ఆడక కొట్టుకొనుచున్న చీనావారిమీద విరుచుకుపడిరి. బ్రిటిషు, ఫ్రెంచి ప్రభుత్వములు రష్యాను, సంయుక్త రాష్ట్రములను యుద్ధములో ప్రవేశించమని ప్రోత్సహించిరి. కాని వారు ఒప్పుకోలేదు. కాని కొల్లగొట్టిన ధనమును పంచుకొనుటకుమాత్రము వారు సిద్ధముగానే ఉండిరి. క్రియకు పోరాటము జరుగనేలేదు. ఎక్కువ హక్కులను బలవంతముగా లాగుతూ చేసుకొన్న సంధి పత్రముమీద నాలుగు జాతుల ప్రతినిధులూ చేవ్రాళ్ళు పెట్టిరి. విదేశ వ్యాపారమునకు రేవుపట్టణములు మరికొన్ని అనువుగా చేయబడెను.

కాని రెండవ చీనా యుద్ధగాథ ఇంకా ముగియలేదు. విషాదాంత

మగు వేరొక రంగమింకను ప్రదర్శింపవలసి ఉండెను. సంధులు చేసి కొన్నప్పుడు ఆయా ప్రభుత్వములు వాటిని అంగీకరించి స్థిరపరుచుట ఆచారము. సంవత్సరము లోపున, పెకింగ్‌లో నూతన సంధులు స్థిర పరుచుటకు ఏర్పాటులు జరిగినవి. ఈ గడువు సమీపించినప్పుడు రష్యా నుంచి నాటుదారిని రష్యన్ రాయబారి వచ్చెను. మిగత మూడు జాతుల రాయబారులును సముద్ర మార్గమున వచ్చిరి. పీహోనది మీదుగా పెకింగ్‌కు వారు తమ పడవలతీసుకొని పోగోరిరి. ఆ క్షణమందే పెకింగ్ పట్టణమును, తైపింగు తిరుగుబాటుదార్లు పట్టుకొన చూచుచుండిరి. ఆ నది శత్రువులు రాకుండ దుర్గములతో గట్టి చేయబడినది. కాబట్టి చీనా ప్రభుత్వము బ్రిటిషు, ఫ్రెంచి, అమెరికన్ రాయబారులను, నదిమీద నుండి రావద్దనిన్నీ, ఉత్తరమున నున్న నాటుదారి ద్వారా రావలసిన దనిన్నీ కోరిరి. అది న్యాయమైన కోరికయే. అమెరికను రాయబారి అందుకు అంగీకరించెను. బ్రిటిషు, ఫ్రెంచి రాయబారులు అంగీకరించ రైరి. దుర్గములున్నప్పటికిన్నీ వారు పీహో నదిమీదుగా మోటతనముగా పోవ ప్రయత్నించిరి. చీనావారు వారిపై ఫిరంగులు పేల్చిరి. అధిక నష్టములకు లోనై వారు వెనుకకు పోవలసివచ్చెను. ప్రయాణ మార్గమును మార్చుకొమ్మని చీనా ప్రభుత్వము కోరిన కోరికను వినినైనా వినని అధికార ప్రమత్తులు, దురహంకారులు అగు ప్రభుత్వములు ఈ అవమానము సహించలేక పోయిరి. కసి తీర్చుకొనుటకు సైన్యము లధికముగా పంపబడెను. 1860 లో సైన్యములు ప్రాచీన నగరమగు పెకింగ్ మీదకి నడిచివెళ్ళినవి. ఆ నగరములోని దివ్యమగు భవనము నొకదానిని కొల్లగొట్టి, తగులబెట్టి, నాశముచేసి పగతీర్చుకొనిరి. ఈ భవనము చక్రవర్తి వసంత ప్రాసాదము. చీన్‌లంగ్ రాజ్యకాలమున నది నిర్మింపబడెను. చీనాదేశమున తయారైన అనన్య సాధ్యమగు చిత్ర కళాసాహిత్య నిధులకది నిలయము. మిక్కిలి అందమైన పోత విగ్రహ ములు, అద్భుతావహమగు చక్కని పింగాణీ పాత్రలు, అపూర్వమగు

వ్రాతప్రతులు, చిత్రపటములు, వేయి సంత్సరములుగా చీనాకు కీర్తి తెచ్చిన కళా విలసితమగు విచిత్ర వస్తువులు అందు నిండియుండెను. జ్ఞానగంధములేని, విద్యా విముఖులైన ఆంగ్ల, ఫ్రెంచి సైనికులు మూర్ఖులై ఈ అమూల్య భాగ్యమును కొల్లగొట్టిరి. మంటలలో వాటిని తగులబెట్టిరి. అనేక దినములవరకూ ఈ మంటలు చల్లారలేదు. ఈ విద్యా విముఖత్వమును, దౌష్ట్యమును చూచి, వేయి సంవత్సరముల నుండి విజ్ఞాన పరులైన చైనీయుల మనస్సులు బాధపడ్డాయంటే ఆశ్చర్య మేమిటి? మూర్ఖులగు ఈ వినాశన ప్రియులనుచూచి చంపుట, నాశనము చేయుట మాత్రమే తెలిసిన అనాగరికులని వారు భావించారంటే ఆశ్చర్యమేమిటి? హూణులను, మంగోలులను, పాతకాలమునాటి అనేక అనాగరిక జాతులను వారీసందర్భమున స్మరించియుందురు.

చైనీయు లేమనుకున్నా ఈ విదేశ బర్బరులకు లెక్కలేదు. వారి ఫిరంగి ఓడలలో నూతన యుద్ధపరికరములతో వారుక్షేమముగా ఉన్నారు- అంతే వారికి కావలసినది. అమూల్యమగు, అపూర్వమగు కళాసాహిత్య నిధులు, వందలకొద్ది సంవత్సరములనుండి చైనీయులు కూడబెట్టిన నిధులు నాశనమయినవంటే వారికేమిలెక్క? చైనీయుల కళా సంస్కృతుల లెక్కవారికేమిటి?

"ఏదెట్లయినా
మనకున్నదిగా
మాక్సిం తుపాకి
లేదదివారికి!"

---

## 115

# కష్టములలో నున్న చీనా

డిశంబరు 24, 1932

1860 లో పెకింగ్‌లోని చక్కని వసంత ప్రాసాదమును బ్రిటిషు వారూ, ఫ్రెంచివారూ కలిసి నాశము చేశారని వెనుకటి జాబులో వ్రాసి యుంటిని. తాత్కాలిక యుద్ధ విరమణమును సూచించు జెండా ఎగుర వేసినప్పుడు దానికి వ్యతిరేకముగా చైనీయులు ప్రవర్తించిరన్న నెప ముతో వారిని శిక్షించుటకు ఈ పని వారు చేశారట. కొన్ని చీనా సైన్య ములు ఆ తప్పుచేసి ఉండవచ్చు. అయినా చెయ్యవలెనని చేసిన బ్రిటిషు, ఫ్రెంచి వారి దురాగతములు ఊహకు అందదములేదు. అజ్ఞానులగు కొందరు సైనికుల చేతలు కావివి. అధికారములో ఉన్న ఉద్యోగస్తుల చేతలివి. ఇటువంటి పనులు ఎందుకుచేస్తారో ? ఇంగ్లీషువారూ, ఫ్రెంచి వారూ, నాగరీకులు, సంస్కారులు—నేటి నాగరీకతకు ఒక విధముగా నాయకులు. అయినప్పటికీ, నిత్య జీవితములో ఒరుల కష్టసుఖములు గుర్తెరిగి చక్కగా ప్రవర్తించువారు ఇతరులతో ప్రత్యక్షముగా కల హము సంభవించినప్పుడు తమ నాగరీకతనూ, సద్వర్తనమునూ ఎందుకు మరుస్తారో ? జనుల అన్యోన్య ప్రవర్తనమునకూ, జాతుల అన్యోన్య ప్రవర్తనమునకూ విరోధ భావమున్నట్లు తోస్తుంది. ఒంటెత్తుగుణము మంచిది కాదనిన్నీ, ఒరుల కష్ట సుఖములు కనిపెట్టుచుండవలసిన దనిన్నీ, సత్ప్రవర్తనము కలిగి ఉండవలసినదనిన్నీ చిన్న పిల్లలకు బోధిస్తారు. మన మభ్యసించు విద్యయొక్క లక్ష్యముకూడా ఇంతే. యుద్ధముగానే వస్తే మన మీ విషయాలన్నీ మరుస్తాము. మనలో ఇమిడి ఉన్న పశు ప్రవృత్తి తల యెత్తుతుంది. పెద్ద మనుష్యులు పశువులవలె ప్రవర్తిస్తారు.

ఫ్రెంచి, జర్మను జాతులవంటి సన్నిహిత జాతులు యుద్ధము

నకు తలపడ్డప్పుడు సైతము ఇట్లే సంభవిస్తుంది. భిన్నజాతులు ఢీకొన్న ప్పుడు మరీ శోచనీయముగా ఉంటుంది. యూరోపియనులు ఆసియా, ఆఫ్రికా జాతుల నెదుర్కొన్నప్పుడువలె ఒకరిని గురించి ఒకరికి ఈ భిన్న జాతులవారికి తెలియదు. తెలియనప్పుడు సానుభూతి ఎట్లా ఉంటుంది? ఇట్టి రెండు జాతులకు యుద్ధము తటస్థిస్తే అది వట్టి రాజ కీయ యుద్ధముమాత్రమేకాదు, మరీ శోచనీయమైన జాతియుద్ధముగా కూడా పరిణమిస్తుంది. 1857 లో ఇండియనుల తిరుగుబాటు సందర్భ మున జరిగిన దురాగతములకూ, ఆసియా, ఆఫ్రికా దేశములలో అధికార మత్తులగు యూరోపియన్ జాతుల క్రౌర్యముకూ, కళా సంపదను నాశముచేయు బుద్ధికీ ఇదియే కారణము.

ఇదంతా అజ్ఞాన విలసితముగానూ, శోచనీయముగానూ కనిపిం చును. ఒక జాతిని ఇంకొకజాతిగాని, ఒక తరగతి ప్రజలను ఇంకొక తరగతి ప్రజలుగాని తమ అధికారములో పెట్టుకొన్నప్పుడు అసంతృప్తి, విరోధభావము, తిరుగుబాటు కలుగక మానవు. ఒదిగియున్న వారు తమ్ము పీడించు అధికారులను తొలగించుటకు ప్రయత్నము చేయుదురు. స్వలాభము కొరకు ఒకరు అన్యులను పీడించడమే నేటి మనసంఘము యొక్క కుదురు. దీనినే కాపిటాలిజం (పెట్టుబడిదార్ల పద్ధతి)అంటారు. దీనినుండి సామ్రాజ్యవాదము పుట్టినది.

పంధొమ్మిదో శతాబ్దిలో మహా యంత్రములున్నూ, పారిశ్రామికాభి వృద్ధిన్నీ పడమటి యూరోపియన్ జాతులను, అమెరికా సంయుక్త రాష్ట్రములను ధనవంతులుగాను, బలవంతులుగాను చేసెను. భూమండల మున కంతకూ తామే ప్రభువులనిన్నీ, ఇతర జాతులు తమకన్న హీను లనిన్నీ, అందువల్ల తమకడ్డు రారాదనిన్నీ వారు తలచుటకు ప్రారం భించిరి. ప్రకృతి శక్తులను కొంతమట్టుకు స్వాధీనము చేసికొని వారు దురహంకారులు, మదోన్మత్తులు అయిరి. నాగరీకుడు ప్రకృతి శక్తులను స్వాధీనము చేసికొన్నంతనే చాలదు. ఆత్మనిగ్రహముకూడా అలవరుచుకో

వలెనన్నమాట వారు మరచిరి. అందువల్లనే 19 వ శతాబ్దిలో అభివృద్ధి సాధించిన జాతులు అనాగరీకులికన్న అన్యాయముగా తరుచు ప్రవర్తించుట చూచుచున్నాము. కిందటి శతాబ్దిలోనేకాదు. నేడుకూడా ఆసియా, ఆఫ్రికాలలో యూరోపియన్ జాతులిట్లు ప్రవర్తించుటకు కారణము దీనిని బట్టి నీవు గ్రహించవచ్చును.

యూరోపియన్ జాతులను మనతోనూ, ఇతరులతోను పోల్చి మనము వారికన్న మెరుగు అని నేను చెప్పుతున్నానని భావించకు. అది నా ఉద్దేశముకాదు. మనకు కళంకములు లేకపోలేదు. అందు కొన్ని మరీ చెడ్డవి. లేకుంటే మనమింతగా అధఃపతనమేల కావలెను.

ఇప్పుడు మనము చీనాకు వెడదాము. వసంత ప్రాసాదమును ధ్వంసముచేసి బ్రిటిషువారూ, ఫ్రెంచివారూ తమ బలమును ప్రకటించు కొన్నారు. దీని తరువాత పాత సంధులను బలపరచవలసిందని చీనాను బలవంతపెట్టారు. కొత్తహక్కులను సంపాదించారు. ఈ సంధులకు అనుగుణముగా చీనాప్రభుత్వము విదేశఉద్యోగస్థుల యాజమాన్యమున షాంగ్ హైలో షై నీయుల కస్టమ్సు శాఖను నిర్మించెను. దీనినే "ఇంపీరియల్ మారిటైం కస్టమ్సు"; (సామ్రాజ్య నౌకా వ్యాపార శుల్కశాఖ) అందురు.

చీనా దుర్బలముచేసి, విదేశ జాతులకు అనుకూలములను కల్పించిన తైపింగ్ తిరుగుబాటు ఇంకను జరుగుచునే ఉండెను. చివరకు 1864 లో లీహంగ్ చాంగ్ అనే చీనా గవర్నరు దానిని అణచివేసెను. అతడు చీనాలో ఒక గొప్ప రాజకీయవేత్త అనిపించుకొన్నాడు.

రాక్షసత్వము నాధారముగా చేసుకొని ఇంగ్లాండు ఫ్రాంసులు చీనా నుండి హక్కులను సంపాదించగా ఉత్తరమున రష్యా శాంతి పద్ధతుల నుపయోగించి కృతకృత్య యైనది. కొద్ది సంవత్సరములకు పూర్వమే కాంస్టాంటి నోపుల్ గ్రసించవలెనని రష్యా, యూరోపులోని టర్కీపై బడెను. ఇంగ్లాండు, ఫ్రాంసులు వర్ధమానమగుచున్న రష్యా బలమునకు భయపడి టర్కుల పక్షమును చేరి రష్యాను ఓడించిరి. 1854-56 లో

జరిగిన క్రిమియన్ యుద్ధమిది. పడమట ఓటమి చెంది రష్యా తూర్పుకు తనదృష్టి ప్రసరింప జేసింది. అక్కడ కృతకృత్య అయినది. సముద్రమును చేరి ఈశాన్యదిక్కున ఉన్న ఒక రాష్ట్రమును, వ్లాడివోస్టక్ నగరము—అందున్న నౌకాశ్రయముతోసహా, శాంత పద్ధతులుపయోగించి రష్యా తనకు దత్తము చేయించుకొన్నది. ఇందు రష్యా కృతకృత్య యగుటకు కారకుడు మురాలీఫ్ అనే పేరుగల ప్రతిభావంతుడగు రష్యన్ ఉద్యోగస్థుడు. మూడు సంవత్సరములు యుద్ధము చేసి తెలివితక్కువగా విధ్వంసము చేసి ఇంగ్లాండు, ఫ్రాంసులు సంపాదించిన దానికన్న అధికముగా రష్యా స్నేహభావమును చూపి సంపాదించెను.

1860 సంవత్సరమున పరిస్థితులిట్లుండెను. 18 వ శతాబ్ది అంతమగు సరికి సగము ఆసియాను ఆక్రమించుకొని అధికారము చెలాయిస్తున్న మంచూల చీనా సామ్రాజ్యము నేడు అవమానితమై నీచ స్థితికి వచ్చింది. దూరముగానున్న యూరోపునుంచి వచ్చిన పాశ్చాత్య జాతులు దానిని ఓడించి అవమానపరచిరి. దేశములో తలయెత్తిన తిరుగుబాటు సామ్రాజ్యమును తల్లకిందులు చేసెను. ఈ సందర్భములు చీనాను పూర్తిగా కుదిపివేసెను. పరిస్థితులు చీనాలో సరిగా లేవని స్పష్టముగా తెలుస్తూన్నది. నూతన పరిస్థితులకూ, విదేశ దురాక్రమణకూ అనుగుణముగా దేశమును సంస్కరించుటకు కొంత ప్రయత్నము చేసిరి. కాన 1860 సంవత్సరమును చీనాలోనూ తన శకమునకు ప్రారంభముగా గణించవచ్చును. విదేశ జాతుల నెదుర్కొనుటకు చీనా తయారగుచుండెను. చీనాకు పొరుగుననున్న జపానుకూడా ఇట్టి పనిలోనే నిమగ్నమై ఉండెను. చీనాకది మార్గదర్శి అయ్యెను. చీనాకన్న జపానే అధికముగా కృతకృత్య అయ్యెను. కాని కొంతకాలమువరకూ విదేశ జాతులను చీనా ముందుకు రానియ్యలేదు.

చీనాకు ముఖ్యముగా స్నేహితుడగు బర్లిన్ గేమ్ అను ఒక అమెరికన్ యొక్క నాయకత్వమున ఒక చైనీయుల రాయబారము "సంధి

చేసుకొనే జాతుల" (Treaty Powers) కడకు పంపబడెను. అతడు చీనాకు అనుకూలముగా సంధి షరతులు నిర్ణయించగలిగెను. 1868 లో ఒక చీనా–అమెరికన్ సంధి జరిగెను. ఇందు చీనావారు అమెరికనులకు ఉపకారము చేయవలెననే బుద్ధితో చీనా కార్మికులను సంయుక్త రాష్ట్రములకు కూలికి పంపుటకు ఒప్పుకొనిరి. అప్పుడు సంయుక్త రాష్ట్రముల వారు పడమటి పసిఫిక్ రాష్ట్రములను, ముఖ్యముగా కాలిఫోర్నియాను, వృద్ధి పరుచుకొనుచుండిరి. అక్కడ కార్మికులు తక్కువుగా ఉండిరి. కాన వారు చీనా కార్మికులను తెచ్చుకొనిరి. కాని దీనివల్ల క్రొత్తచిక్కులు తటస్థించినవి. చౌక కూలి తీసుకొను చైనీయుల రాక అమెరికనులకు ఇష్టముగాలేదు. అందుచే రెండు ప్రభుత్వములకును మధ్య వైషమ్య ములు పుట్టెను. తరువాత సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము చీనానుండి కూలీలను తెచ్చుకొనుట మానిరి. ఈ అవమానమును చైనీయులు భరించక అమెరికన్ వస్తువులను బహిష్కరించిరి. ఇది ఒక పెద్ద గాథ. ఇది మనలను 20 వ శతాబ్దిలోనికి తీసుకొనిపోవును. ఈ కథలోకి మనము దిగ నవసరములేదు.

తైపింగు తిరుగుబాటు అణచివేయుటతోడనే వేరొక తిరుగుబాటు మంచూలకు వ్యతిరేకముగా తలయెత్తెను. ఇది చీనా దేశములో జరుగ లేదు. పడమర ఆసియా కేంద్రమగు టర్కీ స్థానములో జరిగెను. ఇందు ముఖ్యముగా నివసించువారు ముస్లిములు. 1863 లో యాకూబ్ బేగ్ నాయకత్వమున ముస్లిము తెగలు లేచి చీనా అధికారులను దేశము నుండి తరుమగొట్టిరి. రెండు కారణములవల్ల ఈ స్థానిక తిరుగుబాటు మనము గమనించదగ్గది. ఈ అదును చూచి రష్యా చీనాకు చెందిన కొంత భూభాగమును వశముచేసికొనెను. చీనా కష్టములలో ఉన్నప్పుడు యూరోపియన్ జాతులు ఈ విధముగా చేయుట పరిపాటి అయినది. కాని ఆశ్చర్యమేమంటే తన భూమి రష్యా వశమగుటకు చీనా అంగీక రించలేదు సరిగదా వశముచేసుకొన్న భూమిని రష్యా తిరిగి కక్కునట్లు

అది చేసినది. ఒక చీనా సేనాని, చోచుంగ్ టాంగ్ అనువాడు, యాకూబ్ బేగ్‌మీదికి, మధ్య ఆసియాలోనికి నడిపించిన ఒక అసాధారణ దండ యాత్ర వల్ల ఇట్లు జరిగినది. ఈ సేనాని బహుజాప్యముగా ప్రవర్తించెను. అతడు మెల్లగా సేనలను నడిపించుకొని పోయెను. అతడు తిరుగు బాటు దారులను కలుసుకొను నప్పటికి సంవత్సరములు గడిచిపోయినవి. రెండు మారులతడు సేనలను త్రోవలో నిలిపివేసెను. ధాన్యపు పంట పండించి కోసుకొన్న తరువాత మరల నడిపించెను. సేనలకు కావలసిన ఆహారమునిట్లాతడు ఏర్పరచెను. సేనలకు ఆహార పదార్థముల నంద చేయుట ఎప్పటికిని కష్టమైన కార్యమే. గోబీ ఎడారి దాటవలసి వచ్చి నప్పుడు ఈ పని ఎంత కష్టతరమో ఊహించవచ్చును. చో సేనాని ఈ కార్యమును కొత్త విధముగా నిర్వహించెను. తరువాత అతడు యాకూబ్ బేగ్‌ను ఓడించి తిరుగుబాటును అణచివేసెను. కాష్‌గర్, టర్ఫాన్, యార్కండ్ మున్నగు చోట్ల అతడు నడపిన యుద్ధము రణదృష్టిని చూచిన అద్భుత మైనదని చెప్పుదురు.

మధ్య ఆసియాలో రష్యాతో పరిష్కారమును తృప్తికరముగా చేసిన పిమ్మట, చీనా ప్రభుత్వము విశాలమైనట్టిన్నీ, శిథిలమగుచున్న ట్టిన్నీ వారి సామ్రాజ్యములో వేరొక తట్టున ఒక కష్టమును ఎదుర్కొన వలసివచ్చెను. ఈ ప్రదేశము అన్నాం. ఇది చీనాకు సామంత రాజ్యము. ఫ్రెంచివారు దానిపై కన్నువేసిరి. చీనా, ఫ్రాంసులకు పోరాటము జరి గెను. అందరికిని ఆశ్చర్యము కలుగునట్లు చీనా ప్రవర్తించెను. ఫ్రాంసు కది లొంగలేదు. 1885 లో తృప్తికరమైన సంధి జరిగెను.

చీనా చూపుచున్న నూతన శక్తిని సామ్రాజ్య వాద జాతులు గుర్తించినవి. 1860 లోనూ, తత్పూర్వ కాలమునందూ చీనా చూపిన దుర్బలత్వమును పోగొట్టుకొని చీనా శక్తి పోసుకొంటూన్నట్లు కనిపించెను. చీనా మారినదనీ, కష్టదశ దాటినదనీ పలువురు తలచిరి. ఇందు వల్లనే 1886లో బర్మాను స్వాధీనము చేసుకొంటూన్నప్పుడు ఇంగ్లాండు

పది సంవత్సరముల కొకమారు చీనాకు మామూలుగా చెల్లించు కప్ప మును చెల్లిండానికి వప్పుకొంది.

కాని చీనాకు కష్టదశ ఇంకా గడవలేదు. ఇంకా అవమానములు, బాధలు, భంగపాట్లు చీనా అనుభవించవలసి ఉండెను. సైన్యములు, నౌకాదళములు దుర్బలముగా ఉండడమేకాదు చీనా జబ్బు. అంతకన్న లోతైన కారణములున్నవి. దాని ఆర్థిక, సాంఘిక నిర్మాణము శిథిలమై పోవుచుండెను. 19 వ శతాబ్దిలో మంచూలకు వ్యతిరేకముగా అనేక రహస్య సంఘములు పనిచేస్తూ ఉండెడివని నేను చెప్పియుంటిని. విదేశ వ్యాపారమున్నూ, పారిశ్రామిక దేశముల సంసర్గవల్ల కలిగిన ఫలితము లున్నూ చీనాను మరీ పాడు స్థితిలోనికి తెచ్చినవి. 1860 తరువాత దానికి వచ్చినట్లు కనబడిన శక్తి నిజమైన శక్తి కాదు. సమర్థులగు ఉద్యోగస్థులు కొందరు, అందు ముఖ్యముగా పేరొక్కన దగ్గవాడు లీహుంగ్ చాంగ్, కొన్ని సంస్కరణములను తెచ్చిపెట్టిరి. చీనా దుర్బలత్వమునకు కారణమైన జబ్బు నివి కుదర్చలేదు. అసలు కారణము నివి తొలగించలేదు.

ఈ కాలములో చీనా శక్తివంతముగా పనిచేయుటకు ముఖ్య కారణము సమర్థురాలగు రాణీ ఒకతె చీనాను పాలించుట. ఆమె చూ-సీ అను చక్రవర్తిని. గతించిన చక్రవర్తి భార్య. నామకః చక్రవర్తి ఆమె కొడుకు. అతడు పసిబాలుడు. అధికారము సంక్రమించు సరికి ఆమె వయస్సు 26 ఏండ్లు. 47 సంవత్సరములపాటు ఆమె చీనాను సమర్థతతో పాలించెను. సమర్థులగు ఉద్యోగస్థులను నియమించెను. తనవలెనే వారునూ ధైర్యముతో పనిచేయునట్లుచేసెను. ఇందువల్లనే చీనా అప్పుడు శక్తివంతముగా పనిచేసినది.

ఈ కాలమున, సముద్రముల కావల జపాను అద్భుత కార్యములు చేయుచుండెను. పోల్చుకొనుటకు వీలులేనట్లు మారిపోవుచుండెను. కాన మనమిప్పుడు జపాను వెడదాము.

116

# త్వరితగతిని జపాను ముందుకు పోవుట

డిశంబరు 27, 1932

జపానునుగురించి నీకు వ్రాసి చాలాకాలమైనది. 5 నెలల క్రితము (81 జాబులో) జపాను 17 వ శతాబ్దిలో తన గూడులో ముడిచిపెట్టుకు కూర్చుండెనని చెప్పియుంటిని. 1641 మొదలుకొని 200 సంవత్సరములపాటు జపాను ప్రపంచముతో ఎట్టి సంబంధమూ పెట్టుకొనకుండా ఉండెను. ఈ కాలములో జరిగిన కొన్ని ముఖ్య విషయములను గురించి నీకు వ్రాసివుంటిని. కాని ఏకాంతవాసము చేయుచున్న ఈ జపాను జాతి చెవిని అవి పడలేదు. జపానులోని పాత ప్రపంచపు ఫ్యూడల్ వాతావరణమును మార్చుటకు బాహ్య ప్రపంచ విశేషములేమీ దానికి చేరలేదు. కాలమే తనగతి నాపుకొన్నట్లు కనిపించినది. మార్పు స్తంభించినట్లు కనిపించినది. 17 శతాబ్ది మధ్య భాగము అచట బంధించబడ్డట్లు కనిపించినది. ఎందుకంటే కాలము గడచిపోతూన్నప్పటికీ దేశము మాత్రమట్లే ఉండెను. అది ఫ్యూడల్ జపాను. భూస్వాముల చేతులలో అధికారముండెను. చక్రవర్తికి ఉన్న అధికారము బహుకొద్ది. నిజమగు పాలకుడు షోగన్. ఇతడొక గొప్ప జాతికి (Clan) అధిపతి. ఇండియాలో క్షత్రియులవలెనే జపానులో సమూరై అను పేరుగల వీరజాతి ఉండెను. తరుచు భిన్న ప్రభువులునూ, భిన్న తెగలునూ తమలో తాము కలహించుచుండిరి. కాని వారందరును చేరి రైతులను, ఇతరులను స్వలాభమునకై పీడించుచుండిరి.

అయినా జపాను శాంతముగా ఉండెను. దేశమును పీల్చి పిప్పి చేసిన అంతఃకలహముల తరువాత ఈ శాంతి వాంఛింపతగినదే అయినది. యుద్ధశీలులగు డైమ్యోలనే ప్రభువులు అణచివేయబడిరి. క్రమేణా అంతఃకలహములవల్ల ధ్వంసమైన జాపాను తేరుకొనజొచ్చెను. ప్రజల

జపాను అభివృద్ధి

రష్యా
మంచూరియా
మంగోలియా
సఖాలిన్
వ్లాడివాస్టక్
కొరియా
జపాను
రేవుపట్టణము ఆర్థర్
పెకింగ్
పచ్చనది
నాన్‌కింగ్
యాంగ్‌చే
షాంగ్‌హై
చీనా
కాన్టన్
ఫార్మోసా

1895 లో చీనాతోనూ, 1905 లో రష్యాతోనూ యుద్ధములైన పిమ్మట జపాను కలుపుకొన్న దేశములు

మనస్సులు, పరిశ్రమలు, చిత్రకళ, సాహిత్యము, మతములపై లగ్న మయ్యెను. క్రైస్తవము అణచివేయబడెను. బౌద్ధము పునరుద్ధరింప బడెను. కొంతకాలమైన పిమ్మట షింటో మతము పునరుజ్జీవితమయ్యెను. అది పితృదేవతల నారాధించు మతము. చీనా దేశమునందు జనించిన కంఫ్యూసియస్ అను తత్వజ్ఞాని ఉపదేశములు సదాచారమునకూ, నీతికీ ఆదర్శ ప్రాయములయ్యెను. రాజాస్థానమునందును, ప్రభువులలోను లలితకళ విజృంభించెను. కొన్ని విధములుగా జపాను మధ్య యుగములలోని యూరోపును పోలియుండెను.

మార్పు రాకుండ ఆటంకపరుచుట సులభముకాదు. బాహ్య ప్రపంచ సంసర్గ లేకుండా చేసుకొన్నప్పటికీ జపానుకు లోపలనే మార్పు రా జొచ్చెను. అయితే అది చాలా మెల్లగా వచ్చెను. ఇతర దేశములలో వలెనే ఫ్యూడల్ విధానము ఆర్థిక విచ్ఛిత్తికి దారితీసెను. అసంతుష్టి పెరిగెను. అధికారములో నుండుటచే దీనికి బాధ్యత షోగన్ నెత్తి మీద పడెను. షింటో ఆరాధన పెరుగజొచ్చెను. చక్రవర్తి సూర్య సంతతిలోని వాడని ప్రజలనమ్మకము. అందుచే అతడే తమకు దిక్కని ప్రజలు భావించదొడగిరి. అసంతుష్టితో ఉన్న ప్రజలలో జాతీయభావము ఇట్లు పెరిగెను. ఆర్థిక విచ్ఛిత్తినిబట్టి వచ్చిన ఈ జాతీయ భావము జపానులో మార్పును కలిగించి తీరును. జపానుతో బాహ్య ప్రపంచ సంసర్గ కలిగించి తీరును.

విదేశ జాతులు ఏకాంత వాసమునుండి జపానును బయటికి రప్పించుటకు చాలా ప్రయత్నములు చేసిరి కాని లాభించలేదు. 19 వ శతాబ్ది మధ్యలో అమెరికా సంయుక్త రాష్ట్రములు ఈ పనికి ముఖ్యముగా పూనుకొనిరి. సంయుక్త రాష్ట్రములు కాలిఫోర్నియావరకు వ్యాపించెను. శాంఫ్రాంసిస్కో ముఖ్య రేవుపట్టణమగుచున్నది. నూతనముగా ప్రారంభింపబడిన చీనాతో వర్తకము లాభదాయకముగా కనిపిస్తున్నది. కాని పసిఫిక్ మహాసముద్రముగుండా ప్రయాణము దీర్ఘమైనది. కాన ఒక

జపాను రేవుపట్టణమువద్ద వారు మజిలీచేసి కావలసిన ఆహారాదులను పడవల కెక్కించుకోవలెనని వారు కోరిరి. జపానును ప్రపంచముతో సంసర్గ పెట్టుకొనుటకది చేసిన ప్రయత్నములకిది కారణము.

1853 లో అమెరికన్ నౌకాదళము జపానుకు వచ్చెను. అమెరికన్ అధ్యక్షుని వద్దనుంచి అది ఒక జాబు తెచ్చెను. జపానులో కనిపించిన మొదటి పొగయోడలివియే. ఒక సంవత్సరమైన పిమ్మట రెండు రేవు పట్టణములలో విదేశ వర్తకులు దిగుటకై షోగన్ అనుమతి ఇచ్చెను. ఇది విని బ్రిటిషువారు, రష్యనులు, డచ్చివారు వెంటనేవచ్చి అట్టి విధముగానే షోగన్‌తో సంధులు చేసికొనిరి. ఇట్లు 213 సంవత్సరముల తరువాత జపానుకు ప్రపంచముతో సంబంధముకలిగెను.

కాని ముందు ముందు చిక్కులు రానున్నవి. విదేశ జాతుల ముందు షోగన్, చక్రవర్తివలెనటించాడు. అతనికి పలుకుబడిపోయింది. అతనికిని, అతడు విదేశీయులతో చేసిన సంధులకును వ్యతిరేకముగా ఒక గొప్ప ఆందోళన బయలుదేరెను. కొందరు విదేశీయులుకూడా చంపబడిరి. దీనికి ఫలితముగా విదేశీయుల నౌకాదళముతో ముట్టడి చేసిరి. నానాటికీ పరిస్థితులు విషమించెను. చివరకు, 1867 లో షోగన్ తన పదవిని వదులుకొనుటకు అంగీకరించాడు. ఇట్లు 1603 లో ఇయేయాసుతో ప్రారంభమైన టోకుగావా షోగనేటు అంతమయ్యెను. అంతేకాదు 700 సంవత్సరముల కాలముపాటు నిలిచిన షోగనేటు విధానమంతాకూడా అంతరించెను.

నూతన చక్రవర్తికి పరిపాలన చేజిక్కెను. అతని వయస్సు 14 సంవత్సరములు మాత్రమే. మట్సుహిటో చక్రవర్తి అనే పేరుతో అతడు సింహాసన మెక్కెను. 45 సంవత్సరముల కాలము 1867 నుండి 1912 వరకూ అతడు రాజ్యము చేసెను. ఈ కాలమునకు మైజీ (విజ్ఞాన ప్రదమగు) యుగమనిపేరు. ఈతని రాజ్యకాలమందే జపాను, పాశ్చాత్య జాతులననుకరిస్తూ వారితో సరిసమానమయేటట్లుగా ముందుకు అభివృద్ధి

చెందుతూ పోయింది. ఒక్క తరములో వచ్చిన గొప్ప మార్పు అసాధారణమైనది. చరిత్రలో ఎన్నడూ ఇట్లు జరిగియుండలేదు. జపాను ఒక గొప్ప పారిశ్రామిక దేశమయ్యెను. పాశ్చాత్య జాతులవలెనే అదిన్నీ సామ్రాజ్యవాద జాతి, కొల్లగొట్టే జాతి అయినది. అభివృద్ధిని సూచించు బాహ్య చిహ్నములన్నియు దానికుండెను. పరిశ్రమల విషయమున తన గురువులనది మించిపోయెను. దాని జనసంఖ్య వేగముగా వృద్ధి అయ్యెను. దాని నావలు భూమిని చుట్టివచ్చుచుండెను. అది ఒక గొప్ప జాతి అయ్యెను. అంతర్జాతీయ వ్యవహారములలో దానిమాటకు గౌరవముండెను. అయినా ఈ గొప్ప పరివర్తనము జాతియొక్క హృదయమునకు అధికముగా పరివర్తన తేలేదు. పరివర్తన బాహ్యముగానే జరిగిందనిన్నీ చెప్ప వీలులేదు. కొంతవరకు లోతుకుపోయింది. కాని పాలకులకు ఫ్యూడల్ దృక్పథమే ఉండెను. మూల ముట్టుగా చేసే సంస్కరణములకూ ఈ ఫ్యూడల్ డొక్కకూ వారు ముడిపెట్ట చూచారు. కొంతవరకు కృతకృత్యులైనారనే చెప్పవలెను.

జపానులో కలిగిన ఈ గొప్ప మార్పులకు కారకులు—ప్రభువర్గమునకు చెందిన "ఎల్డర్ స్టేట్సుమెన్" (వృద్ధ రాజకీయవేత్తలు) అను వారు. వీరు ముందు దృష్టి కలవారు. జపానులో విదేశీయులకు వ్యతిరేకముగా అల్లరులు జరిగినప్పుడు విదేశ యుద్ధనావలు ఫిరంగులు పేల్చి, రేవు పట్టణములు ముట్టడించెను. అప్పుడు జపాను వారేమియు చేయలేకపోయిరి. పొందిన అవమానమును వారు దిగమ్రావవలసివచ్చెను. తమ కర్మమట్లా ఉన్నదని అనుకొని జుట్టు పీకుకొనుటకు బదులు వారు తమకు కలిగిన పరాజయమును, అవమానమును పురస్కరించుకొని ముందు జాగ్రత్తపడిరి. వృద్ధరాజకీయ వేత్తలు ఒక ప్రణాళిక నేర్పరచి దాని ప్రకారము ముందు కార్యమును సాగించిరి.

పాత ఫ్యూడల్ డైమ్యోలు రద్దు చేయబడెను. చక్రవర్తి రాజధాని కాయెటోనుండి యేడోకు మార్చబడెను. దానికే ఇప్పుడు టోకియో

అనే పేరు వచ్చినది. ఒక కొత్త రాజ్యాంగము ప్రవేశపెట్టబడెను. అందు రెండు పార్లమెంటులుండును. క్రిందపార్లమెంటులోని సభ్యులు ఎన్నుకోబడుదురు. పైపార్లమెంటులోని సభ్యులు నియమితులు (Nominated). విద్యా విషయములలో, చట్టములలో, పరిశ్రమలలో, ప్రతి దానిలోనూ మార్పులు వచ్చెను. ఫ్యాక్టరీలు తలయెత్తెను. కొత్త పద్ధతులమీద సైన్యము, నౌకాదళము ఏర్పరచబడెను. విదేశములనుండి ఆయా విషయములలో ప్రవీణులగు వారిని తీసుకొనివచ్చిరి. జపాను విద్యార్థులు యూరోపుకు, అమెరికాకు, బారిష్టరు మున్నగు పరీక్షలు ప్యాసగుటకు వెళ్ళిన భారతీయ విద్యార్థులవలెగాక, విజ్ఞాన శాస్త్ర మభ్యసించుటకూ, సాంకేతిక విద్యలలో ప్రావీణ్యము సంపాదించుటకూ పంపబడిరి.

చక్రవర్తి పేరున, వృద్ధరాజకీయ వేత్తలు ఈ పనులన్నీ చేసిరి. పార్లమెంటు మున్నగునవి ఉన్నప్పటికినీ శాసనము ప్రకారము చక్రవర్తి జపాను సామ్రాజ్యమంతకూ అఖండైకాధిపతిగానే ఉండెను. సంస్కరణములు ప్రవేశపెట్టడమే కాకుండా చక్రవర్తిని ఆరాధించవలెననే పద్ధతికూడా వారు వ్యాపింపజేశారు. ఇది ఒక వింత సమ్మేళనము. ఒకవంక ఫ్యాక్టరీలు, నవీనపరిశ్రమలు, పార్లమెంటరీ ప్రభుత్వచిహ్నాలు; వేరొకవంక మధ్యయుగములకు సంబంధించిన దేవతాంశ సంభూతుడని చక్రవర్తిని ఆరాధించుట. కొద్దికాలము పాటైనా ఈ జంట ఈ విధముగా నిలవడం కష్టముకాదా అనిపిస్తుంది. కాని అవి నిలిచి సాగిపోయాయి. నేడుకూడా అవి విడిపోలేదు. చక్రవర్తి పై ప్రజలకు గల గౌరవ భావమును వృద్ధరాజకీయ వేత్తలు రెండు విధములుగా వినియోగించుకొన్నారు. ఫ్యూడల్ తరగతుల వారిచేతను, సాంప్రదాయకులచేతను వారు బలవంతాన సంస్కరణములు అంగీకరింపచేసిరి. చక్రవర్తిపై గల గౌరవం కొద్దీ వారు ఊరుకొన్నారుగాని లేకుంటే సంస్కరణములను వారు విరోధించేవారే. ఇక రెండవవిధము-ఫ్యూడల్ విధమును పూర్తిగా వదల్చుకొని ముందుకు త్వరగా సాగిపోగోరేవారిని వెనుకపట్టియుంచిరి.

పందొమ్మిదో శతాబ్ది చివర సగ భాగమునందు జపాను, చీనాలకు వ్యత్యాసము అధికముగా నుండెను. అతి త్వరితగతిని జపాను పాశ్చాత్య పద్ధతుల నవలంబించెను. చీనా అసాధారణ కష్టములలో తగుల్కొన్నట్లు ఇదివరకు చూచితిమి; ఇకముందును చూడగలము. ఇది ఇట్లు సంభవించుటకు కారణమేమి? చీనా మహత్తరమగు దేశమగుటయునూ, బ్రహ్మాండమగు దాని జనసంఖ్యయును, వైశాల్యమును కారణముగా మార్పులుకలుగుట కష్టమైనది. బ్రహ్మాండమగు దేశ వైశాల్యమూ, జనసంఖ్యా పైకి బలకారణములుగా కనిపించినా ఇండియాకూడా వీటి వల్లనే కష్టముల పాలైనది. చీనా ప్రభుత్వమున్నూ తగినంతగా కేంద్రీకృతము కాలేదు—అనగా దేశమందలి ప్రతియొక్క భాగమున్నూ స్వపరిపాలన చేసుకొనుచుండెను. అందువల్లనే, జపానులోవలె కేంద్ర ప్రభుత్వము కలుగజేసికొని పెద్ద మార్పులు కలిగించుటకు సాధ్యముకాలేదు. మరిన్నీ, కొన్నివేల సంవత్సరములనుండి చీనా నాగరీకత వృద్ధి చెందింది. ప్రజా జీవితముతో అది పెనవేసుకు పోయింది. దానిని కాదనడం సులభముకాదు. ఈ విషయములోకూడా ఇండియా చీనాను పోలి ఉన్నది. జపాను అన్ననో చీనా నాగరీకతను తెచ్చిపెట్టుకొన్నది. కాబట్టి దానిని కాదని వేరొక నాగరీకతను సులభముగా అది గ్రహించవచ్చును. యూరోపియన్ జాతులు ఉండుండియు చీనా వ్యవహారములలో కలుగజేసికొనడముకూడ చీనా కష్టములకు కారణమైనది. చీనా ఒక మహా ఖండమునకు సంబంధించిన దేశము. జపాను ద్వీపమువలె అది ప్రపంచముతో సంబంధము లేకుండా ముడిచిపెట్టుకు ఉండలేదు. ఉత్తరమునా, వాయవ్యమునా చీనా దేశమును రష్యా తాకుచుండెను. నైరుతి దిక్కున బ్రిటిషు సామ్రాజ్యమును తాకుచుండెను. దక్షిణమున ఫ్రాంసు దాని సమీపమునకు వచ్చుచుండెను. ఈ యూరోపియన్ జాతులు ముఖ్యమగు హక్కులను కొన్నింటిని బలవంతముగా పుచ్చుకొనెను. వ్యాపారమును పురస్కరించుకొని అమిత ధనమునచ్చట పెట్టుబడులు

పెట్టెను. ఈ కారణముల వారు తరుచు చీనా వ్యవహారములలో జోక్యము కలిగించుకో సాగు చిక్కినది.

ఈ విధముగా జపాను ముందుకు పోయింది. దిక్కుతోచక చీనా కొట్టుకొంటోంది. నూతన పరిస్థితులకు సరిపుచ్చుకోవానికి ప్రయత్నములు చేస్తోంది. కాని లాభించడంలేదు. గమనించవలసిన వింత విషయము వేరొకటి ఉన్నది. పాశ్చాత్యుల యంత్రములను, పరిశ్రమలను జపాను అవలంబించినది. నూతన సైన్య నివహములనూ, నౌకాదళములనూ పెట్టుకొన్నది. అభివృద్ధి నందిన పారిశ్రామిక జాతి వలె వేషము వేసినది. కాని యూరోపులో ప్రవేశించిన నూతన భావములను అది అంత ఆత్రుతతో స్వీకరించలేదు. వ్యక్తి స్వాతంత్ర్యము, సంఘ స్వాతంత్ర్యమునకు సంబంధించిన అభిప్రాయములనది స్వీకరించలేదు. జీవితమునూ, సంఘమునూ శాస్త్రరీత్యా చూడడమది అలవరచుకోలేదు. దానికి ఫ్యూడల్ బుద్ధి ఇంకా పోలేదు. అధికార తత్వాన్ని వదులుకోలేదు. ప్రపంచమంతా చిరకాలమునకు ముందే వదిలిపెట్టిన చక్రవర్తి–ఆరాధన అది చేస్తూనే ఉన్నది. ఆత్మత్యాగమునకు జంకని జపానువారి దేశభక్తికి వారి స్వామిభక్తి సరితూగుతూ ఉన్నది. రాజు దైవమనే భావన జాతీయతతోపాటు కలిసి వెళ్లుతోంది. ఇక చీనా సంగతిచూస్తే– అది యంత్రములను, పరిశ్రమలనూ అవలంబించలేదు. కాని నేటి చీనా వారు పాశ్చాత్య భావములనూ, శాస్త్రదృష్టినీ స్వీకరించిరి. తమ భావములకునూ, వీటికినీ అట్టే తేడా లేదు. దీనినిబట్టి చీనా, పాశ్చాత్య నాగరీక పరమార్థమును గ్రహించినట్లు స్పష్టపడుచున్నది. జపాను బాహ్య కవచమును మాత్రము ధరించి, పరమార్థమును ఉపేక్షించి చీనాను దాటిపోయింది. యూరోప్ప దేశమంతా జపానును పొగిడింది. కారణము కవచాన్ని ధరించి అది బలము సంపాదించుకొన్నది కాబట్టి దానితో స్నేహము సంపాదించింది. కాని చీనా దుర్బలముగానేఉన్నది. దానికి మాక్సిం తుపాకి మున్నగునవి లేవు. కాబట్టి పాశ్చాత్యులు దానిని

అవమాన పరిచిరి. దానికి హితబోధలు చేసిరి. దానిని స్వోపయోగము నకై పీడించిరి. దాని భావములను వారు లక్షించలేదు.

పారిశ్రామిక పద్ధతులలోనేకాదు జపాను యూరోపును అనుసరి స్త. సామ్రాజ్యవాద సిద్ధాంతముల ననుసరించి అన్య దేశములమీద పడడం కూడా నేర్చుకొంది. యూరోపియన్ జాతులకు జపాను మంచి శిష్యుడవడమేకాదు. తరుచు గురువునుకూడా మించింది. దానికున్న అసలు కష్టమేమిటంటే—నూతన పారిశ్రామిక విధానానికీ, పాత ఫ్యూడల్ పద్ధతికీ పొందిక లేకపోవడం. రెండు విధానాలనూ ఒకేమారు నడిపించ డానికి ప్రయత్నాలు చేసింది. కాని ఆర్థిక పరిస్థితులలో హెచ్చుతగ్గులు లేకుండా చేయ్యలేకపోయింది. పన్నులు హెచ్చుగా ఉండడంవల్ల ప్రజలు సణుగుకొంటూ ఉండిరి. ఇంటివద్ద అల్లరులు రేగకుండా పాతపద్ధతి నొకటి అది అవలంబించింది. అది సామ్రాజ్యమును వృద్ధిచేయు కార్య ముల వల్లా, యుద్ధమువల్లా ప్రజల మనస్సులు అన్యథావర్తించునట్లు చేయుట. అది నూతన పరిశ్రమలు స్థాపించింది. కాబట్టి అందుకై కావలసిన ముడి సరుకులకొరకూ, మార్కెట్టులకొరకూ ఇతర దేశము లను వెదుకుకోవలసి వచ్చింది. పారిశ్రామిక విప్లవము జరిగినప్పుడు ఇంగ్లాండూ, తరువాత కొంత కాలానికి పాశ్చాత్య జాతులూ ఈ విధం గానేకదా ఇతర దేశములను వెదకుకొని జయించవలసి వచ్చింది? జపా నులో ఉత్పత్తి పెరిగింది. జనసంఖ్య వేగముగా పెరిగింది. ఆహార పదార్థములూ, ముడి పదార్థములూ కావలసివచ్చినవి. దాని కవి ఎక్కడ దొరుకుతవి? దానికి పొరుగున ఉన్న దేశములు చీనా, కొరియాలు. చీనాతో వ్యాపారము జేయుడముకు అవకాశములున్నవి. కాని జనసంకీర్ణ మగు దేశమది. చీనా సామ్రాజ్యము నందలి ఈశాన్య రాష్ట్రములే మంచూరియా అయినవి. అచ్చట కావలసినంత కాళీస్థలమున్నది. వలసలు స్థాపించుటకు, వృద్ధి చేయుటకూ సావకాశములున్నవి. కాబట్టి కొరియా, మంచూరియాలను కబళించవలెనని వాటిపై జపాను కన్ను వేసింది.

చీనావద్దనుంచి అనేక విధములగు హక్కులనే కాకుండా దేశ భాగములనుకూడ పొందవలెనని యత్నిస్తూన్న పాశ్చాత్య జాతులను జపాను కనిపెట్టింది. వారి పోకడలు దానికిష్టముగాలేవు. తన దేశమున కెదురుగాఉన్న దేశములో ఈ జాతులు సుస్థిరులైనట్లయితే తన క్షేమము నకే భంగకరము. తాను ఆసియా ఖండములో వ్యాపించి వృద్ధిచెందుట కాటంకముగా ఉండును.

ప్రపంచముతో సంబంధము పెట్టుకొని 20 సంవత్సరములు కాక ముందే జపాను చీనాపై బడుటకు ప్రారంభించెను. చేపలు పట్టు పల్లె వారి పడవ భగ్నముకాగా వారిలో తగుపులుపుట్టాయి. కొందరు హత్య చేయబడ్డారు. ఇది సాకుగా పెట్టుకొని జపాను చీనానుండి పరిహారము కోరింది. చీనా మొదట నిరాకరించింది. కాని ఆ సమయమున చీనా అన్నాంలోని ఫ్రెంచివారితో తగవులాడుతోంది. జపాను యుద్ధము ప్రకటిస్తానన్నది. అందువల్ల జపానుకు చీనా లొంగిపోయింది. ఇది 1874 లో జరిగెను. ఈ విజయము జపానుకు ధైర్యమునిచ్చింది. వెంటనే అది కొత్తవిజయములు సాధించడానికి పూనుకొన్నది. కొరియా ద్వరలో చిక్కేటట్లు కనిపించింది. జపాను దానితో గిల్లి కజ్జా తెచ్చు కొంది. దానిమీదకు సేనలను పంపింది. కొంత ధనము దానివద్దనుండి బలవంతముగా తీసుకొంది. జపాను వర్తకానికి కొన్ని రేవుపట్టణాలు తెరిపించింది.

కొరియా చాలాకాలంనుంచి చీనాయొక్క సామంతరాజ్యము. చీనా తనకు సహాయం చేస్తుందేమోనని చూచింది. కాని చీనా సహాయం చెయ్యలేకపోయింది. జపాను ఎక్కువపలుకుబడి సంపాదిస్తుందేమోనని చీనా ప్రభుత్వము భయపడి, అప్పటిమట్టుకు తలయొగ్గి ఉండవలసిం దనిన్నీ, జపానును అరికట్టడానికి పాశ్చాత్య జాతులతో సంధులు చేసుకో మనిన్నీ కొరియాకు సలహా ఇచ్చింది. ఈ విధముగా 1882 లో కొరియా ప్రపంచజాతులకు కార్యరంగమైనది. దీనితో జపాను సంతుష్టిపొంది

ఉండదలుచుకోలేదు. చీనా కష్టములలో ఉన్న సంగతి కనిపెట్టి, కొరియా సంగతి మళ్ళీ ఎత్తి, జపాను, చీనాలు ఉమ్మడిగా కొరియాను రక్షించే టట్లు సమ్మతింపజేసింది. అనగా పాపము కొరియా, చీనా, జపానుల కిప్పుడు సామంతరాజ్యమైనది. ఇది అందరికీ అసంతృప్తికరముగానే ఉండెను. పేచీలు రాకతీరదు. జపాను పేచీపెట్టవలెననే కోరుచుండెను. 1884 లో చీనాపై అది యుద్ధము ప్రకటించెను.

1894-95లో జరిగిన చీనా—జపాను యుద్ధము జపానుకు నల్లేరుపై బండినడకవలె ఉండెను. దాని సైన్యనివహములూ, నౌకాదళములూ సరికొత్తవి. చీనా పటాలములు పూర్వకాలపువిన్నీ, అసమర్థములున్నూ. మొదటినుండే జపాను విజయపరంపరలుసాధించెను. బలవంతాన దానిని ఒక సంధికి ఒడబరిచెను. దీనికి ఫలితముగా జపాను పాశ్చాత్య జాతులతో పలుకుబడి విషయమున సరిసమానపూయెను. కొరియా స్వతంత్ర దేశమని ప్రకటింపబడెను. కాని ఇది ఒక తెర. ఈ తెరవెనుక జపాను కొరియాను తన స్వాధీనములో ఉంచుకొనెను. ఇంతేకాకుండా ఆర్థరు రేవుపట్టణముతోసహా మంచూరియాలోని లియోటుంగు ద్వీపకల్పము నున్నూ, ఫార్మోజా మున్నగు కొన్ని ద్వీపములనున్నూ చీనా జపానుకు ఇచ్చుకోవలసి వచ్చింది.

చిన్న దేశమైన జపానుచేత చీనా సంపూర్ణ పరాజయమందడము ప్రపంచమునకు ఆశ్చర్యకారణమాయెను. దూరప్రాచ్యమున ఒక దేశము ప్రబలమగుట పాశ్చాత్య జాతులకు కన్నెర్రగా ఉండెను. చీనా—జపాను యుద్ధముజరిగేరోజులలోకూడా, జపానువిజయములు సాధించడంచూచి, చీనా దేశములో ఎట్టి భూభాగమున్నూ జపాను తన దేశములో కలుపుకో డానికి వీలులేదని పాశ్చాత్య జాతులు జపానును హెచ్చరించినవి. హెచ్చరిక చేసినప్పటికిన్నీ, ఆర్థరు రేవుపట్టణముతోసహా లియోటుంగు ద్వీపకల్పమును జపాను తీసుకొనెను. కాని అది దానికి దక్కలేదు. మూడు పెద్ద జాతులు—రష్యా, జర్మనీ, ఫ్రాంసులు—దానిని విడిచి

పెట్టమని జపానును నిర్బంధించెను. కోపంతో బాధపడుతూ జపాను విడిచిపెట్టవలసి వచ్చెను. మూడు జాతుల నెదుర్కోడానికి దానికి త్రాణలేదు.

కాని ఈ పరాభవమును జపాను విస్మరించలేదు. అది దాని మనస్సులో మెదుగుతూనే ఉండెను. ఒక గొప్ప యుద్ధమునకు అది తయారగుచుండెను. తొమ్మిది సంవత్సరముల అనంతరము యుద్ధము రష్యాతో సంభవించెను.

ఈ లోపుగా చీనాను ఓడించుటవల్ల జపాను తూర్పు ప్రాచ్యములో మిక్కిలి బలమగు జాతిగా ప్రతిష్ఠ సంపాదించెను. చీనా దౌర్బల్యము సుస్పష్టమాయెను. పాశ్చాత్య జాతులకు చీనా అంటే భయముపోయెను. శవముమీద వాలే రాబందులవలె పాశ్చాత్య జాతులు దానిమీద వచ్చి పడ్డవి. చేజిక్కినంత కొట్టుకుపోవడానికి ప్రయత్నించినవి. ఫ్రాంసు, రష్యా, ఇంగ్లాండు, జర్మనీ—ఈ జాతులన్నీ చీనా తీరమందలి రేవు పట్టణముల కొరకు పాకులాడినవి. హక్కులు పొందుటకు పాకులాడి నవి. అపవిత్రము, అనుచితము అగు పోరాటములోనికి వారు దిగిరి. ఏదో ఒక చిన్నసాకు పెట్టుకొని మరీ మరీ హక్కులు కోరుచుండిరి. ఇద్దరు మిషనరీలు హత్య చేయబడ్డారని చెప్పి జర్మనీ, తూర్పునఉన్న షాంటుంగ్ ద్వీపకల్పములోని "కిజౌచౌ"ను దౌర్జన్యముతో గ్రహించెను. జర్మనీ దీనిని గ్రహించింది. కాబట్టి ఇతర జాతులు ఈ దోపుడు ధన ములో తమకు పాలుకావాలన్నారు. ఆర్థరు రేవుపట్టణమును రష్యా తీసుకొనెను. మూడు సంవత్సరముల క్రితము ఇది జపానుకు దక్క కుండా చేసినది రష్యాయే. వై-హై-వై ను ఇంగ్లాండు తీసుకొని రష్యాతో సమానత్వము సంపాదించెను. ఫ్రాంసు, అన్నాంలోని ఒక రేవుపట్టణ మునూ, కొంత ప్రదేశమునూ తీసుకొనెను. ఉత్తర మంచూరియాకు అడ్డముగా, ట్రాన్సు సైబీరియన్ రైల్వేకు చేర్చి ఒక రైల్వే నిర్మించ డానికి రష్యా అనుమతికూడా సంపాదించెను.

లజ్జావిహీనమైన ఈ పాకులాట అసాధారణ మైనది. తన భూభాగములను తాను కోల్పోవుటకుగాని, ఇతరులకు హక్కునిచ్చుటకు గాని చీనాకిష్టములేదు. ప్రతీ పర్యాయమూ నౌకాబలమును ప్రదర్శించుట వల్లా, ముట్టడిచేస్తామని బెదిరించుటవల్లా చీనా ఒప్పుకోవలసి వచ్చింది. లజ్జాకరమైన ఇట్టి ప్రవర్తనకేమిపేరు పెట్టవచ్చును? బందిపోటు దొంగ తనమందామా? దోపుడు అందామా? ఇది ఒక సామ్రాజ్యవైఖరి. ఒకప్పుడది రహస్యముగా పనిచేయును. ఒకప్పుడది తన దుష్కార్య ములను సద్భావముల మరుగుననూ, ఇతరులకు ఉపకారము చేస్తున్నా మనే దొంగ నటన మరుగుననూ దాచిపెట్టును. గాని 1898 లో చీనాలో అది చేసిన దుష్కార్యమున కెట్టిమరుగూ లేదు. వికారముగా, నగ్న ముగా అది కనిపిస్తోంది.

## 117
# జపాను రష్యాను ఓడించుట

డిశంబరు 29, 1932

ఇన్నాళ్ళబట్టీ నీకు దూర ప్రాచ్య దేశాలను గురించి వ్రాస్తున్నాను. ఈ రోజునకూడా ఆ కథే సాగిస్తాను. గత కాలములో జరిగిన యుద్ధ ములను, కలహములను గురించి చెప్పి నీకు ఎందుకు భారం కలిగిస్తు న్నానని అనుకుంటావేమో? అవి రుచికరమైన విషయములు కావు. అవి చెప్పడం అయినది. వాటికి నేను ప్రాధాన్యత ఇవ్వను. కాని దూర ప్రాచ్యములో ఈనాడు జరుగుచున్న విశేషములకు ఈ అల్లరులే కార ణము. నేటి సమస్యలర్థము చేసుకోవడమునకు వాటిని గురించి తెలుసు కోవడము అవసరము. నేటి కాలమున, ఇండియావలెనే చీనాకూడా, ఒక ప్రపంచ సమస్య అయినది. నేను ఈ పంక్తులు వ్రాసే సమయములో మంచూరియాను జపాను జయించుట విషయమై తీవ్ర వివాదములు జరుగుచున్నవి.

1898 లో పాశ్చాత్య జాతులు యుద్ధనావల సహాయముతో చీనాలో కొన్ని సదుపాయములు సంపాదించుటకు పాకులాడినట్లు వెనుకటి జాబులో వ్రాసిఉంటిని. మంచి రేవుపట్టణములన్నింటినీ వారు స్వాధీనము చేసుకొనిరి. రేవుపట్టణముల వెనుకనున్న రాష్ట్రములలో గనులు త్రవ్వుటకూ, రైళ్లు కట్టుటకూ వగైరాలకు అనేక విధములగు హక్కులు సంపాదించిరి. ఇంకా సదుపాయములు కావలెనని ఒత్తిడి చేస్తూనే ఉండిరి. విదేశ ప్రభుత్వములు చీనాలో తమ పలుకుబడి ప్రదేశములంటూ (Spheres of influence) ప్రసంగించుకొన మొదలు పెట్టిరి. ఒక దేశమును ముక్కలుగా విభజించుటకు నేటి సామ్రాజ్యవాద ప్రభుత్వములవలంబించు చల్లని మార్గమిది. ఒక ప్రదేశమును స్వాధీనములో పెట్టుకొనుటలో అనేక అంతరములున్నవి. ఒక ప్రదేశమును కలుపుకొనుట అనగా పూర్తిగా తన హక్కు భుక్తములో పెట్టుకొనుట అన్నమాట. రక్షిత రాజ్యమన్నప్పుడు (Protectorate) అధికారము కొంత తగ్గును. "పలుకుబడి ప్రదేశము" అన్నప్పుడు ఇంకను తగ్గును. కాని ఇవన్నియు ఏకలక్ష్యమునే నిర్దేశించును. ఒకదానిని బట్టి ఒకదానికి సోపానక్రమమున పోవును. దేశమును కలుపుకొనుట పాతపద్ధతి. ఇది ఇప్పుడు అమలులోలేదు. దీనివల్ల జాతీయ సంక్షోభము సంభవించును. ముందు ముందు మనమీవిషయము చర్చించగలము. ఇతర గొడవలకు పోకుండా ఒక దేశమును ఆర్థికముగా స్వాధీనములో ఉంచుకోవడము చాలా సులభము.

ఇట్లు చీనాదేశ విభజనము త్వరలో జరుగనున్నట్లు తోచెను. జపాను భీతావహమయ్యెను. చీనాపై తాను సాధించిన విజయముయొక్క ఫలితములు పడమటి జాతులకు పోయినట్లు కనిపించెను. ఏమి చేసేదీ తోచక కోపముతో చీనా విభజనమును జపాను పరికించెను. అన్నిటికంటె ప్రధానము రష్యాపై జపాను కోపముగా ఉండెను. ఆర్థరు రేవు పట్టణము తనకు దక్కనీయకుండా అది తీసుకొన్నదిగదా అని కోపము.

చీనాలో సదుపాయములు సంపాదించుటకుగాని, చీనా విభవము పట్లగాని జోక్యము కలిగించుకోని గొప్ప జాతి ఒకటి ఉండెను. ఇది అమెరికా సంయుక్త రాష్ట్రములు. వారు జోక్యము కలిగించుకొనకుండుటకు కారణము వా రితరులకంటె ధర్మతత్పరులనికాదు. వారి దేశము బ్రహ్మాండమైనది. దానిని వారు వృద్ధిలోనికి తెచ్చుకొనుచుండిరి. పసిఫిక్ మహా సముద్రమువరకూ పశ్చిమముగా వారు వ్యాపించుటచే ఆక్రమించిన క్రొత్త భూములను వారు అభివృద్ధి చేసుకోవలసి ఉండెను. శక్తి సామర్థ్యములనూ, ధనమునూ వారందుకై వెచ్చించుచుండిరి. నిజమునకు యూరోపు దేశములోని వారుకూడా ఇందుకొరకై అమిత ధనమును అమెరికాలో పెట్టుబడులు పెట్టిరి. కాని ఆ శతాబ్దాంతమున అమెరికనులు పెట్టుబడులు పెట్టుట కనువగు దేశములకొరకు వెదకజొచ్చిరి. చీనాపై వారు దృష్టిపరపిరి. అచ్చట యూరోపియన్ జాతులు చీనాను "పలుకుబడి ప్రదేశములను"గా విభజించడానికి సిద్ధముగా ఉండిరి. బహుశా విభజనానంతరము వాటిని గ్రసించవలెనని వారి ఉద్దేశము కావచ్చును. ఇది అమెరికనుల కిష్టముగాలేదు. అమెరికాను వారు ఉపేక్షించిరి. కాబట్టి చీనాలో "బహిరంగనీతి" (Open-door policy) ఉండితీరవలెనని అమెరికావారు పట్టుబట్టిరి. దీనికర్థమేమనగా చీనాలో వర్తక వ్యాపారములు జరిపించుకొనుటకు అందరికిని సమాన సదుపాయములుండవలెనని. ఇతర జాతులందరూ దీనికి సమ్మతించిరి.

అంతులేని ఈ ఆక్రమణములను చూచి చీనా ప్రభుత్వము భీతిచెందినది. దేశ సంస్కరణము చేసుకోకుంటే మాటదక్కదని దానికి రుజువైనది. అట్లా చేయుటకు ప్రయత్నించింది. కాని ఉండుండీ క్రొత్త సదుపాయములకోసం విదేశ జాతులు పీడించుచుండుటచేత దాని ప్రయత్నములు విఫలముకాక తప్పదు. చూసీ అనే పేరుగల చక్రవర్తిని, రాజమాత కొన్ని సంవత్సరములబట్టి ఏకాంతవాసము చేయుచుండెను. ఆమెయే తమ్ము ఉద్ధరించగలదని చీనావా రాశపెట్టుకొనిరి. ఆ సమయ

షున చక్రవర్తి, ఏదో కుట్ర జరుగుచున్నదని అనుమానపడి ఆమెను చెరసాలలో పెట్టదలచెను. కాని ఆ వృద్ధవనిత అతనిని పదభ్రష్టునిచేసి అధికారమును తాను చేతులలో పెట్టుకొనెను. ఇట్లు ఆమె ప్రతీకారము చేసెను. జపాను చేసినట్లు ఆమె మూలముట్టుగ దేశమును సంస్కరించ ప్రయత్నించలేదు. కాని సైన్యమును నూతన పద్ధతులమీద నిర్మించుటకు పూనుకొనెను. ఆత్మరక్షణకొరకై స్థానిక సైనికదళముల నిర్మాణము నామె ప్రోత్సహించెను. ఈ స్థానిక సైనికదళములకు "ఇహోటు ఆన్" అని పేరు. ఈ మాటకర్థము "ధర్మశాంతి దళములు"అని. వారిని "ధర్మశాంతి ముష్టులు'' అనికూడ అనుట కద్దు (ఇహోచు ఆన్). రేవుపట్టణములలోనున్న కొందరు యూరోపియనుల చెవులలో ఈ మాట పడెను. ఆ పదమును వారు "బాక్సర్సు'' (ముష్టియుద్ధము చేయువారు) అని అనువదించిరి. ఎంత చక్కనిమాటకు ఎంత మోటు అనువాదమో !

విదేశీయుల పరాక్రమణకూ. విదేశీయులు చీనానూ, చైనీయులనూ అనేకమార్లు అవమానించినందుకూ ప్రతీకారముగా దేశభక్తి పూరితమైన ఈ బాక్సర్ల ఉద్యమము తలయెత్తింది. బాక్సర్లు విదేశీయులపట్ల సుముఖముగా ఎట్లుండగలరు? దుష్టత్వము మూర్తీభవించినట్లు విదేశీయులు వారికి కనబడిరి. ముఖ్యముగా వారు మిషనరీలను అసహ్యించుకొనుచుండిరి. వీ రనేక పర్యాయములు అన్యాయముగా ప్రవర్తించియుండుట ఇందుకు కారణము. క్రైస్తవములో కలిసిన చైనీయులను వారు దేశద్రోహులుగా భావించుచుండిరి. నూతన విధానమునుండి రక్షించుకొనుటకు అంతిమ ప్రయత్నము చేయుచున్న ప్రాచీన చీనాకు ప్రతినిధులై వారుండిరి. కాని ఈ విధముగా వారు చేయుచున్న ప్రయత్నము సఫలము కాగలదని తోచదు.

విదేశీయులన్నను. మిషనరీలన్నను విముఖులైన సాంప్రదాయకులగు ఈ దేశభక్తులకున్నూ, పాశ్చాత్యులకున్నూ తగవు రాకతీరదు.

తగవులు రానేవచ్చినవి. ఇంగ్లీషు మిషనరీ హత్యచేయబడెను. యూరో పియనులనేకులూ, చైనీయ క్రైస్తవులనేకులూ చంపబడిరి. దేశభక్తి పూరితమగు బాక్సరు ఉద్యమమును అణచివేయవలసినదని విదేశ ప్రభుత్వములు కోరినవి. చీనా ప్రభుత్వము హత్యలు చేసినవారిని దండించినది. కాని ఈ విధముగా తన బిడ్డను తానెట్లు అణచివేయ గలదు ? ఇంతలో బాక్సరు ఉద్యమము త్వరత్వరగా వ్యాపించెను. విదేశ మంత్రులు భయపడి యుద్ధనావలనుండి సైనికదళములను రప్పించిరి. విదేశీయుల దండయాత్ర ప్రారంభమైనదని చీనావారు భావించిరి. జర్మను మంత్రి హత్య చేయబడెను. పెకింగ్‌లోని విదేశ రాయబారులుండు భవనములు ముట్టడింపబడెను.

బాక్సరు ఉద్యమమునకు సానుభూతి చూపుచూ చీనాలోని అధిక భాగము ఆయుధములు ధరించెను. కాని కొన్ని రాష్ట్రములలోని రాజ ప్రతినిధులు తటస్థముగా నుండిరి. ఈ విధముగా వారు విదేశజాతులకు సహాయము చేసిరి. రాజమాత బాక్సర్లపట్ల సుముఖముగానే ఉండెను. కాని బహిరంగముగా వారితో కలవలేదు. బాక్సర్లు బందిపోటు దొంగ లంటూ విదేశీయులు చెప్ప మొదలు పెట్టిరి. కాని నిజమాలోచిస్తే 1900 లో జరిగిన తిరుగుబాటు విదేశీయుల బారినుండి తప్పించుకొను టకు దేశభక్తులగు చీనావారు చేసిన ప్రయత్నమనియే తేలును. చీనాలో పనిచేయు ఇంగ్లీషు ఉన్నతోద్యోగి యొకడు, ఆ సమయమున కస్టమ్సు ఇన్‌స్పెక్టరు జనరలుగా ఉండిన సర్ రాబర్టు హార్టు అనువాడు, రాయ బార భవనముల ముట్టడి ననుభవించినవాడు. అతడు చెప్పినమాట ఏమనగా—"చీనావారిని రెచ్చగొట్టిన దోషము విదేశీయులకూ, మిషన రీలకూ చెందవలెను. చైనీయుల తిరుగుబాటు దేశభక్తి పూరితమైనది. వారి లక్ష్యము శుద్ధమైనది కాబట్టి తిరుగుబాటు న్యాయసమ్మతమైనదే."

ఉన్నట్లుండి పురుగువంటి చీనా తిరుగుబాటు చేయుట పాశ్చాత్య జాతులకు ఆగ్రహ కారణమయ్యెను. పెకింగ్‌లో ముట్టడింపబడిన తమ

రాయబారులను రక్షించుటకు వారు తొందరగా సైన్యముల పంపిరి. అట్లు చేయుట న్యాయమే. ముట్టడింపబడ్డ రాయబార భవనములను రక్షించుటకు జర్మను సేనాని నాయకత్వమున ఒక అంతర్జాతీయ సైన్యము పంపబడెను. జర్మనీ రాజు కైజరు, హూణులవలె ప్రవర్తించవలసిన దని చీనాలోని తన సేనలను ఆదేశించెను. బహుశా దీనినిబట్టే, ప్రపంచ యుద్ధములో జర్మనులనందరినీ ఇంగ్లీషువారు హూణులని పిలువజొచ్చిరి.

కైజరు సలహా ప్రకారము ప్రవర్తించినవారు జర్మను సేనలు మాత్రమేకాదు. విదేశీయ సైన్యములన్నీ అట్లే ప్రవర్తించినవి. ఈ సేనలు పెకింగుకు నడిచివెళ్ళేటప్పుడు ప్రజలను అమితముగా పీడించెను. వారి చేతిలో బడుటకు బదులు ఆత్మహత్య చేసుకోవడం మంచిదని చీనా వారు భావించి అట్లు చేసుకొనిరి. ఆ రోజులలో చీనాదేశ స్త్రీల పాదములు బహు చిన్నవి. పాదములు బంధించి వారట్లు చేసికొనిరి. కాన వారు సులభముగా పరుగెత్తలేకుండిరి. కాన స్త్రీ లనేకులు ఆత్మహత్య చేసుకొనిరి. ఈ విధముగా మిత్రమండలి సేనలు సాగిపోయినవి. వారు పోయిన ప్రదేశములందు చావులు, ఆత్మహత్యలు, గ్రామ దహనములు జరుగుచుండెను. మిత్రమండలి సేనలతో వెళ్ళిన ఒక యుద్ధవార్తాహరుడు, ఇంగ్లీషువాడు, ఈ విధముగా చెప్పుచున్నాడు—

> నేను వ్రాయకూడని సంగతులున్నవి. ఇంగ్లాండులో అవి ముద్రింపబడక పోవచ్చునుకూడా. ఈ సంగతులనుబట్టి వెల్లడి అయే విషయం ఏమిటంటే, ఈ మన పాశ్చాత్య నాగరికత పశుత్వముపై పూసిన మెరుగుపూత అని. ఏ యుద్ధమును గురించీ, ఏప్పుడూ, అసలు సత్యము ఎవ్వరూ వ్రాయలేదు. దీనినిగురించి మాత్రం వ్రాయడమెందుకు ?

ఈ సైన్యములు పెకింగు చేరి రాయబారవర్గములను రక్షించెను. తరువాత పెకింగు పట్టణమును కొల్లగొట్టుట ప్రారంభమైనది. పిజ్జారో కాలమునుంచి ఇప్పటివరకూ ఇంతటి గొప్ప దోపుడు జరిగియుండలేదు.

పెకింగులోని కళాసంపద మూర్ఖులగు మోటుమనుష్యుల చేజిక్కినది. దాని విలువ వారికి తెలియదు. ఈదోపుడులో ప్రధానపాత్ర వహించిన వారు మిషనరీలగుట శోచనీయము. గుంపులుగా గుంపులుగా మనుష్యులు వెళ్ళి ఇంటింటికీ, ఆ ఇళ్లు తమవని, నోటీసులు అంటించిరి. ఇంటిలోని విలువగల సామానులన్నీ అమ్మివేసిన పిమ్మట ఇంకొక పెద్ద ఇంటికి కదలి వెళ్ళుచుండిరి.

చీనా విభజనకాకుండా తప్పించుకొనుటకు కారణములు-పాశ్చాత్య జాతులలో ఉండుకున్న అన్యోన్య స్పర్థలు ఒకటి. అమెరికా సంయుక్త రాష్ట్రముల వైఖరి ఒకటి. కాని చీనా అనుకోనంత అవమానమునకు పాలైనది. దానిమీద అనేక నేరములు మోపబడ్డవి. విదేశ సైన్య దళములను శాశ్వతముగా పెకింగ్‌లో, రైల్వే రక్షణకై నిలుపుటకు నిశ్చయించడమైనది. అనేక దుర్గములను నాశనము చేయుటకు నిశ్చయించడమైనది. విదేశీయులకు వ్యతిరేకముగానున్న సంఘములో సభ్యులుగా చేరినవారికి మరణదండన విధించబడును. వ్యాపార సంబంధమైన హక్కులు ఇంకా అధికముగా తీసుకోబడ్డవి. నష్టపరిహారమునకై పెద్ద ధనమొత్తము బలవంతాన తీసుకోబడెను. అన్నిటికన్న ఘోరమైన విషయము—బాక్సరు ఉద్యమమును నడిపించిన దేశభక్తులను. తిరుగుబాటు దార్లుగా జమకట్టి వారికి మరణదండన విధించునట్లుగా చీనా ప్రభుత్వము బలవంతపెట్టబడెను. "పెకింగు సంధి షరతుల పత్రము" ఈ వైఖరిలో నుండెను. 1901 లో ఇందు చేవ్రాళ్ళు పెట్టబడ్డవి.

చీనాలో, అందు ముఖ్యముగా పెకింగుచుట్టూ, యిట్టి సంఘటనలు సంభవిస్తూన్న సమయములో, ఈ గందరగోళములో ఇదే సందు అనుకొని రష్యా ప్రభుత్వము సైబీరియా మీదుగా మంచూరియాకు పెద్ద సైన్యములను పంపెను. చీనాకు శక్తిలేదు. అట్లు చేయరాదని చెప్పుటయే అది చేయగలిగెను. కాని ఇతర విదేశ జాతులు, రష్యా ప్రభుత్వము మంచూరియాను ఆక్రమించినందుకు తమ అసమ్మతి దృఢముగా తెలియ

జేసిరి. ఈ పరిస్థితులు చూచి జపాను భయపడినది. కాబట్టి ఈ జాతు లన్నీ రష్యాను వెనుకకు పొమ్మని ఒత్తిడి చేసినవి. తాను చేసిన న్యాయ కార్యమునకు ఇతరులకెందుకు కోపము రావలెనని రష్యా నొచ్చుకొని, ఆశ్చర్యం వెళ్ళడించింది. ఆధీశరత్వము వహించిన చీనా హక్కులను గ్రహించడం తన అభిప్రాయ మెంతమాత్రమూ కాదనిన్నీ. మంచూరి యాలో ఉన్న రష్యన్ రైల్వేలో శాంతి భద్రతలు చేకూరినతోడనే సైన్యములను వెనుకకు మరలిస్తాననిన్నీ జాతులకది నచ్చచెప్పింది. ఆ మాట అందరికీ తృప్తికరంగా కనిపించింది. తమ స్వార్థరాహిత్యము నకూ, ధర్మ శీలతకూ బహూశా ఈ జాతులు తమ్ము తాము అభినందించు కొని యుండవచ్చును. ఏది ఎట్లున్నా రష్యన్ సేనలు మాత్రము మంచూరి యాలో నిలిచినవి. కొరియావరకూ వ్యాపించినవి.

రష్యా, మంచూరియాలో ప్రవేశించి కొరియావరకూ పోవుట జపానుకు కోపకారణమైనది. ఎవరికీ తెలియకుండా వారు యుద్ధమునకు గట్టిగా తయారగుచుండిరి. 1895 లో మూడు జాతులు చేరి చీనా యుద్ధా నంతరము బలాత్కారముగా ఆర్థరు రేవుపట్టణము తాను వదలిపెట్టే టట్లు చేయించడము జపానుకు జ్ఞాపకమున్నది. ఇట్లు ముందు జరుగ రాదని అది నిశ్చయించుకొన్నది. రష్యనులు ముందుకు పోవుట ఇంగ్లాండుకు ఇష్టములేదనిన్నీ, దాని నరికట్టుటకు అది కోరుచున్నట్లూ జపాను గ్రహించింది. కాన 1902లో జపాను ఇంగ్లాండుతో మిత్రత్వము సాధించింది. దీని ఉద్దేశము జాతులన్నీ కలిసి దూర ప్రాచ్యమందలి జపాను, ఇంగ్లాండులను ఎదురుకోకుండా ఆటంకపరుచుట. జపాను కిప్పుడు భద్రత చిక్కింది. రష్యామీదికి ఇంకనూ దురుసుగా పోయింది. మంచూరియానుండి రష్యా సేనల వెనుకకు నడిపించుటకు పొమ్మని గట్టిగా కోరింది. కాని ఆనాటి జార్ ప్రభుత్వము తెలివితక్కువగా జపాను మాట తృణీకరించింది. జపాను తనతో యుద్ధము చేయగలదని రష్యా కలలోకూడా అనుకోలేదు.

1904 తొలి భాగములో రష్యా, జపానులు యుద్ధమునకు దిగినవి. జపానందుకు పూర్తిగా సిద్ధమై ఉండెను. ప్రభుత్వ ప్రచారమూ, చక్రవర్తి ఆరాధనా కారణములుగా జపాను ప్రజలు దేశభక్తితో ఉద్రిక్తులై ఉండిరి. రష్యా ఎంతమాత్రమూ యుద్ధమునకు సిద్ధముగాలేదు. అచ్చట ఉన్నది నిరంకుశ ప్రభుత్వము. ప్రజలను నిరంతరమూ పీడించి అది సాగుచుండెను. సంవత్సరన్నరకాలము యుద్ధము తీవ్రముగాజరిగెను. ఆసియా, యూరోపు అమెరికా దేశములు—భూమిమీదను, సముద్రము మీదను జపాను సాధించిన విజయములను ప్రత్యక్షముగా చూచిరి. అద్భుతావహమగు త్యాగ కార్యములు జపానువారు చేసిరి. అమితమగు జననష్టము కలిగిన పిమ్మట ఆర్థరు రేవుపట్టణము జపానువారి చేజిక్కెను,

యూరోపునుండి సముద్రమార్గమున దూర ప్రాచ్యమునకు రష్యా ఒక గొప్ప యుద్ధ నౌకాదళమును పంపెను. వేలకొద్ది మైళ్ళ దూరము సముద్ర ప్రయాణము చేసి, సగము ప్రపంచము దాటి, అలసి ఈ మహా నౌకాదళము జపాను సముద్రమును చేరుకొనెను. జపాను, కొరియాల మధ్యనున్న ఇరుకు జలసంధులలో జపానువారా నౌకాదళమును, నౌకా దళాధిపతితోసహా ముంచివేసిరి. దాదాపు దళము దళమంతా మునిగిపోయెను.

రష్యా, జార్ల పరిపాలనమందున్న రష్యా, పరాజయముల పాలయ్యెను. పెద్ద దెబ్బ తినెను. రష్యాకు నిలువ శక్తిలేక పోలేదు. 100 సంవత్సరములక్రితము నెపోలియనును పూరిగరిపించినది రష్యాయే కదా! కాని అప్పుడు కలుగజేసికొన్నది అసలు రష్యా—రష్యాలోని ప్రజాసామాన్యము.

ఈ జాబులలో నేను రష్యా, ఇంగ్లాండు, ఫ్రాంసు, చీనా, జపాను అంటూ వ్రాసుకుంటూ వెడుతున్నాను. ఇందలి ప్రతి ఒక దేశమూ ఒక ప్రాణమున్న జీవి అన్న విధముగా, గ్రంథములనుండీ, వార్తాపత్రికల

నుండీ నాకు సంక్రమించిన దురభ్యాసమిది. నా అభిప్రాయము ఆనాటి రష్యా ప్రభుత్వమనీ, ఇంగ్లీషు ప్రభుత్వమనీ ఇత్యాదిగా. ఈ ప్రభుత్వములు ఒక చిన్న ప్రజాసంఘము వినా ఎవరితరఫునా పనిచేయడంలేదు. లేదా ఒక తరగతి ప్రజలకు అవి ప్రతినిధులై ఉండవచ్చు. అవి అందరి ప్రజల తరఫునా పరిపాలన చేస్తున్నవని తలంచనూ కూడదు. చెప్పనూ కూడదు. పందొమ్మిదో శతాబ్దిలో ఇంగ్లీషు ప్రభుత్వము కొద్దిమంది భాగ్యవంతులు, భూస్వాములు, మధ్యతరగతి ప్రజలలో భాగ్యవంతులు-వీరి తరఫున పరిపాలన సాగించింది. వీరి స్వాధీనములోనే పార్లమెంటు ఉండెను. ప్రజలలో బహు సంఖ్యాకులకు ప్రభుత్వముతో సంబంధము లేదు. నేడు ఇండియాలో ఒకమాట వినవస్తూ ఉంది. నానాజాతి సభకు గాని, రౌండుటేబిల్ కాన్ఫరెన్సుకుగాని, మరియొక్క సభకుగాని ఇండియా తన ప్రతినిధులను పంపుతూ ఉన్నదని. ఇది అసంబద్ధ ప్రలాపము. ఈ ప్రతినిధులు ఇండియా ప్రతినిధులు కాజాలరు. ఇండియా ప్రజలు ఎన్నుకొన్నవారైతేనే వారు ఇండియా ప్రతినిధులు కాగలరు. వారు ఇండియా గవర్నమెంటువారిచే నియుక్తులైనవారు మాత్రమే. పేరు ఎట్లా ఉన్నా ఈ ఇండియా గవర్నమెంటు బ్రిటిషు గవర్నమెంటుయొక్క ఒక పరిపాలనా శాఖ మాత్రమే. రష్యా—జపాను యుద్ధకాలమున రష్యా ఒక నిరంకుశ ప్రభుత్వము. "రష్యాలపై నిరంకుశ ప్రభువు" జార్. ఈ నిరంకుశుడు పట్టి మూర్ఖుడు. సైన్య సహాయముతో అతడు కార్మికులను, కర్షకులనూ అణచిపెట్టెను. మధ్య తరగతి వారికైనను ప్రభుత్వములో పలుకుబడి లేదు. ఈ నిరంకుశత్వము నెదురుకొనుటకు సాహసులగు యువకులనేకులు పూనుకొనిరి. స్వాతంత్ర్య యుద్ధమున వారు ఆత్మార్పణమొనర్చుకొనిరి. బాలిక లనేకులీవిధముగానే బలి అయిరి. కాబట్టి, రష్యా ఈపనీ, ఆపనీచేస్తోందనీ, జపానుతో యుద్ధముచేస్తోందనీ నేనన్నప్పుడు నా అభిప్రాయము జార్ ప్రభుత్వమనియే. అంతకన్న విశేషములేదు.

విపత్కరమైన జపాను యుద్ధము సామాన్య ప్రజలను అగచాట్ల

పాలు చేసెను. ప్రభుత్వముపై ఒత్తిడి కలిగించుటకు ఫ్యాక్టరీ కార్మికులు తరుచు సమ్మెకట్టుచుండిరి. 1905 జనవరి 22 తేదీని శాంత స్వభావులగు కర్షకులూ, కార్మికులూ అనేక వేలమంది ఒక పురోహితుని నాయకత్వమున, తమ కష్టములు గట్టెక్కునట్లు చూడమని చెప్పుకొనుటకు జార్ యొక్క శ్వేత భవనమునకు బారులుతీరి వెళ్ళిరి. వారు చెప్పే మనవి వినలేదు సరిగదా జార్ వారిని తుపాకులతో కాల్పించెను. ఘోర హత్యలకు ప్రజలు పాలైరి. 200 మంది చంపబడిరి. పీటర్సు బర్గులోని శీతకాలపు మంచు వారి నెత్తురుతో ఎర్రబడెను. ఆనాడు ఆదివారము. నాటినుంచీ ఆ దినమునకు "రక్తాదిత్యవారము" అనే పేరు వచ్చింది. దేశమంతా దద్దరిల్లింది. కార్మికులు సమ్మెలు కట్టిరి. ఇది విప్లవమునకు దారి తీసెను. 1905 సంవత్సరములో జరిగిన విప్లవమును జార్ ప్రభుత్వము క్రూరముగా అణచివేసెను. అనేక కారణములవల్ల ఈ విప్లవము మనము గమనించదగ్గది. పన్నెండు సంవత్సరముల తర్వాత 1917 లో తలయెత్తి నట్టిన్నీ, రష్యా స్వరూపమును మార్చినట్టిన్నీ మహా విప్లవమున కిది పునాది. విఫలమైన 1905 విప్లవము కాలమందే విప్లవకారులగు కార్మికులు ఒక నూతన సంస్థను స్థాపించిరి. దీనిపేరు సోవియట్లు. ముందు ముందు ఇది ప్రసిద్ధి నందనున్నది.

చీనా, జపానుల గురించిన్నీ, రష్యా–జపాను యుద్ధమును గురించిన్నీ చెప్పుతూ, నా అలవాటు చొప్పున 1905లో జరిగిన రష్యన్ విప్లవములోనికి దిగితిని. ఈ మంచూరియా యుద్ధ సమయమున రష్యా పరిస్థితులను నచ్చజెప్పడానికి ఇందునుగురించి నీకు కొంత చెప్పవలసి వచ్చింది. యత్నించబడ్డ ఈ తిరుగుబాటు వల్లనున్నూ, ప్రజల పై ఖరిని బట్టిన్నీ జార్ జపానుతో సంధి చేసుకొనెను.

1905 సెప్టెంబరులో జరిగిన పోర్ట్సుమత్ సంధితో రష్యా— జపాను యుద్ధము ముగిసింది. పోర్ట్సుమత్ అమెరికా సంయుక్త రాష్ట్రములలో ఉన్నది. అమెరికా అధ్యక్షుడు ఉభయపక్షములవారినీ అచ్చటికి

ఆహ్వానించెను. సంధిపత్రములో అచ్చట చేవ్రాళ్ళు పెట్టబడినవి. ఈ సంధినిబట్టి జపానుకు ఆర్థరు రేవుపట్టణమునూ, లియోటుంగ్ ద్వీప కల్పమూ మరల దక్కినవి. నీకు జ్ఞాపకమున్నదో లేదో—చీనా యుద్ధానంతరము అది వాటిని వదులుకోవలసివచ్చింది. మంచూరియాకో రష్యా కట్టిన రైల్వేలో చాలా భాగమునున్నూ, జపానుకు ఉత్తరముగా ఉన్న సఖలీన్ ద్వీపములో సగ భాగమునున్నూ కూడా జపాను తీసుకొన్నది. ఇంతేకాదు—కొరియాపై తనకున్న అధికారాల నన్నిటినీ రష్యా వదులుకొన్నది.

జపాను విజయము సాధించింది. మహా జాతులలో తానున్నూ చేరింది. ఆసియాఖండ దేశమైన జపాను సాధించిన విజయము ఆసియా దేశము లందంతటా అనేక ఫలితముల కలిగించింది. నేను బాల్యదశలో ఉన్నప్పుడు ఈ వార్త నన్నెంతో ఉద్రుక్తుణ్ణి చేసింది. నావలెనే ఆసియా లోని బాల బాలికలేగాక పెద్దలున్నూ ఉద్రుక్తులై ఉందురు. ఒక పాశ్చాత్య మహాజాతి ఓడించబడ్డది. కాబట్టి గత కాలములో తరుచు ఓడించినట్లే నేడున్నూ యూరోపును ఆసియా ఓడించగలదు. ప్రాచ్య దేశములలో జాతీయ తత్వం త్వరగా వ్యాపించింది. "ఆసియా ఆసియా వాసులదే" అన్నమాట వినవచ్చింది. ఈ జాతీయతా లక్షణము మరల గతమునకు మరలుటకాదు; ప్రాచీనాచారములనూ, నమ్మకములనూ మరల పట్టుకొని వేళ్ళాడుటకాదు. పాశ్చాత్యుల నూతన పారిశ్రామిక పద్ధతు లవలంబించుటవల్లనే జపాను విజయము సాధించిన సంగతి వారికి తెలియును. ప్రాచ్య దేశములందంతటా ఈ భావములకూ, పద్ధతులకూ పలుకుబడి హెచ్చెను.

———

# చీనా ప్రజాప్రభుత్వ (Republic) మగుట

డిశంబరు 30, 1932

రష్యాపై చీనా సాధించిన విజయము ఆసియా జాతులకు సంతోష కారణమైనది. గర్వకారణముకూడా అయినది. దానియొక్క సద్యః ఫలితము—సామ్రాజ్యవాద జాతుల చిన్న కూటమునకు వేరొక జాతి చేరుట. దీని తొలిఫలమును చవి చూచింది కొరియా. జపాను ఉన్నతి కొరియా పతనముకు కారణమైనది. ప్రపంచముతో సంబంధం పెట్టు కొన్నప్పటినుంచీ జపాను కొరియానూ, కొంత మంచూరియానూ తన దేశములుగానే భావించ మొదలుపెట్టింది. కానైతే అది తరుచు చెప్పడం మాత్రం కద్దు—అఖండరాజ్యమైన చీనా అఖండత్వాన్ని గౌరవిస్తాననీ, కొరియా స్వాతంత్ర్యమును పాటిస్తాననీ. జాతులకొక పద్ధతి ఉంది. ఒకరిని దోచుకుంటూనే తమ సద్భావాన్ని వేనోళ్ళ చాటుతారు. ఒకరిని చంపుతూనే ప్రాణము ఎంత పవిత్రమైనదంటారు. ఈ విధముగానే జపాను కొరియా వ్యవహారాలలో కలుగజేసికోనని ఎంతో నమ్మకంగా చెప్పినది. చెప్పుతూనే కొరియాను స్వాధీనము చేసుకొంది. కొరియా, మంచూరియాలనుబట్టి అది చీనాతోటీ, రష్యాతోటీ యుద్ధాలు చేసింది. అడుగుమీద అడుగు వేసుకుంటూ అది ముందుకు పోయింది. చీనా, రష్యాలు ఓడిపోవడంవల్ల దానికి మార్గం సుకరమైనది.

సామ్రాజ్యవాదనీతిని అమలులోపెట్టేటప్పుడు, జపాను ఎట్టిశంకలూ పెట్టుకోలేదు. బహిరంగంగా అది గ్రసించింది. తన ఉద్దేశములను చాటుగా నైనా పెట్టుకోలేదు. 1894 లోనే, చీనా యుద్ధమునకు ముందు, కొరియా రాజధానియైన సీఓల్ రాచనగరులోనికి జపానువారు బలవంతంగా ప్రవే శించి, వారు చెప్పినట్లు నడుచుకోని రాణీని చెరబట్టారు. రష్యా యుద్ధా నంతరము 1905 లో జపాను ప్రభుత్వము కొరియా రాజును ఒత్తిడిచేసి

దేశ స్వాతంత్ర్యాన్ని వదులుకొనేటట్లూ, జపాను ఆధిపత్యము సంగీకరించేటట్లూ చేసినది. దీనితో జపాను తృప్తి తీరలేదు. అయిదు సంవత్సరములు కాకముందే పాప ఓరాజును పదభ్రష్టుని చేసి కొరియాను తన సామ్రాజ్యములో కలుపుకొంది. ఇది జరిగినది 1910 లో. 3000 సంవత్సరముల దీర్ఘ చరిత్ర అనుభవించిన పిమ్మట కొరియా ప్రత్యేక రాజ్యమనే పేరు కోల్పోయింది. పదభ్రష్టుడైన రాజు, 500 సంవత్సరములకు పూర్వము మంగోలులను తరిమివేసిన రాజవంశమునకు చెందినవాడు. కాని కొరియా, సాటి దేశమగు చీనావలెనే కరడుగట్టుకుపోయి ఎట్టి అభివృద్ధి లేకుండా నిలిచిపోయింది. ఇందుకు శాస్తి అది అనుభవించవలసి వచ్చింది.

కొరియాకు దాని పూర్వనామము పెట్టబడెను. అది ఛోజన్– అనగా ఉదయ ప్రశాంతభూమి. జపానీయులు నూతన సంస్కరణముల కొన్నింటిని ప్రవేశపెట్టిరి. కాని కొరియా ప్రజల ధైర్యోత్సాహములను వారు మూలముట్టుగా అణచివేసిరి. అనేక సంవత్సరములపాటు స్వాతంత్ర్యమునకై పోరాటము జరుగుచునే ఉండెను. అనేకమార్లు జపానుపై తిరుగబడిరి. అందు ప్రధానమైనది 1919లో జరిగెను. కొరియాప్రజలు, ముఖ్యముగా చదువువారున్నూ, స్త్రీలున్నూ, ధైర్యముతో శక్తికిమించి పోరాడిరి. ఒకమారు ఒక కొరియన్ సంస్థ స్వేచ్ఛకై పోరాడుచు స్వాతంత్ర్యమును ప్రకటించెను. వెంటనే అవి పోలీసులకు టెలిఫోను ద్వారా తాము చేసిన పని తెలియజేసినవట. అనగా వారు కావలసిన తమ లక్ష్యమునకై ఆత్మార్పణం చేసుకొన్నారు. జపానువారు కొరియనులను అణచిపెట్టుట చరిత్రలో విచారగ్రస్తము, కళంకితము అగు అధ్యాయము. కొరియన్ బాలికలనేకులు, కాలేజీలలో చదువుకొంటున్నవారు. ఈ పోరాటములో పాల్గొన్నారన్నమాట గమనించదగ్గది.

ఇప్పుడుమనము చీనాకు మరల వెళ్లుదము. బాక్సర్ ఉద్యమము అణచివేయబడింది. 1901 లో పెకింగ్ సంధి పత్రముపై చేవ్రాళ్ళు

పెట్టబడ్డవి. చీనా అవమాన భారమున క్రుంగిపోయింది. మళ్ళీ దేశ
మును సంస్కరించుటకు ప్రయత్నములు జరిగినవి. వృద్ధరాజమాత
కూడా ఏదో ఒకటి చేయవలసి ఉంటుందని ఊహించినట్లు తోస్తుంది.
రష్యా—జపాను యుద్ధము జరిగే కాలములో చీనా భూమియైన మంచూరి
యాలో యుద్ధము జరుగుతూ ఉన్నప్పటికీ చీనా ఉదాసీనంగా చూస్తూ
ఊరుకొంది. జపాను విజయము చీనాలోని సంస్కర్తలకు బలము
నిచ్చింది. విద్యా విధానము నేటి పరిస్థితుల కనుగుణంగా సంస్కృత
మైనది. నూతన శాస్త్రములను పఠించుటకు అనేకులు విద్యార్థులు
యూరోపు, అమెరికా, జపాను దేశములకు పంపబడిరి. ఉద్యోగస్తులను
నియమించుటకై చేసే పరీక్షలు రద్దు చేయబడినవి. ఈ పరీక్షవిధానము
2000 సంవత్సరముల కాలము—హాన్ రాజవంశపు కాలమునుంచీ—
చీనాలో నిలిచెను. చీనాలో సంస్థలు చిరకాలము మనుట ఉన్నదేకదా!
దాని ప్రయోజనము తీరి చాలకాలమైనది. చీనా పురోభివృద్ధికది నేడు
ఆటంకముగా నిలిచినది. దానిని రద్దుచేయుట మంచిదే. అయినా దీర్ఘ
కాలముపాటు అది అద్భుతముగా పనిచేసింది. చీనావారి జీవితవిధాన
మెట్టిదో అది సూచిస్తుంది. ఫ్యూడల్ దృష్టి వారికి లేదు. మత పురో
హితుల దృష్టి వారికిలేదు. హేతువాదమే వారు ప్రధానంగా చేసుకొన్నారు.
చీనావారు ఎప్పుడున్నూ మత సంప్రదాయపరులుకారు. కాని మతవిశ్వా
సము కలవారికన్న మిన్నగా వారు నీతి పథమును అవలంబించిరి. వారి
జీవనము సదాచార భూయిష్టమైయుండెను. వారు హేతుబద్ధమగు సంఘ
మును అభివృద్ధిపరుప ప్రయత్నించిరి. కాని ప్రాచీన గ్రంథముల కట్టు
బాట్లలోనే దానిని నడిపించిరి. కాన అభివృద్ధిగాని, అవసర పరివర్తనము
గాని జరుగ వీలైనదికాదు. అందువల్ల అది గిడసబారి ఎట్టి అభివృద్ధీ
లేకుండా నిలిచిపోయింది. ఇండియాలో నివసించు మనము చీనావారి
హేతువాదమునుబట్టి చాలా విషయాలు నేర్చుకోవలసి ఉన్నది. ఎందు
కంటే మనమింకా వర్ణవ్యవస్థకూ, పిడివాదముచేయు మతముకూ, పురో

హిత వర్గముకూ, ఫ్యూడల్ భావములకూ బద్ధులమైఉన్నాము. చీనాదేశ మందు పుట్టిన మహాజ్ఞాని కంఫూసియస్ ప్రజల నీ విధముగా హెచ్చరించాడు. జ్ఞాపక ముంచుకోవలసిన మాటలివి—"ప్రకృతి కతీతమైన విషయములతో సంబంధమున్నదని చెప్పేవారితో ఎట్టి సంబంధమూ పెట్టుకోకు. దేశములో అలౌకికత్వమునకు నిలువ నీడ నీయరాదు. ఇస్తివా దేశమునకది అరిష్టమే." మన దేశములో పిలక పెట్టుకొనిగాని, జడలు కట్టుకొనిగాని, గడ్డము పెంచుకొనిగాని, నుదుట రకరకముల బొట్లు పెట్టుకొనిగాని, కాషాయ వస్త్రము కట్టుకొనిగాని ఉన్నవారిలో అనేకులు అలౌకిక వ్యవహారములు తమకు తెలుసునని నటించి సామాన్య జనులను డబ్బుకై పీడిస్తారు.

కాని, చీనా ప్రాచీన కాలమునాటి హేతువాదమూ, సంస్కృతీ కలదైనప్పటికీ వర్తమాన కాలమున కనుగుణముగా ప్రవర్తించలేక పోయింది. కష్టదశలో ప్రాచీన సంస్థలు దానికెట్టి ఉపకారమూ చేయలేక పోయినవి. జరిగిన సంభవములచూచి దాని ప్రజలు మేల్కొని తమ్ముద్ధరించు మార్గమేమని విచారించారు. వృద్ధరాజ మాతకుకూడా కదలిక పుట్టింది. రాజ్యాంగ వ్యవస్థ నేర్పరచవలెననీ, స్వపరిపాలనము ఇయ్యవలెననీ ప్రసంగించ మొదలుపెట్టింది. ఇతర దేశములందలి రాజ్యాంగ వ్యవస్థలను గురించి తెలిసికొనుటకు పరదేశములకు ఒక కమిషను (Commission) పంపించింది.

వృద్ధరాజమాత పరిపాలనమునందున్న చీనా ప్రభుత్వము చివరకు కదల మొదలుపెట్టింది. ప్రజలంతకన్న చురుకుగా పోవుచుండిరి. 1894 లోనే డాక్టరు సన్‌యట్ సేను "చీనా పునరుద్ధరణ సంఘము"ను స్థాపించెను. పరదేశ జాతులు బలవంతాన చీనాపై రుద్దిన సంధులు—ఒక పక్షమువారు మాత్రమే అంగీకరించిన అన్యాయపు సంధులుచూచి తమ అసమ్మతిని తెలుపుటకు పలువు రాసంఘమును చేరిరి. ఈ సంఘము క్రమాభివృద్ధిచెందింది. దేశమందలి యువకుల నది ఆకర్షించింది. 1911లో

అది పేరు మార్చుకొంది. కో–మిన్–టాంగ్. "ప్రజల జాతీయపక్షము" –ఇది దాని క్రొత్తపేరు. చీనా విప్లవమునకు అది కేంద్రమైనది. ఈ యుద్యమమునకు ప్రాణమైన డాక్టరు సూన్ సంయుక్త రాష్ట్రముల రాజ్యాంగ పద్ధతిని మాదిరిగా పెట్టుకొనెను. ప్రజా ప్రభుత్వము చీనాలో ఉండవలెనని అతడు కోరెను. ఇంగ్లాండులోవలె నియమబద్ధ ఏకాధిపత్యముకాని, జపానులోవలె చక్రవర్తి ఆరాధనకాని చీనాకు ఎంత మాత్రమూ తగవని అతని అభిప్రాయము. చీనావారెన్నడూ తమ చక్రవర్తులను పూజించలేదు. అయినా చీనాలో రాజ్యము చేస్తూన్న రాజవంశము చైనీయ రాజవంశముకాదు. ప్రజలలో పొడచూపిన ఈ అలజడివల్లనే వృద్ధరాజమాతకు కదలిక పుట్టింది. నూతన రాజ్యాంగ వ్యవస్థ ప్రవేశబెట్టుతూన్నట్లు ప్రకటన చేసినకొద్ది కాలమునకే ఆమె మరణించింది. వృద్ధరాజమాతా, ఆమె పదభ్రష్టునిచేసిన ఆమె మేనల్లుడైన చక్రవర్తీ 1908 నవంబరులో, 24 గంటల తేడాలో, మరణించారు. ఇది వింతకాదూ? ఒక శిశువు ఇప్పుడు నామకః చక్రవర్తి అయినాడు.

మళ్ళీ పార్లమెంటును ఏర్పరచవలసిందని పెద్దగోల బయలుదేరింది. మంచూలపైనీ, చక్రవర్తులపైనీ వ్యతిరేకభావం అతిశయించింది. విప్లవకారులు ప్రబలులైరి. వారిన్ని ఎదుర్కోజాలినవాడు, ఒక రాష్ట్రమునకు రాజప్రతినిధిగా ఉన్న యు అన్–షీ–కై అనువాడు. అతడు జిత్తులమారి వృద్ధజంబుకము. చీనాలో అధునాతనము, సమర్థము అయిన సైన్యబలమొక్కటియే కలదు. అది అతని స్వాధీనములో ఉన్నది. మంచూ పాలకులు అతనిపట్ల చాలా తెలివితక్కువగా ప్రవర్తించిరి. మంచూ రాజులు అతనిని పదభ్రష్టుని చేసిరి. తమ్ము ఈ పరిస్థితులలో కాపాడ గలిగిన ఆ ఒక్క పురుషుణ్ణీ వారు పోగొట్టుకొనిరి. 1911 అక్టోబరులో యాంగ్‌టిసి లోయలో విప్లవము తలయెత్తెను. వెంటనే మధ్య దక్షిణ చీనాలో చాలాభాగము తిరుగబడెను. క్రైస్తవ సంవత్సరాది నాటు ఈ రాష్ట్రములు తిరుగబడి నాంకింగ్ రాజధానిగా ప్రజా ప్రభుత్వ

మును ప్రకటించినవి. డాక్టరు సన్ యట్ సేను అధ్యక్షుడుగా ఎన్నుకోబడెను.

యు అన్-షీ-కై ఈ నాటకమును కనిపెట్టి చూచుచుండెను. తనకు అనుకూలముగా నున్నప్పుడు కలుగజేసికొనుటకు సిద్ధముగా ఉండెను. శిశు చక్రవర్తికి బదులుగా రాజ్యము చేస్తూన్న తండ్రి, యూ ఆన్ ను పదభ్రష్టుని చేయడమూ, మరల అతనిని పిలిపించడము వినోదముగా ఉంటుంది. ప్రాచీన చీనాదేశములో ప్రతికార్యమూ అత్యంత మర్యాదగా చేయడం వాడుక. యూ ఆన్ ను పదభ్రష్టుని చేయవలసి వచ్చినప్పుడు అతడు కాలిజబ్బువల్ల బాధపడుతూన్నాడని ప్రకటింపబడ్డది. అతనికాలికి ఎట్టిజబ్బూ లేదని అందరికీ తెలుసును. ఒకనిని పదభ్రష్టుని చేసేటప్పుడు అవలంబించే ఆచారము మాత్రమే ఇది. యూ అన్ తరువాత కసితీర్చుకొన్నాడు. రెండు సంవత్సరములు గతించిన పిమ్మట 1911 లో ప్రభుత్వమునకు వ్యతిరేకముగా అల్లరులు, తిరుగుబాటు తలయెత్తినప్పుడు శిశు చక్రవర్తి ప్రతినిధి భయభ్రాంతుడై యూ ఆన్ ను రమ్మని కోరెను. తన షరతులు అంగీకరిస్తేనే తప్ప రావడానికి ఉద్దేశములేదు యూ ఆన్ కు. అప్పుడు ప్రయాణముచేయడానికి తనకాలు ఇంకా స్వాధీనములో లేదనిన్నీ, ఇల్లు కదలలేని స్థితిలో ఉన్నాననిన్నీ అతడు ప్రత్యుత్తర మిచ్చాడు. ఒకనెలలో అతనిషరతులు అంగీకరింపబడ్డవి. వెంటనే అతని కాలిజబ్బున్నూ నిమ్మళించింది.

తిరుగుబాటును నిరోధించడానికి అప్పటికే కాలాతీతమైనది. యూ-ఆన్ తెలివైనవాడు కాబట్టి ఏ పక్షమునకూ ఒరగలేదు. చివరకు రాజ్యము త్యజించి పొమ్మని మంచూల కతడు సలహా ఇచ్చాడు. ప్రజాప్రభుత్వము మంచూల నెదుర్కొన్నది. తమ సేనాని తమ్ము వదలిపెట్టినాడు. కాబట్టి మంచూ పాలకులకు గత్యంతరం లేకపోయింది. 1912 ఫిబ్రవరి 12 వ తేదీని రాజ్య పరిత్యాగము చేస్తూన్నట్లు మంచూలు ప్రకటించుకొన్నారు. రెండున్నర శతాబ్దుల పైగా రాజ్యమేలిన మంచూ

రాజవంశము చీనా రంగమునుండి నిష్క్రమించింది. వారిని గురించిన చీనావారి వాక్యమిది—"వారు వ్యాఘ్ర గర్జనముతో వచ్చిరి. పాముతోక వలె మాయమైరి."

ఈ దినమందే—1912 ఫిబ్రవరి—నూతన ప్రజా ప్రభుత్వ రాజధాని యైన నాంకింగ్‌లో ఒక కార్యకలాపము జరిగింది. ఈ పట్టణములో మొదటి మింగ్ చక్రవర్తి సమాధి కలదు. ఈ కార్యకలాపమున ప్రాచీన. అధునాతనముల వ్యత్యాసము వెల్లడి అయ్యెను. ప్రజాప్రభుత్వ అధ్యక్షుడు సన్-యట్-సేను తన మంత్రివర్గముతో సమాధివద్దకుపోయి ప్రాచీన సంప్రదాయాను సారముగా ఉపహారముల నర్పించెను. ఈ సందర్భమున ఉపన్యసిస్తూ అతడిట్లు చెప్పెను-"ప్రజా ప్రభుత్వమును స్థాపించి తూర్పు ఆసియాకు మనము మార్గమును చూపుచున్నాము, పురుష ప్రయత్నము చేసేవారికి విజయము నేడో, రేపో వస్తుంది. ధర్మశీలులకు చివరకు విజయము తప్పదు. అనుకున్నంత త్వరలో కృతకృత్యులము కాలేదని ఎందుకు మనము దుఃఖించడం ?"

చీనాదేశ స్వాతంత్ర్యమునకై అనేక సంవత్సరములు, డాక్టర్ సన్ ఇంటివద్దనున్నా, ప్రవాసములోనున్నా పాటుపడ్డాడు. చివరకు విజయము చేజిక్కినట్లే కనిపిస్తుంది. కాని స్వేచ్ఛ ఉండుండీ చేతినుంచి జారిపోతుంది. చెల్లించవలసినదంతా చెల్లిస్తేనేకాని విజయము చేజిక్కదు. వ్యర్థాశలపాలుచేసి అది మనలను పరిహాసము చేస్తుంది. కష్టములపాలు చేసి మనలను శోధిస్తుంది. చీనా ప్రయాణమూ, డాక్టరు సూన్ ప్రయాణమూ ఇంకా ముగియలేదు. అనేక సంవత్సరములపాటు ప్రజా ప్రభుత్వము ప్రాణములు నిలుపుకొనుటకు పోరాడవలసివచ్చింది. 21 సంవత్సరములు గడచినా, యుక్తవయస్సు రాదగ్గ కాలము వచ్చినా, నేడు సైతము చీనాదేశ భావి అనిర్దిష్టముగానే ఉన్నది.

మంచూలు రాజ్యపరిత్యాగము చేసిరి. కాని యూఅన్ ప్రజా ప్రభుత్వమునకు ప్రతిబంధకమై నిలిచెను. అతడేమి చేయదలుచుకొన్నదీ

ఎవ్వరికీ తెలియదు. చీనా ఉత్తర భాగమునూ, దక్షిణమందలి ప్రజా ప్రభుత్వమునూ అతడు స్వాధీనములో పెట్టుకొనెను. శాంతి నాసించినన్ని, అంతః కలహములు లేకుండా చేయుటకున్నూ డాక్టరు సన్ అధ్యక్ష పదవిని వదులుకొని యూ-అన్-షి-కైకు అధ్యక్ష పదవి ఇప్పించాడు. తాను మరుగుకు పోయాడు. కాని యూ-అన్ ప్రజాప్రభుత్వవాది కాడు. ఆత్మోత్కర్షకై అధికారము నార్జించుటకతడు పూనుకొనెను. తనను అధ్యక్షునిగా చేసి గౌరవించిన ప్రజా ప్రభుత్వమునే విధ్వంసము చేయుట కతడు విదేశ జాతులనుండి అప్పులు పుచ్చుకొనెను. పార్లమెంటునతడు రద్దుచేసెను. కూ-మిన్-టాంగ్‌ను నిలిపివేసెను. దీనివల్ల దేశములో చీలిక ఏర్పడెను. దక్షిణమున డాక్టరు సూన్ నాయకత్వమున పోటీగా వేరొక ప్రభుత్వము స్థాపించబడెను. డాక్టరు సన్ ఎట్టి చీలికా రాకూడదని శాయశక్తులా ప్రయత్నించినా అది వచ్చినది. ప్రపంచయుద్ధము ప్రకటింప బడ్డప్పుడు చీనాలో రెండు ప్రభుత్వములుండెను. యూ అన్ చక్రవర్తి అగుటకు ప్రయత్నించెను. కాని కాలేకపోయెను. వెంటనే అతడు చనిపోయెను.

## 119

# మహా హిందూస్థానము : తూర్పు ఇండీసు దీవులు

డిశంబరు 31, 1932

దూర ప్రాచ్య విషయములను ప్రస్తుతము విరమింతము. 19 వ శతాబ్దిలో ఇండియా ఎట్లుండెనో కొంతవరకు చూచితిమి. మనమిక పడమరగా యూరోపు, అమెరికా, ఆఫ్రికాలకు పోవలసి ఉన్నది. ఈ దీర్ఘ ప్రయాణము చేయుటకు ముందు, ఆసియా ఆగ్నేయ భాగమును గురించి కొంత చెప్పెదను. నేటి కాలమువరకూ దాని చరిత్ర తెచ్చినట్లు

అవుతుంది. ఈ దేశముల చరిత్ర పరామర్శించి చాలాకాలమైనది. వెనుకటి జాబులు కొన్నింటిలో వాటిని మలేసియా అనీ, ఇండొనేషియా అనీ తూర్పు ఇండీసు అనీ, మహా ఇండియా అనీ కొంత సందిగ్ధముగా, వేర్వేరు నామములతో పేర్కొని ఉంటిని. అట్లాచేయుట సరికాదేమో? ఇందు ఏ ఒక పేరూ ఆ ప్రదేశమున కంతకూ సరిపోదని తోస్తుంది. కాని మన అభిప్రాయములు మనకు అవగతమగుచున్నప్పుడు పేరులో ఏమున్నది?

నీవద్ద దేశపటముంటే దానినొకమారు చూడుము. ఆసియాకు ఆగ్నేయమున ఒక ద్వీపకల్పము కనిపిస్తోంది. అందు బర్మా, సయాం, ఫ్రెంచి-ఇండోచీనా అని నేడు పేర్కొంటూన్న దేశము లున్నవి. బర్మా, సయాముల మధ్యనుండి నాలుకవంటి ఒక సన్నని భూభాగము వెలువడి చివరకు వెడల్పు అగుచున్నది. దీని చివర సింగపూరున్నది. ఇది మలయా ద్వీపకల్పము. మలయా ఆస్ట్రేలియాల మధ్య అనేక ద్వీపములు చిన్నవీ, పెద్దవీ కలవు. ఈ ద్వీపములు వింత వింత ఆకారములతో ఉన్నవి. ఆసియా, ఆస్ట్రేలియాలను కలుపుతూ మధ్య కట్టిన పెద్ద వంతెనయొక్క శిధిలమువలె అవి ఉన్నవి. ఈ ద్వీపములే తూర్పు ఇండీసు దీవులు. వీటికి ఉత్తరమున ఫిలిప్పైను దీవులున్నవి. ఈ కాలపు మ్యాపు చూచినట్లయితే బర్మా, మలయాలు బ్రిటిషు పాలన మందున్నట్లు నీవు తెలిసికోగలవు. ఇండోచీనా ఫ్రెంచివారి పాలనమందున్నది. మధ్యనున్న సయాం స్వతంత్రదేశము. తూర్పు ఇండీసు దీవులు—అనగా సుమిత్రా, జావా, బోర్నియోలో చాలాభాగము, సెలిబిస్, మొలకస్ దీవులు డచ్చివారివి. వీటినే సంబారద్రవ్య దీవులంటారు. వేలకొద్ది మైళ్ళు, ప్రమాదముతో కూడుకొన్న సముద్ర ప్రయాణములు యూరోపు నావికులు చేసినది ఈ దీవులకొరకే. ఫిలిపైను దీవులు అమెరికనుల అధికారములో ఉన్నవి.

తూర్పు సముద్రములకు చెందిన ఈ దేశముల ప్రస్తుత పరిస్థితు

లివి. కాని 2000 సంవత్సరములకు పూర్వము హిందూదేశ సంతానము అచ్చటికి పోయి అధినివేశము లేర్పరుచు కొన్నట్లు చెప్పితిని జ్ఞాపక మున్నదా? దీర్ఘకాలముపాటు మహా సామ్రాజ్యములు అచ్చట వర్ధిల్లిన వనీ, అందమగు కట్టడములతో సుందరమగు నగరములందు విలసిల్లిన వనీ, వర్తక వ్యాపారము లభివృద్ధి చెందినవనీ, హైందవ చైనీయ సంస్కృతి నాగరికతలు అచ్చట పెనవేసుకొని పోయినవనీ చెప్పి యుంటిని జ్ఞాపకమున్నదా?

ఈ దేశములకు సంబంధించిన వెనుకటి జాబులో (79) పోర్చు గీసుల ప్రాచ్య సామ్రాజ్యము పతనమైనట్లూ, బ్రిటిషు, డచ్చి తూర్పు ఇండియా వర్తక సంఘములు తలయెత్తినట్లూ చెప్పియుంటిని. ఫిలిప్పైను లలో స్పానియర్డులు ఏలుచుండిరి.

బ్రిటిషువారును, డచ్చివారును కలిసి పోర్చుగీసులను ఓడించి తరిమివేసిరి. కాని ఈ విజేతులకు అన్యోన్య ప్రేమ లేదు. వారు తరుచు కలహించు కొనుచుండిరి. ఒకమారు, 1623 లో, మొలకసు దీవిలోని అంబోయినా గవర్నరు, డచ్చివాడు, బ్రిటిషు తూర్పు ఇండియా వర్తక సంఘమందలి ఉద్యోగస్థుల నందరినీ పట్టుకొని వారిని ఉరి తీయించాడు. డచ్చి ప్రభుత్వముపై కుట్రపన్నుచున్నారని, వారిపై మోపబడిననేరము. ఈ సంఘ సంహారమునకు "అంబోయినా జనసంహార"మని పేరు.

ఒక విషయము నీవు జ్ఞాపకముంచుకోవలెను. ఈ విషయమై వెనుకటి జాబులలో చెప్పి ఉంటిని. ఈ కాలమున—అనగా 17 వ శతాబ్ది తదనంతరము యూరోపు పారిశ్రామిక దేశముకాదు. ఎగుమతికోసమని విస్తారముగా సరుకునది తయారు చేయుటలేదు. మహా యంత్రమూ, పారిశ్రామిక విప్లవమూ ఇంకా చాలా దూరములో ఉన్నవి. యూరోపు కంటె ఆసియా ఎక్కువగా సరుకును తయారు చేస్తూ, ఎగుమతి చేస్తూం డేది. ఆసియాలో తయారైన సరుకు యూరోపు వెళ్ళినప్పుడు వాటి ఖరీదు కొంత స్పానిష్ అమెరికానుంచి వచ్చిన డబ్బుతోనున్నూ, కొంత

యూరోపియన్ సరుకుతోనూ చెల్లించేవారు. ఆసియా యూరోపులమధ్య జరిగిన ఈ వర్తకము లాభసాటిగా ఉండెను. అది చాలాకాలముపాటు పోర్చుగీసు వారి స్వాధీనములో ఉండెను. తత్కారణమున వారు భాగ్యవంతులైరి. తామున్నూ, వర్తకములో పాల్గొనడానికి బ్రిటిష్, డచ్చి తూర్పు ఇండియా సంఘములు స్థాపించబడినవి. కాని పోర్చుగీసువారీ వర్తకమును తమ సొంత హక్కుగా భావించుటచేత ఇతరు లిందు పాల్గొనుట వారికి సమ్మతిగాలేదు. ఫిలిప్పైను దీవులలో ఉన్న స్పాని యర్డులతో వారికేమీ పేచీలేదు. స్పానియర్డులకు వర్తకముమీదకంటె మతముమీద ఎక్కువ ప్రీతి. కొత్త వర్తక సంఘముల తరపున వచ్చిన బ్రిటిషు, డచ్చి సాహసికులకు మత ప్రసక్తి లేదు. త్వరలోనే వారికి పేచీలు వచ్చినవి.

ప్రాచ్యమున పోర్చుగీసులు 125 సంవత్సరములుపైగా పాలకులుగా ఉండిరి. పాలితుల ఆమోదమును పాలకులు పొందలేదు. అందువల్లవారు అసంతృప్తితో ఉండిరి. ఇంగ్లాండు, హాలండు దేశముల నూతన వర్తక సంఘములు రెండూ ఈ అసంతృప్తిని పురస్కరించుకొని పోర్చుగీసు పాలనమును వదుల్చుకొనుటకు ప్రజలకు సహాయము చేసిరి. వెంటనే పోయిన పోర్చుగీసుల స్థానమున తాము ప్రవేశించిరి. ఇండియా పాలకులున్నూ, తూర్పు ఇండీసు పాలకులున్నూ ప్రజలనుండి విశేషముగా పన్నులు వసూలు చేయుచుండిరి. యూరోపుకు ఎక్కువ భారము కలుగకుండా విదేశ వర్తకమును సాగించుటకిది సహాయకారిగా ఉండెను. ఇదివరలో, తూర్పు దేశములనుండి వచ్చిన సరుకును కొనుక్కొనుటకు యూరోపు శ్రమపడుచుండెను. ఇప్పుడది తగ్గినది. ఇండియన్ వస్తువులను కొనరాదని నిషేధించిన్నీ, పన్నులు విశేషముగా వాటిపై వేసిన్నీ అవి తమ దేశము రాకుండా చేయడానికి ఇంగ్లాండు ప్రయత్నించింది. పారిశ్రామిక విప్లవము వచ్చువరకున్నూ పరిస్థితు లీవిధముగా ఉండెను.

తూర్పు ఇండీసులలో డచ్చివారికిన్నీ, బ్రిటిషువారికిన్నీ కలిగిన తగాదా చిరకాలముండలేదు. ఇందుకు కారణము బ్రిటిషువారు ఆ వ్యవహారమునుండి తప్పుకొనడమే. వారికి ఇండియాలో చేతినిండా పని ఉండుటవల్ల అట్లుచేశారు. కాబట్టి ఈ తూర్పుఇండియన్ దీవులు పూర్తిగా డచ్చి తూర్పు ఇండియా సంఘమువారికే వదలిపెట్టబడ్డవి. ఫిలిప్పైను దీవులు మాత్రము స్పానిష్‌వారి అధీనములోనే ఉంటూవచ్చెను. స్పానిషి వారికి వర్తకంమీద మోజు లేదు. నూతన దేశాలను జయించవలెననే ప్రయత్నములేదు. కాబట్టి ఈ ప్రదేశములో డచ్చివారికి ప్రతిస్పర్థ లిప్పు డెవ్వరున్నూ లేరు.

బ్రిటిషు తూర్పుఇండియా సంఘమువలెనే డచ్చి తూర్పుఇండియా సంఘముకూడా చేజిక్కినంత డబ్బు సంపాదించవలెనని పూనుకొనినది. 150 సంవత్సరములకాలము ఈదీవుల నీవర్తకసంఘము పరిపాలించెను. ప్రజా క్షేమము వారెంతమాత్రమూ చూడలేదు. వారిని పీడించి వారి వద్దనుంచి ఎంతకప్పము వసూలుచేయుటకు వీలుంటుందో అంతా వసూలు చేసేవారు. కప్పములద్వారా డబ్బు సులభముగా వస్తూన్నప్పుడు ఇక వర్తకముతో పనియేమిటి? కాబట్టి అది సన్నగిల్లింది. ఈ సంఘము ఎంతమాత్రము సమర్థముగా పనిచేయలేదు. అందు పనిచెయ్యడానికి వెళ్ళిన డచ్చివారు ఇండియాలో బ్రిటిషు కంపెనీలో పనిచేయడానికివచ్చిన ఏజెంట్లవలెనే అధర్మ ప్రవృత్తిగల సాహసికులు. న్యాయముగానో, అన్యాయముగానో డబ్బు సంపాదించడమే వారికి ముఖ్యముగా కావలసినది. ఇండియా ధనవంతమైన దేశమగుటవల్ల దుష్పరిపాలన మంతగా పైకిరాదు. మరిన్నీ ఇండియాలో సమర్థులగు బ్రిటిషు గవర్నర్లుకొందరు ఉన్నతోద్యోగములు సమర్థముగా నిర్వహించు వారిచేతులలో పెట్టిరి. అయినా అడుగుననున్న ప్రజానీకమునకు బాధలు తప్పలేదు. కాని 1857 లో జరిగిన గొప్ప తిరుగుబాటు ఫలితముగా బ్రిటిషు తూర్పు ఇండియా సంఘము అంతరించిందని నీకు జ్ఞాపక ముండవచ్చు.

డచ్చి తూర్పు ఇండియా సంఘముయొక్క పరిపాలనము ఆనాటి కానాడుమరింత దుష్టము కాజొచ్చెను. చివరకు 1798లో తూర్పు దీవుల పరిపాలనము నెదర్లాండుల ప్రభుత్వము స్వయముగా నడుపుటకు ప్రారంభ మాయెను. కొద్ది కాలములోనే యూరోపులో నెపోలియన్ యుద్ధముల కారణముగా హాలెండు నెపోలియన్ సామ్రాజ్యములో చేరెను. కాన ఇంగ్లీషు ప్రభుత్వము ఈ దీవులను తమ స్వాధీనము చేసుకొనిరి. 5 సంవత్సరములపాటు ఈ దీవులు బ్రిటీషు ఇండియాయొక్క ఒక రాష్ట్రముగా పరిగణింపబడెను. ఈ కాలమున గొప్ప సంస్కరణములు ఈ దీవులలో ప్రవేశపెట్టబడెను. నెపోలియన్ పతనానంతరము తూర్పు ఇండియాదీవులు హాలెండుకు తిరిగి ఇచ్చివేయబడెను. బ్రిటిషు ఇండియా గవర్నమెంటు పరిపాలనలో జావాద్వీపమున్న అయిదు సంవత్సరముల కాలములో థామస్ స్టాంఫర్డు రాఫిల్సు అను సమర్థుడగు ఇంగ్లీషువాడు జావాకు లెఫ్టినెంటు గవర్నరుగా ఉండెను. డచ్చివారి అధినివేశ పరిపాలనా చరిత్ర "ద్రోహము, లంచగొండితనము, హత్యలు, నీచత్వములకు సహోదరముగా ఉండె"నని రాఫిల్సు వ్రాసిఉన్నాడు. సెలిబీసు దీవిలోని ప్రజలను అపహరించి తెచ్చుటకు డచ్చి ఉద్యోగస్థులు తగిన ఏర్పాట్లు చేసేవారట. అట్లు అపహరింప బడ్డవారిని బానిసలుగా జావాలో ఉపయోగించేవారు. అపహరణములతోపాటు విధ్వంసము, హత్యలూ జరిగేవి.

కంపెనీపరిపాలనకన్న నెదర్లాండుల ప్రభుత్వపరిపాలనము మెరుగుగా లేదు. కొన్నివిధములుగా చూచినప్రజలకది మరింత పీడాకరముగా ఉండెను. బెంగాలులో నీలిమందు తోటల పద్ధతిని గురించి నీకు చెప్పియున్నాను. దానివల్ల వ్యవసాయదారులు చాలా బాధపడ్డారు. దీనిని పోలిన ఇంతకన్న పాడు విధానము జావాలోనూ, ఇతరచోట్లా ప్రవేశపెట్టబడింది. కంపెనీ పాలించే దినములలో ప్రజలు కావలసిన సరుకు సరఫరా చెయ్యవలసి ఉండేది. ఇప్పుడు ప్రవేశపెట్టబడిన నూతన

విధానమునకు "కల్చరు విధానమ"ని పేరు. దీని ప్రకారము ప్రతి సంవత్సరమూ వ్యవసాయదారులు కొంత కాలముపాటు ఇష్టమున్నా, లేకున్నా పనిచెయ్యాలి. వ్యవసాయదారుడు పనిచేసుకొనే కాలములో మూడవ భాగమో, నాల్గవ భాగమో గవర్నమెంటువారికోసం పనిచెయ్యవలెనన్న మాట. క్రియకు వచ్చినప్పుడు తరుచు తన కాలమునంతా వ్యవసాయదారుడెందుకొరకై వినియోగింపవలసి వచ్చేది. డచ్చి ప్రభుత్వము కంట్రాక్టర్ల ద్వారా పనిచేయించుకొనేది. అది కంట్రాక్టర్లకు వడ్డీలేకుండా కొంత మొత్తము అడ్వాంసుగా ఇస్తూండేది. ఈ కంట్రాక్టర్లు బలవంతముగా వ్యవసాయదారులచేత పనిచేయించేవారు. పండినపంట నిర్ణయింపబడ్డ నిష్పత్తి ప్రకారము ప్రభుత్వమూ, కంట్రాక్టరూ, వ్యవసాయదారుడూ పంచుకోవాలనే ఏర్పాటు. బహూశా వ్యవసాయదారుడి వాటా అందరికంటె చాలా తక్కువై ఉండి ఉంటుంది. అది ఎంతో నాకు సరిగా తెలియదు. యూరోపుకు కావలసిన తేయాకూ, కాఫీ, చక్కెర, నీలిమందు మున్నగు పదార్థములు కొన్ని కొంత భూమిలో పండించవలసి ఉంటుందని గవర్నమెంటు ఉత్తరువుకూడా చేశారు. బెంగాలులోని నీలిమందు తోటలవలెనే ఇవిన్నీ వ్యవసాయదారునికి లాభము తక్కువైనా పండించి తీరవలసినదే.

డచ్చి ప్రభుత్వము అమిత లాభములను పొందెను. కంట్రాక్టర్లు భాగ్యవంతులైరి. వ్యవసాయదారులకు తిండిలేదు. హీనస్థితిలోఉండిరి. 19 వ శతాబ్ది మధ్య భాగములో దారుణ క్షామము సంభవించెను. ప్రజలు బహు సంఖ్యాకులు మరణించిరి. హీనస్థితిలోనున్న వ్యవసాయదారుని పరిస్థితి బాగుపరచడానికి ఏమైనా చెయ్యవలసి ఉంటుందనే బుద్ధి అప్పుడు కలిగింది. మెల్ల మెల్లగా అతని స్థితి బాగుపడ జొచ్చింది. అయినా 1916 లో సైతము వ్యవసాయదారునిచేత బలాత్కారముగా పని చేయించుకోవడమున్నది.

19 వ శతాబ్ది చివర భాగములో విద్యాసంస్కరణములూ, ఇతర

సంస్కరణములూ డచ్చివారు ప్రవేశపెట్టిరి. ఒక నూతన మధ్యతరగతి తలయెత్తి పెరిగింది. జాతీయోద్యమము స్వాతంత్ర్యమును కోరింది. ఇండియాలోవలెనే మందగతితో సంస్కరణములు ప్రవేశపెట్టబడ్డవి. దుర్బల శాసనసభలు స్థాపించబడ్డవి. కాని వాటికి నిజమైన అధికారమేమీ లేదు. అయిదు సంవత్సరముల క్రితము డచ్చి తూర్పు ఇండీసులో ఒక విప్లవము జరిగినది. దానిని మిక్కిలి క్రౌర్యముతో అణచివేసిరి. కాని జావాలోనూ, ఇతర ద్వీపములలోనూ తలయెత్తిన స్వాతంత్ర్య భావమును ఎట్టి క్రౌర్యమున్నూ, ఎట్టిహింసయున్నూ తుదముట్టింపలేవు.

డచ్చి తూర్పుఇండీసును నేడు నెదర్లాండుల ఇండియా అంటారు. ప్రతి పక్షము రోజులకూ హాలెండునుంచి యూరోపు, ఆసియాలమీదుగా జావాలోని బటేవియాకు విమానములు వచ్చుచుండెను.

తూర్పు ఇండియన్ దీవుల సంగ్రహ చరిత్ర పూర్తి అయినది. ఇప్పుడు నేను ఆసియాకు పోదలచితిని. బర్మాను గురించి చెప్పదగ్గది ఆట్టేలేదు. ఉత్తర ప్రాంతమువారూ, దక్షిణ ప్రాంతమువారూ తరుచు ఆ దేశాన్ని పంచుకొన్నారు. వారిద్దరూ పోరాడుతూ ఉండే వారు. ఒకొక్కమారు ప్రబలుడగు రాజొకడు తలయెత్తి ఉత్తర దక్షిణములకు ఐక్యత కల్పించి పొరుగున ఉన్న సయాం ను జయించుటకుకూడా సాహసించెను. 19 వ శతాబ్దిలో బ్రిటిషువారితో కలహములు తటస్థించెను. తాను ప్రబలుడను విశ్వాసముతో బర్మారాజు అస్సాముపై దండెత్తి దానిని తన రాజ్యములో కలుపుకొనెను. తరువాత 1824 లో బ్రిటిషువారితో మొదటి బర్మా యుద్ధము తటస్థించెను. అప్పుడు అస్సాము బ్రిటిషువారి స్వాధీనమయ్యెను. బర్మా ప్రభుత్వమున్నూ, సైన్యమున్నూ దుర్బలముగా నున్నట్లు బ్రిటిషువారిప్పుడు కనిపెట్టిరి. బర్మానంతనూ కలుపుకొనవలెనని వారికి బుద్ధిపుట్టెను. తెలివితక్కువ సాకులు కల్పించి రెండవ మూడవ బర్మా యుద్ధములు బ్రిటిషువారు చేసిరి. 1885 అగు సరికి బర్మా రాజ్యమంతా కలుపుకోబడెను. ఇది బ్రిటిషు ఇండియన్

సామ్రాజ్య భాగమైనది. నాటినుండీ బర్మా జాతకము ఇండియా జాతకముతో ముడివడినది.

బర్మాకు దక్షిణముననున్న మలయా ద్వీపకల్పములోనికి బ్రిటిషు వారు వ్యాపించిరి. 19వ శతాబ్ది తొలి రోజులలో వారు సింగపూరు ద్వీపమును స్వాధీనము చేసికొనిరి. అనుకూల స్థానమునందుండుటచేత అది గొప్ప వ్యాపార నగరమైనది. దూర ప్రాచ్యమునకు పోయే ప్రతీ ఓడా సింగపూరు రేవులో ఆగేది. ఆ ద్వీపకల్పములోనే ఇంకను ఎగువ నున్న మలక్కా అనే పాతరేవు పట్టణము క్షీణించింది. సింగపూరు నుంచి బ్రిటిషువారు ఉత్తరముగా వ్యాపించ మొదలుపెట్టిరి. మలయా ద్వీపకల్పములో అనేక చిన్న రాజ్యములుండెను. అవి చాలావరకు సయాంకు సామంతరాజ్యములుగా ఉండెను. శతాబ్దాంతమున కీ రాజ్యము లన్నీ బ్రిటిషువారి రక్షిత రాజ్యములైనవి. వాటి నన్నింటినీ చేర్చి ఒక విధమగు సంయుక్త రాజ్యమును చేసిరి. దీనినే "సంయుక్త, మలయా రాజ్యములం"దురు. ఈ రాజ్యములు కొన్నింటిలో తనకున్న హక్కుల నన్నిటినీ సయాం ఇంగ్లీషు వారికి ధారపోసింది.

ఈ విధముగా సయాంచుట్టూ యూరోపియన్ జాతులు చేరిరి. బర్మాలోనూ, మలయాలోనూ దక్షిణ ప్రాంతమునా, పశ్చిమ ప్రాంత మునా ఇంగ్లాండు సర్వాధికారియై ఉండెను. తూర్పు ప్రాంతమున ఫ్రాంసు ఆక్రమణ చేస్తూ, అన్నాంను కబళిస్తూ ఉండెను. అన్నాం, చీనా ఆధీశ్వ రత్వము నంగీకరించెను. కాని చీనా చిక్కులలో తగుల్కొని ఉండుట వల్ల దానివల్ల ప్రయోజనము లేకపోయెను. అన్నాంపై ఫ్రెంచివారు దండయాత్ర సాగించినందుకుగాను ఫ్రాంసు చీనాలు తలపడ్డారని చీనాను గురించి వ్రాసిన జాబులో నీకు చెప్పాను జ్ఞాపకమున్నదా? ఫ్రాంసుకు కొద్దిగా విరోధం కలిగింది. గాని అది అట్టేకాలం నిలువలేదు. 19వ శతాబ్ది రెండవభాగములో ఫ్రాంసు ఒక గొప్ప అధినివేశమును స్థాపించు కొన్నది. దానిపేరు ఫ్రెంచి ఇండోచీనా. అందు అన్నాం, కంబోడియాలు

చేరి ఉన్నవి. ప్రాచీన కాలమున వైభవోపేతమగు అంగ్‌కోరు సామ్రా జ్యము కంబోడియాలో వర్ధిల్లినది. కంబోడియా, సయాం సామంత రాజ్యము. సయాంను యుద్ధము పేరుచెప్పి బెదిరించి ఫ్రాంసు, కంబోడి యాను తన వశము చేసుకొనెను. ఈ దేశములలో తొలి రోజులలో ఫ్రెంచివారు చేసిన కుట్రలన్నీ ఫ్రెంచి మిషనరీల ద్వారానే జరిగినవన్న మాట గమనించవలసిన విషయము. ఏదో కారణమున ఒక ఫ్రెంచి మిషనరీకి మరణదండన విధింపబడెను. ఇందుకు పరిహారముగా 1857లో మొదటిసారి ఫ్రెంచి దండయాత్ర సాగెను. ఈ దండయాత్రకు ఫలిత ముగా దక్షిణముననున్న సైగాన్ రేవు పట్టణము ఫ్రెంచివారి వశ మయ్యెను. అప్పటినుండి ఫ్రెంచివారు ఉత్తరదిక్కుగా తమ అధికార మును వ్యాపింప జేసికొనిరి.

ఆసియా దేశములలో సామ్రాజ్యవాదులు చేసిన ఆక్రమణకు సంబం ధించిన క్షుద్ర కథలు చెప్పేటప్పుడు పునరుక్తి దోషానికి లోనౌతూ ఉంటాను. ప్రతీ చోటా వారవలంబించే పద్ధతులు దాదాపు ఒకటే. ప్రతీ చోటా వారు కృతకృత్యులైనారు. ఒక్కొక్క దేశాన్ని గురించీ నేను చెప్పి ఇప్పటిమట్టుకు కథ ముగించాను. ఏదో ఒక యూరోపియన్ జాతి స్వాధీనములో ఈ దేశములున్నవి. ఆసియా ఆగ్నేయ భాగమందున్న ఒక్క దేశముమాత్రము ఈ అవస్థనుంచి తప్పించుకొన్నది. అదిసయాం.

బర్మాలో ఇంగ్లాండూ, ఇండోచీనాలో ఫ్రాంసూ జాతుల మధ్య ఇరుకుకొన్న సయాం తప్పించుకొన్నదంటే అందుకు దాని అదృష్టమే కారణము. ప్రతిస్పర్ధులైన రెండు యూరోపియన్ జాతులు తనకు కుడి భాగమందూ, ఎడమ భాగమందూ ఉండుటవల్లనే అది తప్పించుకొన్నది. అంతేకాదు. దాని అదృష్టమునకు కారణము దేశము చక్కగా పరి పాలింప బడుట. ఇతర దేశములలోవలె అల్లరులు లేకుండుట. అయితే విదేశ దండయాత్రలకు సత్పరిపాలనము అడ్డువచ్చేదికాదు. అసలు సంగతి ఏమిటంటే ఇండియా, బర్మాలలో ఇంగ్లాండు మునిగి తేలు

తోంది. ఇండో చీనాలో ఫ్రాంసూ అంతే. పందొమ్మిదో శతాబ్దాంత మున వారుభయులూ సయాం పొలిమేరలు చేరుకొనేటప్పటికి, దేశము లను కలుపుకొనే రోజులు వెళ్ళిపోతున్నాయి. ప్రాచ్యమున నిరోధ భావము తలయెత్తుతోంది. అధినివేశములలోనూ, పరాధీన రాజ్యముల లోనూ జాతీయోద్యమములు ప్రారంభ మవుచున్నవి. కంబోడియా విషయమై సయాం, ఫ్రాంసులు యుద్ధమునకు దిగేటట్లు ఉండిరి. సయాం ఫ్రాంసుతో కలహము పెట్టుకోక వెనుకకు తగ్గింది. పడమటనున్న పర్వత శ్రేణులు బర్మాలోని బ్రిటిషు వారినుండి సయాంను కాపాడినవి.

వెనుకటి కాలములో అధమపక్షము రెండుసార్లు బర్మా రాజులు సయాంపై దండయాత్రలు చేసేరనిన్నీ, దానిని ఆక్రమించుకొన్నారనీ కూడా నీకు చెప్పియుంటిని. 1767లో చిట్టచివర దండయాత్ర జరిగెను. అప్పుడు సయాం రాజధాని అయూధియా (అయోధ్య) నాశనము చేయ బడ్డది (హిందూదేశపు పేర్లు గమనించితివా ?) వెంటనే ప్రజలు తిరుగు బాటుచెసి బర్మావారిని తరిమివేసిరి. ఒక నూతన రాజవంశము 1782లో రామ I అనే రాజుతో ప్రారంభమాయెను. నేడుకూడా, అనగా 150 సంవత్సరముల తరువాత, ఆ రాజవంశమే సయాంను ఏలుచున్నది. అందలి రాజులూ రామనామాంకితులే అని తోస్తుంది. ఈ నూతన రాజ వంశము సయాంను చక్కగా పాలించెను. ప్రజలను బిడ్డలుగా వారు చూచుకొనిరి. విదేశ జాతులతో సద్భావముతో నుండుటకు వారు ప్రయ త్నించిరి. ఇది చాలా తెలివైనపని. విదేశ వర్తకులు రేవుపట్టణము లను వర్తకమునకై వినియోగించవచ్చును. విదేశజాతులు కొన్నింటితో వర్తకపు సంధులు చేసికోబడెను. పరిపాలనలో కొన్ని సంస్కరణములు ప్రవేశపెట్టబడెను. బాంగ్‌కాక్ నూతన రాజధాని అయ్యెను. సామ్రాజ్య వాద వృకములను దూరముగానుంచుటకు ఇది చాలకపోయెను. ఇంగ్లాండు, మలయాలో వ్యాపించి అచ్చటి సయాంవారి దేశమును తీసుకొనెను. తూర్పున ఉన్న కంబోడియాను, ఇతర సయాం దేశములను ఫ్రాంసు

పుచ్చుకొనెను. 1896 లో సయాం విషయమై ఇంగ్లాండు, ఫ్రాంసులు యుద్ధమువరకూ వచ్చిరి. కాని సామ్రాజ్యవాదుల సంప్రదాయాన్ని అనుసరించి వారు ఇకముందు సయాంకు చెందిన దేశముల జోలికి పోకుండా వాటి ఐక్యతను కాపాడుటకు ఒడంబడిక చేసుకొనిరి. చేసుకొంటూ ఆ దేశమును మూడు "పలుకుబడి ప్రదేశములు"గా విభజించిరి. తూర్పు భాగము ఫ్రెంచివారి పలుకుబడి ప్రదేశము. పడమటిభాగము బ్రిటిషు వారి పలుకుబడి ప్రదేశము. రెంటికీ మధ్యనున్నది తటస్థ ప్రదేశము. దీనిని ఉభయదేశములూ నొల్లుకొనవచ్చును. సయాం ఐక్యతను త్రికరణ శుద్ధిగా కాపాడుటకు ఒప్పుకొన్న కొద్ది సంవత్సరముల తరువాత ఫ్రాంసు తూర్పుననున్న కొంత ప్రదేశమును తీసుకొనెను. కాబట్టి ఇంగ్లాండు కూడా అందుకు పరిహారముగా దక్షిణమునున్న కొంత ప్రదేశము కబళించెను.

అయినప్పటికీ సయాంలో కొంత భాగము ఇప్పటికీ యూరోపియన్ అధికారమునుండి తప్పించుకొన్నది. ఆసియా ఈ భాగములో అట్లు తప్పించుకొన్న దేశమది ఒకటే. యూరోపియన్ ఆక్రమణ నేటికి నిరోధింపబడినది. ఆసియాలో ఇంకా ఎక్కువ ప్రదేశములు సంపాదించే యోగము యూరోపు కికలేదు. ఆసియాలోని యూరోపియన్ జాతులు మూటాముల్లే కట్టుకొని ఇంటికి పోవలసిన రోజులు సమీపిస్తున్నవి.

మొన్నటివరకూ సయాం నిరంకుశాధికారము చెలాయించే ఏకాధిపత్యము. కొన్ని సంస్కారణలు ప్రవేశపెట్టినప్పటికీ ఫ్యూడల్ విధాన వాసన బలీయముగానే ఉన్నది. కొన్ని నెలలకు పూర్వము అక్కడొక విప్లవము లేచెను. అది శాంతముగానే జరిగెను. మధ్య తరగతులలో పై మెట్టున నున్నవారు ముందుకు వచ్చిరి. ఒక విధమగు పార్లమెంటు అక్కడ స్థాపించబడ్డది. రామ I రాజవంశమునకు చెందిన రాజు ఈ మార్పు నంగీకరించెను. అది తెలివైన పని. కావుననే రాజ వంశము నిలిచినది. ఈ విధముగా సయాం ఇప్పుడు నియమ బద్ధైకాధిపత్యమైనది.

ఆసియాకు ఆగ్నేయమునసున్న వేరొకదేశమును గూర్చి మనము తెలిసికోవలసి ఉన్నది. అది ఫిలిప్పైన్సు దీవులు. ఈ జాబులో వాటిని గురించి కూడా వ్రాయవలెననుకొన్నాను. గాని కాలాతీతమైనది. నాకు బడలిక వచ్చింది. జాబు ఇప్పటికే పెద్దదయింది. ఈ యేటికి —1932— ఇదే నీకు వ్రాసే తుది జాబు. పాతసంవత్సరముకు రోజులు నిండినవి. అది మరణావస్థలో ఉన్నది. ఇక మూడు గంటలలో అది మరణించును. ఇక మిగిలేది గత కాలస్మృతి మాత్రమే.

## 120
# ఇంకో సంవత్సరాది

సంవత్సరాది, 1933

ఈ దినము సంవత్సరాది. సూర్యునిచుట్టూ భూమి ఇంకొక ఆవృత్తి తిరిగింది. అవకాశముగుండా వేగముగా పోతూ భూమి ప్రత్యేక దినములనూ, సెలవు దినములనూ పరిగణించదు. దానిమీద పాకే లెక్కలేని మానవ కీటకములను—ఒకరితో ఒకరు పోట్లాడుకొంటూ, తెలివితక్కువ అహంకారముతో ఈ స్త్రీ, పురుషులు తామే భూమికి ఉప్పు వంటివారమనుకొంటూ, విశ్వానికి మూలవిరాట్టుల మనుకొంటూ విర్రవీగే మానవ కీటకములనది లెక్కపెట్టదు. భూమి తన బిడ్డలను ఉపేక్షిస్తుంది. కాని మనము మనలను ఉపేక్షించుకోజాలము. సంవత్సరాది నాడు మనలో అనేకులు జీవిత ప్రస్థానమున కొద్దిసేపు ఆగి, వెనుకకు చూచి గత విషయములను స్మృతికి తెచ్చుకొందురు. పిమ్మట ముందుకు చూచి ఆశాపూరితులగుటకు ప్రయత్నింతురు. కాబట్టి నేనీదినమున గత విషయములను స్మరించుచుంటిని. చెరసాలలో వరుసగా నేను గడిపిన మూడవ సంవత్సరాది ఇది. మధ్యమధ్య అనేక మాసములపాటు విపుల మగు పృథివిలో నేనున్నమాట వాస్తవమే. ఇంకా వెనుకకు వెళ్ళి నట్లయితే నేను గత పదకొండు సంవత్సరములలోనూ అయిదు సంవత్స

రాదులు చెరసాలలో గడిపినట్లు జ్ఞాపకము వచ్చుచున్నది. అట్టి దిన ములూ, ఇతర దినములూ ఇంకా ఎన్ని నేను చెరసాలలో గడపవలసి ఉంటుందో!

చెరసాల వారి భాషలో నేను పాత నేరస్థుణ్ణి. అనేక పర్యాయ ములు పాత నేరస్థుణ్ణి అయితిని. చెరసాల జీవనమునకు నేను అలవాటు పడితిని. చెరసాలలో నా జీవనమునకూ, బయట నా జీవనమునకూ ఎంతో వ్యత్యాసము. బయట నున్నప్పుడు తీరికలేని పనీ, పెద్ద సమావేశాలూ, ఉపన్యాసాలూ, నిరంతర పర్యటనలూ. చెరసాలలో అంతా వేరు. ఇక్కడంతా శాంతముగా ఉంటుంది. నేనొట్టే కదిలేది లేదు. దీర్ఘ కాలముపాటు అలాగ కూర్చుండి పోతాను. గంటలకాలము మౌనముగా ఉండిపోతాను. రోజులూ, వారాలూ, మాసాలూ ఒకదానివెనుక ఒకటి గడిచి పోతున్నవి. ఒకదానితో ఒకటి కలిసిపోతున్నవి. ఒకదానికీ, ఇంకోదానికీ తేడాలేదు. గత కాలములో ప్రత్యేకముగా కానవచ్చేదేమీ లేదు. గతమంతా అస్పష్ట చిత్రమువలె ఉన్నది. నిన్నటి దినమును స్మరిస్తే నేరస్థుడుగా పట్టుకోబడ్డదినము జ్ఞప్తికివస్తుంది. మధ్యనున్న కాలము అంతా శూన్యము. మనస్సు నాకర్షించేదేమీ అందులేదు. ఒక్క చోట వేళ్ళు దింపుకొని, అక్కడే పెరుగుతూ విచారణ లేకుండా, మౌనంగా, నిశ్చలంగా ఉండే మొక్క జీవనంవంటి జీవనమిది. చెర సాలలో ఉన్నవానికి ఒక్కొక్కప్పుడు బాహ్య ప్రపంచములో జరుగు కార్యములు వింతగానూ, కొంత దిగ్భ్రమ కలిగించునవిగాను ఉంటవి. అవి ఎక్కడో జరుగుతూన్నట్లూ, సత్యము కానట్లూ తోస్తుంది. అసత్య కల్పనవలె కనిపిస్తుంది. కాబట్టి చెరలో మనకు రెండు స్వభావములు వృద్ధి అవుతవి. ఒకటి చురుకైన స్వభావము. ఒకటి స్తబ్ధత. రెండు విధములుగా జీవించుట కలవాటు పడుదుము. డాక్టరు జేక్యిల్, మిష్టరు హైడ్‌వంటి వ్యక్తిత్వములు రెండు మనలో అంకురించును. రాబర్టు లూయీ స్టీవెన్సన్ వ్రాసిన ఈ కథ చదివావా?

క్రమేణా అన్నిటికీ అలవాటుపడతాము. చెరసాలలోని మార్పు లేని కార్యక్రమమునకుకూడా అలవాటు పడతాము. విశ్రాంతి దేహానికి మంచిది. శాంతి మనస్సుకు మంచిది. ఆలోచనలకది దారి తీస్తుంది. విశ్రాంతి మంచిదే కాని సోమిరితనము దాని తోబుట్టువు.

కాబట్టి నీకు నేను వ్రాసే జాబులు నాకెంత ఉపకారకముగా ఉన్నవో ఇప్పుడు నీవు గ్రహించవచ్చును. వాటిని చదవడం నీకు విసుగుగా ఉండవచ్చును. వాటిలో నీకు అనురక్తిగలవిషయాలు లేకపోవచ్చు. అవి దీర్ఘముగా ఉండవచ్చు. కాని నా చెరసాల జీవితమునవి నింపినవి. నాకొక వ్యాపారము కలిగించినవి. అందువల్ల నాకెంతో ఆనందమునిచ్చినవి. నాయినీ చెరసాలలో సరిగా రెండు సంవత్సరముల క్రితము సంవత్సరాదినాడు నేను జాబులను ప్రారంభిస్తిని. చెరసాలకు తిరిగి వచ్చి వాటిని వ్రాస్తూనే ఉంటిని. ఒక్కొక్కప్పుడు వారముల తరబడి వ్రాయకుండా ఊరుకొంటిని. ఒక్కొక్కప్పుడు ప్రతి దినము వ్రాయుచుంటిని. వ్రాయాలని బుద్ధి పుట్టినప్పుడు కలము, కాగితమూ తీసుకొని కూర్చుందును. అప్పుడు వేరొక ప్రపంచమునకు పోదును. అప్పుడు ముద్దు తల్లీ, నీవు నా పజ్జనుందువు; చెరసాలను మరిచిపోదును. కాబట్టి ఈ జాబులు నాకు చెరసాలనుంచి విడుదల ఇస్తూనట్లు నేను భావించుకొంటున్నాను.

నేను వ్రాస్తూన్న ఈజాబు 120వది. ఈ జాబులకు లెక్క వేయడం బేరిల్లీ చెరసాలలో 9 నెలల క్రితము ప్రారంభించితిని. అప్పుడే నేనింత వ్రాసినందుకు నాకే ఆశ్చర్యముగా ఉన్నది. ఒకమారు ఈ జాబులకొండ నీమీదపడితే నీవేమనుకొంటావో? ఏమంటావో? కాని చెరసాలనుండి ఇట్లు విడుదల అవడం, ప్రయోణాలు చెయ్యడం కూడదనగలవా? నిన్ను చూచి, తల్లీ, ఏడు నెలలు దాటింది. ఎంత దీర్ఘ కాలమో!

ఈ జాబులలో గాథ అంత సంతోషకరమైనది కాదు. చరిత్ర సంతోషకరముగా ఉండదు, తానేదో గొప్ప అభివృద్ధి చెందానని డంబ

ములు పలికే మానవుడు పట్టి ఒంటెత్తు జంతువు. ఇంప్పైనవాడు కాడు. అయినా స్వార్థ పరత్వముతోనూ, కలహములతోనూ, నిర్దయతోనూ కూడుకొన్న అతని దీర్ఘవిషాదగాథ పొడుగునా అభివృద్ధి స్వర్ణరేఖలు చూడవచ్చుననుకొంటాను. నేను మేలెంచే మనిషిని. మనకు ఏమి సంభవించినా అందులో మంచి ఉండకపోదని ఆసించేవాణ్ణి. కాని ఇట్టి చిత్తవృత్తి మనచుట్టూ ఉన్న కళంకాలను చూడకుండా చెయ్యకూడదు. మేలెంచడమనేది అనాలోచితముగా చేస్తే అది అనుచిత మనిపించు కొంటుంది. ఎందువల్లనంటే వెనుకటి ప్రపంచపు తీరున్నూ, నేటి తీరున్నూ చూస్తే మేలెంచవలసిన సావకాశం కనిపించదు. ఆదర్శ ప్రాయముగా జీవించదలచిన వాడికీ, ఇతరులు చెప్పారుగదా నమ్మ వలెను అని అనుకొనే వాడికే ఈ ప్రపంచము దుర్భరముగానే ఉంటుంది. అనేక ప్రశ్నలు పుట్టుకువస్తవి. కాని వాటికి సూటియైన సమాధానము దొరకదు. అనేక సందేహములు తలయెత్తుతవి. అవి సులభముగాతీరవు. ఈ ప్రపంచములో ఇంత దుఃఖమూ, ఇంత మౌఢ్యమూ ఎందుకుండ వలెను ? ఈ మనదేశములో 2500 సంవత్సరముల క్రితము ఈ ప్రశ్నయే సిద్ధార్థుని బాధపెట్టింది. ఎన్నిమారులో తన్ను తాను ఈ ప్రశ్న అడుగు కొన్నాడట జ్ఞాని అగుటకు పూర్వము. అతడే బుద్ధుడైనాడు. అతడీ విధముగా తన్ను తాను పృచ్ఛించుకొన్నాడట—

"లోకమును సృష్టించి బ్రహ్మము
దుఃఖమయ మెందుకై చేయును ?
సర్వశక్తియుతుండె అయి అత
డిట్లుచేసిన మంచివాడత
డెట్లులగునో ? సర్వశక్తియు
తుండు కాడా అతని నెట్టుల
దేవు డనగలము ?"

దేశములో స్వాతంత్ర్యసమరము జరుగుతోంది. అయినా మన

దేశస్థులనేకులు దానిని లక్ష్యపెట్టడంలేదు. వారిలోవారు వాదించు కొంటూ, కొట్లాడుకొంటూ ఉంటున్నారు. తమ కులము, తమ మతము, తమ తరగతి మున్నగువాటిని గురించి తర్కిస్తూ సమిష్టి లాభాన్ని మరుస్తున్నారు. కొందరు స్వాతంత్ర్య దివ్య దృశ్యమును చూచుటకు కళ్లులేక—

"చప్పబడి, నిరంకుశులతో సంధికిదిగి,
పారవేసివ కిరీటాలు, పాతగుడ్డ
లనుచిత మతాలు, మెరుగుపూసిన, పగిలిన
చిల్లపెంకులు ధరియింత్రు...."

శాంతి భద్రతలపేరున నిరంకుశత్వము వర్థిల్లుతోంది. దానికి లొంగనివారిని అణచివేస్తోంది. దుఃఖితులకూ, దీనులకూ అండగా ఉండ వలసిన ఈ సాధనమే నిరంకుశుల చేతులలో దండ మగుట వింత విషయము. ఈ లేఖలో ఇతరుల వాక్యములను అనేకము ఉదహరించి ఉంటిని. ఇంకొక వాక్యమునుకూడా ఉదహరిస్తున్నాను. ఇది నాకు నచ్చింది. మన ప్రస్తుత స్థితికిది సరిపోతుంది. 18 వ శతాబ్ది యందున్న ఫ్రెంచి తత్త్వవేత్త అయిన మాంటెస్క్యూ గ్రంథంలోనిదిది. వెనుకటి జాబులలో ఇతని పేరు వచ్చింది.

"శాశనములపేరుచెప్పి, ధర్మమును మాటుపెట్టి మనము నెరపు నిరంకుశత్వముకన్న నికృష్టమైన నిరంకుశత్వమెక్కడా ఉండదు. నీటిలో ప్రాణరక్ష చేయగల కొయ్యపలకయే, దుర దృష్టవంతుల మగు మనలను నీటిలో ముంచి ప్రాణములు హరిస్తున్నది."

సంవత్సరాది జాబు చాలా విచారకరముగా తయారైనది. ఇది బాగులేదు. నిజానికి నాకు విచారంలేదు. మనమెందుకు విచారంగా ఉండాలి? ఒక మహా ఉద్యమంలో మనము దిగి పనిచేస్తున్నామనీ, పోరాడు తున్నామనీ ఆనందిస్తున్నాము. మన నాయకుడు మహాపురుషుడు. ప్రేమ

పాత్రుడగు మిత్రుడు. నమ్మదగ్గ మార్గదర్శి. అతని చూపు మనలో బలము పోస్తుంది. అతని స్పర్శ మనల నావేశపూరితుల చేస్తుంది. విజయము రానున్నదని మనకు నమ్మకముకలదు. నేడో, రేపో సాధించి తీరుతాము. దాటవలసిన అడ్డంకులూ, గెలువవలసిన పోరాటములూ లేకుంటే జీవితము చప్పగా వెలవెలపోతూ ఉంటుంది.

జీవిత ద్వారమువద్ద ఉన్న నీకు, నా తల్లీ, ఈ విచారములతోటీ, భయములతోటీ పనియేమిటి? ఆనందముతో, శాంతముతో జీవితమును ఎదురుకో! జీవిత సమస్యల నెదురుకో! కష్టములురానీ, వాటిని దాటడమే ఆనందముగా చూచుకో.

మరి ఇక ఉండునా తల్లీ! త్వరలోనే మనము తిరిగి కలుసుకోగల మనుకుంటా.

# 121
# ఫిలిప్పైను దీవులు : అమెరికా సంయుక్త రాష్ట్రములు

జనవరి 3, 1933

సంవత్సరాది దినమున అన్య విషయములనుగురించి ప్రసంగించు కొన్నాము. ఇప్పుడు మన కథలోనికి దిగుదాము. ఆసియా తూర్పు ప్రాంతముయొక్క చరిత్ర పూర్తి అగుటకు ఫిలిప్పైను దీవుల సంగతి ఎత్తుకుందాము. ఈదీవులనుగురించి మనమెందుకు ప్రత్యేకముగా తెలుసు కోవలసి వచ్చింది? ఆసియాలోనూ, ఇతరత్రా అనేక ద్వీపములున్నవి. ఈ జాబులలో వాటిపేరైనా ఎత్తుకోలేదు. ఆసియాలోనూ, తన సామ్రాజ్య వాదమెట్లు వృద్ధిచెందుతున్నదీ, ప్రాచీన నాగరీకతలపై అది ఎట్లు పని చేసినదీ మనము తెలిసికో ప్రయత్నిస్తున్నాము. ఇట్టి విషయములు తెలిసి కోడానికి ఇండియామాదిరి సామ్రాజ్యంగా పనికివస్తుంది. పారిశ్రామిక

సామ్రాజ్యవాద వ్యాప్తియొక్క వేరొక విభిన్నమగు ముఖ్య లక్షణమును చీనా మనకు తెలుపును. తూర్పు ఇండీసు దీవులు, ఇండో చీనా మున్నగునవి కూడా కొన్ని విషయములు మనకు తెలుపుతవి. ఆ విధముగానే ఫిలిప్పైను దీవులను గురించికూడా మనము తెలిసికో కోరుతాము. ఈ కోరికకు కారణము అక్కడొక కొత్తజాతి పని చేస్తోంది. అది అమెరికా సంయుక్త రాష్ట్రములు.

చీనాలో సంయుక్త రాష్ట్రములు ఇతర జాతులవలె ఆక్రమణ శీలత్వముతో లేవు సరిగదా కొన్ని సందర్భములలో ఇతర సామ్రాజ్యవాద ప్రభుత్వములను ఆపుదలచేసి చీనాకు ఉపకారముకూడా చేసినవి. సామ్రాజ్యవాదమంటే ఇష్టములేకగాని, చీనామీద అభిమానముండిగాని వారీపని చేయలేదు. యూరోపియన్ దేశములకూ వీటికీ కొన్ని విషయములలో తేడా ఉన్నది. ఒక చిన్న ఖండములో ఈ యూరోపియన్ దేశములు ఇరుకుగా, క్రిక్కిరిసి ఉన్నవి. ప్రతి దేశమందూ జనసంఖ్య ఎక్కువగా ఉండెను. కదులుటకుకూడ వారికి స్థలములేదు. అన్యోన్య సంఘర్షణమూ పేచీ ఎప్పుడూ ఉండెను. పారిశ్రామిక విధానము రావడంతోనే వాటి జనసంఖ్య అమితంగా పెరిగింది. ప్రజలు సరుకులు అధికముగా తయారు చేయజొచ్చిరి. ఇంటివద్ద వాటికి చెలామణీలేదు. పెరుగుచున్న జనసంఖ్యకు తిండికావలసి వచ్చింది. ఫ్యాక్టరీలకు ముడి పదార్థములు కావలసివచ్చినవి. తయారైన వస్తువులకు మార్కెట్టులు కావలసి వచ్చినవి. ఈ అక్కరలను శీఘ్రముగా తీర్చుట ఆర్థికముగా వారికి అవసరమైనది. అందుచే వారు దూర దేశములకు పోవలసి వచ్చెను. సామ్రాజ్య స్థాపనకై వారిలోవారు యుద్ధములు చేసుకోవలసివచ్చెను.

ఈ సందర్భములు సంయుక్తరాష్ట్రములకు పట్టలేదు. వారి దేశము యూరోపు దేశమంత పెద్దది. అందు జనసంఖ్య తక్కువ. అందరికివి తగినంత స్థలమున్నది. వెనుకబడ్డ ప్రదేశములను కాయకష్టపడి వృద్ధి చేసుకొనుటకు వారికి కావలసినన్ని అవకాశములుకలవు. రైళ్లు నిర్మింప

బడుటచేత వారు పశ్చిమముగా పోయిరి. ఇంకనూ వెళ్ళి వెళ్ళి వారు పసిఫిక్ మహా సముద్రమును చేరిరి. సొంత దేశములలో వారికి చేతి నిండా పని ఉండుటచేత వలసలు పోవుటకు వారికి సావకాశమూలేదు, ఇష్టమూలేదు. ఒకమారు కాలిఫోర్నియా తీరమున కూలివాళ్ళు కావలసి వస్తే చీనాదేశపు కూలీలను పంపమని వారు చీనా ప్రభుత్వమును కోరిరి. వారట్లు చేసిరి. కాని ఇందువల్ల రెండు దేశములకూ వైషమ్యములు కలిగెను. ఈ విషయము నీకిదివరలో చెప్పియుంటిని. యూరోపియన్ ప్రభుత్వములు సామ్రాజ్య స్థాపనకై పోటీలు పడుచున్న కాలములో అమెరికనులు స్వదేశమున కార్య నిమగ్నులై ఉండిరి. పోటీలలోవారు చేరలేదు. ఇక తప్పనిసరి అన్నప్పుడు, ఇతర జాతులు చీనాను విభజించి పంచుకొందురని భయపడినప్పుడు మాత్రమే చీనా వ్యవహారములలో వారు కలుగజేసికొనిరి.

ఫిలిప్పైను దీవులు అమెరికనుల ప్రత్యక్ష పరిపాలనలోకివచ్చెను. అమెరికన్ సామ్రాజ్యవాదమని చెప్పడం కద్దు. కాన దానిని గురించి మనము తెలుసుకోవలెను. అమెరికనుల సామ్రాజ్యమంతా ఫిలిప్పైను దీవులే అని అనుకొనబోకుము. పైకిమట్టుకు వారికున్న సామ్రాజ్యమది ఒకటే. కాని ఇతర సామ్రాజ్యవాద జాతుల అనుభవములనూ, కష్టములనూ గమనించి, ఆ జ్ఞానముతో వారు పాతపద్ధతులకు మెరుగుపెట్టిరి. బ్రిటిషువారు ఇండియా దేశమును ఆక్రమించినట్లు వారేదేశమునూ కలుపుకోరు. వారికి కావలసినది ధనలాభము. కాబట్టి వారు ఒక దేశ భాగ్యమును తమ వశములో పెట్టుకొనుటకు తగిన చర్య తీసుకొందురు. దేశ భాగ్యమును తమ వశములో పెట్టుకొన్నప్పుడు ప్రజలను వశము చేసుకొనుట సులభమే. ఆద్వారాదేశమును తమ వశములో పెట్టుకోవచ్చును. కాబట్టి ఎక్కువ శ్రమ లేకుండా, పురోగమించు జాతీయతతో సంఘర్షణ లేకుండా వారు దేశమును చెప్పుచేతలలో ఉంచుకొని దాని భాగ్యమును అనుభవింతురు. ఈ చమత్కారపద్ధతికి 'ఆర్థిక సామ్రాజ్యవాద'మని పేరు.

దేశపటములో ఇది కనిపించదు. ఒక దేశము స్వతంత్రముగానే ఉన్నట్లు కనిపించును. భూగోళమును చూచినా, దేశపటమును చూచినా అంతే. కాని తెరవెనుక నీవు చూచినట్లయితే అది ఇంకో దేశముయొక్క గుప్పిటిలో—అనగా ఆ దేశపు పెద్ద వర్తకుల యొక్కయు, వడ్డీ వ్యాపారస్థుల యొక్కయు గుప్పిట్లో ఉన్నట్లు నీవు తెలిసికొందువు. అమెరికా సంయుక్త రాష్ట్రములకున్న కనిపించని సామ్రాజ్యమిదే. బ్రిటిషువారు దేశ ప్రజలకు రాజకీయ యంత్రమును వశపరచేటప్పుడు నిలుపుకో దలచుకొన్నది ఈ కనిపించని సామ్రాజ్యమునే. కనిపించకున్నా లాభ కారిగా ఉండు ఈ సామ్రాజ్యమునే. ఇది చాలా ప్రమాదకరమైనది కాబట్టి మనము అప్రమత్తులమై ఉండవలెను.

పిలిప్పైనులు కనిపించే సామ్రాజ్య భాగమే కాబట్టి కనిపించని ఆర్థిక సామ్రాజ్యము సంగతి ప్రస్తుతము తెలిసికో నవసరము లేదు.

పిలిప్పైనుల్లను గురించి మనము తెలిసికో కుతూహలపడడానికి వేరొక చిన్న కారణమున్నది. అది హృదయానికి సంబంధించినది. నేడాదీవులకు స్పెయిను-అమెరికా దేశముల పాలకము కనిపించుచున్నది. కాని వాటి ప్రాచీన సంస్కృతి కంతకూ ఆధారము హిందూదేశమే. సుమిత్రా, జావాల ద్వారా హైందవ సంస్కృతి వారికి సంక్రమించింది. వారి మత స్సాంఘిక రాజకీయ జీవనమును, ఆ మాటకువస్తే ప్రతి జీవితాంశమునూ అది పరిష్కరించింది. ప్రాచీన పురాణ గాథలూ, కథలూ మన సాహిత్య గ్రంథములు కొన్నీ వారికి చేరినవి. వారి భాషలలో సంస్కృత పదములనేకములున్నవి. వారి కళను ఇండియా పరిష్కరించింది. వారి శాసనములపైనీ, చేతి వృత్తులపైనీకూడా ఇండియా తన ప్రభావము చూపింది. వారి దుస్తులూ, అలంకరణములూ ఇండియాను తలపునకు తెస్తవి. 300 సంవత్సరముల కాలము అచ్చట రాజ్యమేలిన స్పానియర్డులు హైందవ సంస్కృతిచిహ్నాలను మాపు చేయుటకు ప్రయత్నించిరి. కాబట్టి నేడు అట్టి చిహ్నాలు బహుకొద్దిగా మాత్రమే కనిపిస్తవి.

ఈ దీవులను స్పానిషువారు ఆక్రమించుటకు పూనుకొన్నది 1565లో. ఆసియాలో ప్రప్రథమమున యూరోపియనులుకాలూనిని ప్రదేశములలో ఇదియొక్కటి. వాటి పరిపాలనము పోర్చుగీసు, బ్రిటిషు, డచ్చి వలసల పరిపాలనములకు భిన్నముగా ఉండెను. వర్తకము ప్రోత్సహింప బడలేదు. మతము నాధారముగా పెట్టుకొని ప్రభుత్వములు నడుచుచుండెను. ప్రభుత్వోద్యోగులు చాలావరకు మిషనరీలున్నూ, పాదిరీలున్నూ. దానిని మిషనరీల సామ్రాజ్యమనేవారు. ప్రజల పరిస్థితులు చక్కచేయుటకు ఎట్టి ప్రయత్నములూ జరుగలేదు. దుష్పరిపాలనము, ప్రజాహింస, పన్నులభారము, క్రైస్తవములో బలవంతముగా కలుపుకొనుటకు ప్రయత్నములు—జరుగుచుండెను. ఇట్టి పరిస్థితులవల్లనే ప్రజలనేకమాట్లు తిరుగుబాటుచేసిరి. వర్తకము చేసికొనుటకై చీనా వారనేకులీ ద్వీపములకు పోయిరి. క్రైస్తవ మతము స్వీకరించుటకు వారు సమ్మతించనందున వారిని హత్యలు చేయుచుండిరి. ఇంగ్లీషు, డచ్చి వర్తకులు ద్వీపములకు పోవీలులేదు. అందుకొక కారణము వారు తరుచు శత్రువులౌట. వేరొక కారణము వారు ప్రాటస్టెంటు క్రైస్తవులగుట. రోమన్ కాతలిక్కు స్పానియర్డుల దృష్టిలో వారు మత బాహ్యులు.

పరిస్థితులు విషమించెను. కాని ఒక మంచి ఫలితము కలిగెను. వేర్వేరు ద్వీపము లేకమైనవి. 19 వ శతాబ్దిలో వారిలో జాతీయ భావముదయించెను. ఈ శతాబ్ది మధ్యమందు పరదేశవర్తకులు ద్వీపములలో ప్రవేశించుటకు అనుజ్ఞవచ్చెను. దీనినిబట్టి విద్యావిధానములో సంస్కరణములు కొన్ని ప్రవేశపెట్టబడినవి. ఇతర శాఖలున్నూ, సంస్కరింపబడినవి. వర్తక వ్యాపారములు వృద్ధియైనవి. ఫిలిపినో మధ్యతరగతి వృద్ధిచెందినది. ఫిలిపినోలున్నూ, స్పానియర్డులున్నూ అంతర్జాతి వివాహములు చేసుకొన మొదలుపెట్టిరి. ఫిలిపినో లనేకుల రక్తనాళములలో స్పానియర్డు రక్తము ప్రవహించెను. స్పెయినును మాతృభూమిగా వారు భావించ జొచ్చిరి. స్పానిష్ భావములు ప్రజలలో వ్యాపించెను.

అయినప్పటికిన్నీ జాతీయ భావము పెంపొందుచునే ఉండెను. దాని నణచిపెట్టుటచేత అది విప్లవ స్వరూపము దాల్చెను. స్పెయినునుండి విడిపోవలెననే అభిప్రాయము మొట్టమొదటలేదు. స్వపరిపాలనమునూ, "కార్టిస్" అనే పేరుగల దుర్బలమగు స్పానిష్ పార్లమెంటులో ప్రాతినిధ్యమునూ వారు కోరిరి. ప్రతి దేశమందునూ జాతీయోద్యమములు మితవాదముతో మొదలుపెట్టి చివరకు అతివాదములోకి దిగుటయు, సంపూర్ణ స్వాతంత్ర్యము కోరుటయు జరుగుచున్నది. ఇది వింత విషయము. స్వేచ్ఛ కోరినప్పుడు ప్రజలను అణచివేసినట్లయితే రానురాను వడ్డీతోకూడా స్వాతంత్ర్యమీయవలసి ఉంటుంది. ఫిలిప్పైను దీవులలో స్వాతంత్ర్య కాంక్ష పెరిగినది. స్వాతంత్ర్య సాధనకై జాతీయ సంఘములు తల యెత్తినవి. రహస్య సంఘములునూ వ్యాపించినవి. డాక్టరు జోస్ రీజల్ నాయకత్వమున "ఫిలిపినో యువక పక్షము" ప్రధానపాత్ర వహించి పనిచేసినది. ఇట్టి ఉద్యమములను అణచివేయుటకు ప్రభుత్వములకు తెలిసిన పద్ధతి ఒకటే—అది రాక్షసత్వము. ఈ పద్ధతినుపయోగించి స్పానిష్ అధికారులీ ఉద్యమమును అణచివేయ ప్రయత్నించిరి. రీజల్, ఇతర నాయకులనేకులూ మరణదండన పాలైరి. 1896 లో వారిని ఉరితీసిరి.

ఈ దారుణ కృత్యమును ప్రజలు సహించలేకపోయిరి. స్పానిష్ ప్రభుత్వముపై ప్రజలు బాహాటముగా తిరుగబడిరి. ఫిలిపినోలు స్వాతంత్ర్యమును ప్రకటించుకొనిరి. సంవత్సరముపాటు ఈ పోరాటముసాగెను. ఈ తిరుగుబాటును స్పానియార్డులు అణచివేయలేకపోయిరి. తరువాత నిజమగు సంస్కరణములు ప్రవేశపెట్టుటకు స్పానియర్డులు వాగ్దానము చేసిరి. దానితో ఉద్యమము తాత్కాలికముగా నిలుపు చేయబడినది. కాని స్పెయిను ఏమీ చెయ్యకపోవుటవల్ల 1898 లో తిరిగి తిరుగుబాటు తలయెత్తినది.

ఇంతలో వేరే విషయమును గురించి అమెరికా ప్రభుత్వమున

కునూ, స్పెయినుకును విరోధము తటస్థించెను. ఉభయ దేశముల మధ్య యుద్ధము ప్రకటింపబడెను. 1898 ఏప్రియల్‌లో అమెరికా సౌకాదళము ఫిలిప్పైను దీవులపై దండయాత్ర చేసెను. ఫిలిపినో విప్లవ నాయకులు, అమెరికా ప్రజాప్రభుత్వము తమ స్వాతంత్ర్యమును పోషిస్తుందన్న భావముతో అమెరికనులకు యుద్ధములో సహాయము చేసిరి. మరల వారు స్వాతంత్ర్య ప్రకటనముచేసి ప్రజాప్రభుత్వమును ఏర్పాటు చేసిరి. సెప్టెంబరు 1898 లో ఫిలిపినో జాతీయసభ సమావేశమయ్యెను. నవంబరు అంతమునకు ఒక రాజ్యాంగ ప్రణాళిక ఆమోదింప బడెను. జాతీయసభవారీ ప్రణాళికను చర్చించుచున్నప్పుడే అమెరికనులు స్పెయినును ఓడించుచుండిరి. స్పెయిను దుర్బలముగా ఉండెను. సంవత్సరము పూర్తి కాకముందే స్పెయిన్ ఓటమిని ఒప్పుకొనెను. యుద్ధము ముగిసెను. చేసుకొన్న సంధి షరతుల ప్రకారము స్పెయిను ఫిలిప్పైను దీవులను సంయుక్త రాష్ట్రముల వారి వశము చేసెను. ఇట్టి ఉదారదానము వల్ల స్పెయిను నష్టపడినదేమీలేదు. ఎందుకంటె ఫిలిపినో విప్లవకారులు అప్పటికే స్పెయను అధికారమును తుదముట్టించిరి.

సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము ఫిలిప్పైను ద్వీపములను స్వాధీనము చేసికొనుటకు తగు చర్యలు తీసుకొనుచుండిరి. ఫిలిపినోలు అట్లు చేయకూడదని తమ అసమ్మతిని తెలిపిరి. ఈ దీవులను అన్యాక్రాంతము చేయుటకు స్పెయినుకు అధికారము లేదనియ్నీ, అన్యాక్రాంతముచేసే సమయాన దానికే హక్కు లేదనియ్నీ తెలిపిరి. కాని లాభములేక పోయెను. నూతనముగా సంపాదించుకొన్న స్వాతంత్ర్యము చూచుకొని సంతోషించుచున్నప్పుడే వారు మరల పోరాటములోనికి దిగవలసివచ్చినది. ఈ మారు స్పెయినుకన్న ఎంతో బలమైన ప్రభుత్వముతో పోరాటము. మూడున్నర సంవత్సరముల కాలము వారు ధైర్యముగా పోరాడిరి. కొంతకాలము సొంత ప్రభుత్వము పేరుచెప్పి పోరాడిరి. కొంత కాలము గోరిల్లా యుద్ధము చేసిరి.

చివరకి తిరుగుబాటు అణచివేయబడెను. పరిపాలనము స్థాపించబడెను. గొప్ప సంస్కరణములనేకము, అందు ముఖ్యముగా విద్యా విధానమున, ప్రవేశపెట్టబడెను. కాని స్వాతంత్ర్యముకొరకై ఆందోళన జరుగుచునే ఉండెను. 1916 లో సంయుక్త రాష్ట్రముల కాంగ్రెసు "జోన్సుబిల్లు" అనేబిల్లును అమలులో పెట్టెను. ఎన్నుకోబడ్డ సభ్యులు గల శాసన సంఘమునకు కొన్ని అధికారములు ఈయబడెను. కాని అమెరికన్ గవర్నరు జనరలుకు అందు కలుగజేసికొనే హక్కు ఉండెను. తరుచు అతడు కలుగజేసికొనేవాడుకూడా.

సంయుక్త రాష్ట్రాధికారులపై తిరుగుబాట్లేమీ జరుగలేదు. కాని తమ ప్రస్తుతావస్థతో ఫిలిపినోలు తృప్తిపడి ఉండలేదు. స్వాతంత్ర్యమును కోరుతూ అందుకై ఆందోళన సాగించుచునే ఉండిరి. అచ్చముగా సామ్రాజ్యవాద వైఖరితో అమెరికనులు ఫిలిపినోల క్షేమముకొరకే తామచ్చటనుంటిమనియూ, స్వతంత్రముగా పరిపాలించుకోగల శక్తి సామర్థ్యములు ఫిలిపినోలకు కలిగినతోడనే తాము దీవులను విడిచి పోదుమనియు, తరుచు వారికి చెప్పుచుండిరి. 1916లోని జోన్సు బిల్లులో కూడా ఈవిధముగా చెప్పబడివున్నది-"స్థిరమైనప్రభుత్వము స్థాపించుటకు అవకాశములు కలిగినతోడనే ఫిలిప్పైను దీవులపై తాము నెరపుచున్న అధికారమును ఉపసంహరించుకొని, వారి స్వాతంత్ర్యమును ఆమోదించుటయే ఎప్పటికిన్నీ సంయుక్త రాష్ట్ర ప్రజల అభీప్సితము." ఇది యిట్లున్నా అమెరికాలో పలువురు ఫిలిప్పైను స్వాతంత్ర్యమునకు విముఖులు.

ఇదివ్రాస్తూండగా వార్తాపత్రికలలో ఒకవార్త వచ్చింది. పది సంవత్సరముల లోపుగా ఫిలిప్పైను దీవులకు స్వాతంత్ర్యము ఇస్తామని ఒక తీర్మానమో, ప్రకటనో సంయుక్త రాష్ట్ర కాంగ్రెసు చేసిందట.

సంయుక్త రాష్ట్రములవారికి ఫిలిప్పైను దీవులలో కొన్ని ఆర్థిక సౌకర్యాలు ఉన్నవి. వాటిని కాపాడుకోవడం వారికి పని. కావలసిన

వస్తువులలో వారికి రబ్బరులేదు. కాబట్టి దీవులలో రబ్బరు తోటలంటే వారికి అనురక్తి. దీవుల నాక్రమించుకొని ఉండుటకు ప్రధాన కారణము జపాను భయమని నా అభిప్రాయము. ఫిలిప్పైనులకు చాలా సమీపాన జపాను ఉన్నది. నానాటికీ వృద్ధిచెందుచున్న జనసంఖ్యతో జపాను జనాకీర్ణమై ఉన్నది. జపాను ప్రభుత్వము ఈ దీవులను కబళించవలెనని కన్నువేసి ఉండవచ్చు. జపాను, అమెరికన్ ప్రభుత్వములకు అన్యోన్య అనురాగములేదు. కాబట్టి ఫిలిప్పైనుల భావిస్థితి, పసిఫిక్కు జాతులు, వారి అన్యోన్య సంబంధములు అనే పెద్ద విషయములో ఒక అంశమై మాత్రమే ఉన్నది.

## 122

# మూడు ఖండములు కలిసినచోట

జనవరి 16, 1933

పక్షముదినముల క్రితము నేను నీకు వ్రాసినప్పుడు నేననుకొన్న కాలముకంటె ముందుగానే నా సంవత్సరాది కోరిక ఒకటి నెరవేరింది. ఎంతకాలమో వేచిఉన్న పిమ్మట చివరకు మనము సమావేశమైతిమి. నిన్ను మళ్ళీ నేను చూచాను. నిన్నూ, యితరులనూ చూచిన సంతోషమూ, సంభ్రమమూ చాలా రోజులపాటు నా మనస్సునంతా ఆక్రమించాయి. నిత్యమూ చేయవలసినపనులుకూడా చెయ్యకుండా ఉపేక్షించాను. సెలవులనుభవించేటప్పుడు ఉండే ఉత్సాహము నాకు కలిగింది. నాలుగు రోజుల క్రితమే మనము కలుసుకొన్నది. అయినా చిరకాలము గడిచినట్లున్నది. అప్పుడే ముందు సంగతి ఆలోచిస్తున్నాను—ఎక్కడ ఎప్పుడు మనము తిరిగి కలుసుకుంటామా అని.

నా నటనకు జైలు నిబంధనలేమీ అడ్డురావు గనుక నీకీ జాబులు వ్రాస్తూనే ఉంటాను.

కొంతకాలంనుంచి నీకు 19 వ శతాబ్దిని గురించి వ్రాస్తున్నాను.

ఈ శతాబ్ది సంగ్రహ సమీక్ష మొట్టమొదట నీకు వ్రాసితిని—అనగా నెపోలియన్ పతనానంతరము దాదాపు 100 సంవత్సరముల కాలము. పిమ్మట కొన్ని దేశములను గురించి విపులముగా తెలిసికొంటిమి. ఇండియాను గురించి విపులముగా తెలిసికొంటిమి. తరువాత చీనా, తరువాత జపాను, చివరకు మహా ఇండియా, తూర్పు ఇండీసు దీవులు. ఈ విపుల సమీక్షలో ఆసియాలో ఒక భాగమును మాత్రము మనము చూచితిమి. ఇతర ప్రపంచ భాగములు మిగిలి ఉన్నవి. ఇది దీర్ఘగాథ. స్పష్టంగా, ఋజువుగా చెప్పడం కష్టం. దేశములూ ఖండములుగా ఒకదాని తరువాత ఒకటిగా ఎత్తుకొని ప్రత్యేకముగానే చెప్పవలసి వస్తోంది. ఉండుండీ నేను వెనుకకుపోయి ఆ కాలమున వేరొక దేశమెట్లుండెనో చెప్పవలసివస్తోంది. ఇట్లు చెప్పడమువల్ల కొంచెం గందరగోళముగా ఉండేమాట వాస్తవము. కాని నీవొకవిషయము జ్ఞాపకముంచుకోవలెను. 19 వ శతాబ్దిలో వివిధ దేశములలో జరిగిన సంఘటనలన్నీ ఒకే కాలమున జరిగెను. ఇవి ఒకదానితో ఒకటి సంబంధించి ఉండి ఒకదానినొకటి పురిగొల్పుచుండెను. అందువల్ల ఒకే ఒక దేశదరిత్ర చదవడం వల్ల యదార్థం మరుగుపడుతుంది. ప్రపంచ చరిత్ర చదువుటవల్లనే వెనుకటి కాలమునకు ఆకారమిచ్చి దానిని వర్తమానకాలముగా మార్చిన సంఘటనలయొక్కయూ, శక్తులయొక్కయూ ప్రాముఖ్యమును గూర్చి మనకు సరియైన భావములు కలుగును. ఈ జాబులట్టి ప్రపంచ చరిత్రను నీకు చెప్పజాలవు. అది నా తలకుమించినపని. ఆ విషయమును తెలిసికో దలుచుకొంటే అనేక గ్రంథములున్నవి. ఈ జాబులలో నేను చేయ దలచుకొన్న పని నీకు ప్రపంచ చరిత్రపై అభిమానము కలిగించడమే. అందలి కొన్ని అంశములను చూపడమే. తొలి కాలమునుండి నేటి వరకూ సాగుచున్న మానవకృషికి సంబంధించిన కొన్ని సూత్రములను నీవు అనుసరించినట్లు చేయడమే. ఈ పనిలో నే నెంతవరకు కృతకృత్యుణ్ణి కాగలనో చెప్పలేను. నేనంతా కలగాపులగం చేసి నీకు

సరియైన అభిప్రాయం కలిగించకుండా గందరగోళ పెడతానేమో అని భయంగా ఉంది.

యూరోపు 19 వ శతాబ్దిలో ప్రచోదనశక్తియై ఉండెను. అచ్చట జాతీయత విజృంభించెను. పారిశ్రామిక విధానము వ్యాపించెను. ప్రపంచ మన్నిదిక్కులకూ అది ప్రసరించి తరుచు సామ్రాజ్యవాద స్వరూపమును పొందెను. ఈ శతాబ్దిని మొదట పరామర్శించునప్పుడు ఈ విషయమును గమనించితిమి. ఇండియాలోనూ, తూర్పు ఆసియాలోనూ దాని ప్రభావమును చూచితిమి. సూక్ష్మ పరిశీలనకై మరల యూరోపునకు పోవుటకు ముందు పశ్చిమ ఆసియాను ఒకమారు దర్శింతము. చాలాకాలమునుంచి ఈ దేశమును గురించి నీకు వ్రాయనేలేదు. అందుకు ముఖ్యకారణము దాని పిదప చరిత్రము నాకు పూర్తిగా తెలియకుండడమే.

తూర్పు ఆసియా, ఇండియాలకన్న చాలా భిన్నమైనది పడమటి ఆసియా. చిరకాలము క్రిందట అనేక తెగల ప్రజలు మధ్య ఆసియా నుండియు, తూర్పు దేశముల నుండియు పడమటి ఆసియాకు వచ్చి దానిని ధ్వంసము చేసిరి. తురుష్కులు ఈ విధముగా వచ్చినవారే. క్రీస్తు శకమునకు పూర్వము బౌద్ధము ఆసియా మైనరు వరకూ వ్యాపించింది కాని అక్కడ వేళ్ళు తన్నినట్లు లేదు. పడమటి ఆసియా దృష్టి ఎల్లప్పుడూ యూరోపువైపే ఎక్కువగా ఉన్నది. గాని ఆసియావైపూ, ప్రాచ్య దేశములవైపూ లేదు. ఒక విధముగా చూస్తే అది ఆసియా నుండి యూరోపును చూచుటకు వినియోగపడు కిటికీవలె నుండెను. ఆసియా అనేక ప్రాంతములలో ఇస్లాం వ్యాపించినప్పటికీ దాని దృష్టి యూరోపునుండి మరలలేదు.

ఇండియా, చీనాలు గాని, వాటి పొరుగున ఉన్న దేశములుకాని ఈ విధముగా యూరోపుపై దృష్టి పెట్టుకోలేదు. వారు ఆసియాలోనే నిమగ్నులై ఉండిరి. ఇండియా, చీనాలకు అనేక భేదములున్నవి. వారు వేర్వేరు జాతులవారు. వారి సంస్కృతులు వేరు. వారి దృక్పథములు

వేరు. చీనా ఎన్నడూ మతమునకు బానిసకాలేదు. మతాచార్యుల ఆధి పత్య మక్కడ లేదు. ఇండియా మతమునకు ప్రాముఖ్యమిచ్చెను. దాని సంఘము మతాచార్యుల స్వాధీనమందుండెను. బుద్ధుడు ఈ పరిస్థితులు మార్చుటకు ప్రయత్నించెను కాని లాభములేకపోయెను. ఇండియా, చీనాలకు ఇంకా అనేక భేదములున్నవి. అయినప్పటికీ ఇండియాకున్నూ, ఆసియా, ఆగ్నేయ ఆసియాలకున్నూ వింత ఏకత్వముగలదు. ఈ ఏకత్వ కారణము బుద్ధుని చరిత్ర. ఈ చరిత్రయే ఇండియా, చీనా ప్రజలకైక్యత కూర్చినది. కళలో, సాహిత్యములో, సంగీతములో, పాటలో సమాన భావము లనేకము ప్రవేశపెట్టినది.

పడమటి ఆసియాకు సంబంధించిన కొన్ని విషయములు ఇస్లాము ఇండియాకు తెచ్చెను. దాని సంస్కృతి వేరు. దాని జీవన దృక్పథము వేరు. అయితే ఈ పడమటి ఆసియా దృక్పథము సహజ స్వరూపముతో తిన్నగా ఇండియాకు రాలేదు. అరబ్బులే ఇందియాను జయించి ఉన్న ట్లయితే అట్లా జరిగేది. చాలాకాలము జరిగిన పిమ్మట మధ్య ఆసియా తెగలద్వారా అది వచ్చినది. కాని వారు దానికి యోగ్యులగు ప్రతినిధులు కారు. అయినప్పటికీ పడమటి ఆసియాతో ఇస్లాం ఇండియాను కలిపెను. ఈ విధముగా ఈ గొప్ప సంస్కృతులు రెండూ ఇండియాలో కలుసు కొన్నవి. ఇస్లాం చీనాకుకూడా వెళ్ళెను. అచ్చట అనేకులు ఆ మతమున చేరిరి. కాని చీనాయొక్క ప్రాచీన సంస్కృతినది ఎదిరించలేదు. ఇండి యాలో చాలాకాలముపాటు ఇస్లాం, పాలకుల మతమగుటవల్ల అచ్చటి సంస్కృతినది ఎదిరించినది. ఈవిధముగా ఇండియాలో రెండు సంస్కృ తులు తారసిల్లినవి. ఈ విషమసమస్యను పరిష్కరించుటకై రెండు సంస్కృతులను సంయోగముచేయ అనేక ప్రయత్నములు జరిగినవని ఇదివరలో చెప్పియుంటిని. చాలావరకీ ప్రయత్నములు సఫలమైనవి. కాని బ్రిటిషువారు ఇండియాను జయించుటవల్ల దానికి అవరోధము, ప్రమాదము తటస్థించెను. నేడీరెండు సంస్కృతులూ అర్థములేనివైనవి.

జాతీయతా, పారిశ్రామిక భావమూ ప్రపంచ స్వరూపమును మార్చి వేసెను. నూతన ఆర్థిక పరిస్థితులలో ఇముడగలిగినప్పుడే ప్రాచీన సంస్కృతులు నిలువగలుగుతవి. వాటి బాహ్య స్వరూపము మాత్రము మిగిలినది. అంతర్జీవము నశించినది. ఇస్లాం పుట్టిన పడమటి ఆసియా లోనే గొప్ప మార్పులు జరుగుచున్నవి. చీనాయున్నూ, దూర ప్రాచ్య మున్నూ ఒడుదుడుకు పరిస్థితులలో చిక్కుకొన్నవి. ఇండియాలో ఏమి జరుగుచున్నదీ మనకు తెలుసును.

ఎన్నాళ్లబట్టో నీకు పడమటి ఆసియానుగురించి వ్రాయకపోవడం వల్ల ఎక్కడ మొదలుపెట్టాలో తెలియడంలేదు. బాగ్దాదుయొక్క అరబ్బీ సామ్రాజ్యమును గురించి చెప్పియుంటిని జ్ఞాపకమున్నదా ? తురుష్కులు కారణముగా అది పతనమైనది. వీరు సెల్జూకు తురుష్కులు—ఆటో మనులు కారు. చివరకు చెంగిజ్‌ఖాన్ అనుచరులగు మంగోలులు దానిని నాశముచేసిరి. ఈ మంగోలులే ఖ్వారిజమ్ సామ్రాజ్యమునుకూడా అంత రింపజేసిరి. ఈ సామ్రాజ్యము మధ్య ఆసియాకు వ్యాపించెను. పర్షియా అందలిదేశమే. తరువాత కుంటి తైమూరువచ్చెను. అతడు యుద్ధ విజయ ములు, హత్యలు సాధించి కొద్ది కాలములోనే మరణించెను. పడమట ఒక కొత్త సామ్రాజ్యము తలయెత్తెను. తైమూరుచే పరాజయమందిన్నీ, అది వ్యాపించదొడగెను. ఇది ఆటొమన్ తురుష్కుల సామ్రాజ్యము. వీరు పర్షియాకు పడమరనున్న ఆసియానూ, ఈజిప్టునూ, ఆగ్నేయ యూరోపులోని చాలాభాగమునూ వశము చేసుకొనిరి. చాలా తరముల కాలము వారు యూరోపును బెదిరించిరి. మత విశ్వాసముకలవారై మూఢ విశ్వాసములలో తగుల్కొన్న మధ్య యుగములనాటి యూరోపియన్ ప్రజలకు వీరు పాపులను దండించుటకు వచ్చిన భగవంతుని కొరడా వలె కనిపించిరి.

ఆటోమనుల పరిపాలనమున పడమటి ఆసియా, చరిత్రనుండి అంతరించినదనియే చెప్పవలెను. ప్రపంచముతో సంబంధము దానికి

పడిపోయెను. అనేక శతాబ్దుల కాలముపాటు యూరోపు, ఆసియాలకు మధ్య అది రాచబాటగా ఉండెను. లెక్కలేనన్ని బిడారులు దాని నగరముల గుండా, ఎడారులగుండా పోవుచు ఒక ఖండమునుండి వేరొక ఖండమునకు వర్తకపు సరుకును తీసికొని పోయెడివి. కాని తురుష్కులు వర్తకమును ప్రోత్సహించలేదు. ఒకవేళ ప్రోత్సహించినా నూతన పరిస్థితులు వారికి అడ్డు వచ్చినవి. ఆసియా యూరోపుల, మధ్య సముద్ర మార్గము లేర్పడుటయే వారికి వచ్చిన ఆటంకము. సముద్రము క్రొత్త రహదారీ అయినది. ఎవారికో పోవు ఒంటె చేసేపని ఓడ చేయడం మొదలుపెట్టింది. ఈ మార్పు రావడంవల్ల పడమటి ఆసియాకు ప్రపంచములో ప్రాముఖ్యము చాలా వరకు పోయినది. అది ఏకాంతముగా బ్రతుకజొచ్చినది. 19 వ శతాబ్ది రెండవ భాగములో సూయజ్ కాలువ తెరువబడుటవల్ల సముద్ర మార్గమునకు మరింత ప్రాముఖ్యమువచ్చెను. తూర్పు, పడమరల మధ్య ఈ కాలువ గొప్ప రహదారీ అయినది. రెండు ప్రపంచములనది సమీపమునకు తెచ్చినది.

ఇప్పుడు 20 వ శతాబ్దిలో మన కళ్ళముందర ఇంకొక మార్పు జరుగుచున్నది. భూమికిని సముద్రమునకును జరుగుచున్న పోటీలో ఇప్పుడు భూమి జయించుచున్నది. ప్రపంచపు రహదారీ అనే పేరు సముద్రమునకు పోయి భూమికి వస్తున్నది. మోటారుకార్లు రావడం వల్ల మార్పు వచ్చింది. వాయువిమానములు రావడంవల్ల పరిస్థితి పూర్తిగా మారింది. ఎంతో కాలమునుంచి వాడుకలో లేని పాతకాలపు రహదార్లు నేడు వర్తకపు రహదారులైనవి. మందముగా పోవు ఒంటెకు బదులు ఎడారిగుండా మోటారుకారు వేగముగా పోవుచున్నది. ఆకాశమున విమానము ఎగురుచూ పోవుచున్నది.

ఆటోమన్ సామ్రాజ్యము మూడు భూఖండములను కలిపినది— ఆసియా, ఆఫ్రికా, యూరోపు. కాని 19 వ శతాబ్ది పూర్వమందే అది దుర్బలమైనది. ఈ శతాబ్దిలో అది భగ్నమై పోవుచున్నది. "దేవుని

కొరడా"గా ఉండిన ఆ సామ్రాజ్యము "యూరోపు రోగి" అయ్యెను. 1914–18 లో జరిగిన ప్రపంచ యుద్ధము దాని నంతరింపజేసెను. దాని బూడిదనుండి ఆత్మ విశ్వాసము, బలము, వృద్ధికాంక్షగల టర్కీ తల యెత్తెను. అనేక నూతన రాజ్యములున్నూ తలయెత్తెను.

యూరోపును చూచుటకు వినియోగపడు ఆసియా గవాక్షము, పడమటి ఆసియా అని చెప్పియుంటిని. దానిని మధ్యధరా సముద్రము చుట్టియున్నది. ఇది ఆసియా, యూరోపు, ఆఫ్రికాలను వేరుపరుస్తూ, కలుపుతూకూడా ఉన్నది. ఈ సంబంధము వెనుకటి కాలములో ప్రబల ముగా ఉండెను. మధ్యధరా సముద్ర తీరములందున్న దేశములకు అనేక సమాన లక్షణములుండెను. యూరోపియన్ నాగరికత ప్రారంభించి నది మధ్యధరా సముద్రమందే. ప్రాచీన గ్రీసు (హెల్లాసు) ఈ మూడు ఖండముల సముద్రతీరస్థ ప్రాంతములందే తమ అధినివేశములనేర్పరుచు కొనెను. రోమను సామ్రాజ్యము దీని చుట్టునే విస్తరించినది. మధ్య ధరా సముద్రము చుట్టునే క్రైస్తవము తొలుత నెలకొన్నది. తూర్పు తీరమునుండి అరబ్బులు సిసిలీకి తమ సంస్కృతిని తీసుకుపోయిరి. దక్షిణ ఆఫ్రికా తీరములగుండా పడమటనున్న స్పెయినుకు తీసుకు పోయిరి. అచ్చట వారు 700 సంవత్సరముల కాలము నిలిచిరి.

ఆసియా తట్టునున్న మధ్యధరా సముద్ర దేశములకు, దక్షిణ యూరోపుతోను, ఉత్తర ఆఫ్రికాతోను ఎట్టి సన్నిహిత సంబంధమున్నదో మనము దీనినిబట్టి గ్రహించవచ్చును. ప్రాచీన కాలమున ఆసియాకును, మిగత రెండు ఖండములకును సంబంధమేర్పరచినది పడమటిఆసియా. జాగ్రత్తగా గమనించినట్లయితే ప్రపంచమందలి దేశములకిట్టి సంబం ధములు మనము సులభముగా చూడవచ్చును. జాతీయత అనే సంకు చిత దృక్పథము, ప్రపంచమంతా ఒకటే, వేర్వేరు దేశములు సమిష్టి క్షేమమునకు పనిచేయవలెను అనే విషయమును గుర్తించనీయడంలేదు. దేశముల భిన్నత్వమునే మనకు గోచరింపచేస్తుంది.

# సింహావలోకనము

జనవరి 19, 1933

నేనీమధ్య రెండు పుస్తకములు చదివాను. అవి నాకు చాలా నచ్చినవి. నాతోకలిసి నీవుకూడా చదివితే ఎంత బాగుండేది! వాటిని వ్రాసినవాడు ఒక ఫ్రెంచివాడు. అతనిపేరు "రెనీగ్రోసెట్." అతడు పారిస్‌లోని "గూమెట్" మ్యూజియముకు అధ్యక్షుడు. ప్రాచ్య కళను, అందు ముఖ్యముగా బౌద్ధకళను, ప్రదర్శించే ఈ చక్కని మ్యూజియము నీవు చూచావా? నీవు నాతోవచ్చినట్లు జ్ఞాపకంలేదు. గ్రోసెట్ నాలుగు సంపుటములలో ప్రాచ్య (ఆసియాకు సంబంధించిన) నాగరీకతలను గూర్చి పరామర్శించి వ్రాశాడు. ఒక సంపుటము ఇండియాను గురించి, ఒకటి మధ్య ప్రాచ్యమును, అనగా పడమటి ఆసియా పర్షియాలను, గురించి, ఒకటి చీనాను, మరియొకటి జపానును గురించి. అతనికి కళమీద అభిమానము మెండు. వివిధ కళా వైఖరులు ఏవిధంగా అభివృద్ధి చెందాయో అతడు చూపాడు. ఎన్నో చక్కని చిత్రములుకూడా గ్రంథములో ఉన్నవి. చరిత్ర నేర్చుకోవడానికి ఈ పద్ధతి ఉత్తమమైనదీ, ప్రీతికరమైనదీ. యుద్ధములు, రాజుల కుట్రలు మున్నగువానిని గురించి నేర్చుకొన్న చరిత్ర ఇట్టిదికాదు.

ఇంతవరకూ నేను గ్రోసెట్ సంపుటములు రెండు—ఇండియా, మధ్య ప్రాచ్యములను గురించినవి—చదివాను. నాకు ఎంతో ఆనందము నిచ్చినవి. చక్కని భవనముల, గంభీర ప్రతిమల, అద్భుతమగు కుడ్య చిత్రముల, చిత్రపటముల బొమ్మలు నన్ను డెహ్రాడూన్ చెరసాలనుంచి దూర దేశములకూ, ప్రాచీన కాలమునకూ కొనిపోయినవి.

ఇండియా వాయవ్యదిక్కున, సింధులోయలోని మొహెంజొదారోను, హరప్పాను గురించి నీకు ఎన్నడో వ్రాసి ఉంటిని. 5000

సంవత్సరముల క్రితము వర్ధిల్లిన ప్రాచీన నాగరికత శిధిలములవి. ఆ ప్రాతకాలములో మొహెంజొదారోలో ప్రజలు పనులు చేసుకొంటూ, ఆడుకొంటూ జీవిస్తూన్న కాలంలో ఇంకా అనేక నాగరికతా కేంద్రములు ఇతరత్రా ఉండెను. మనకు తెలిసిన విషయములు కొద్ది. ఆసియా ఈజిప్టులలో కానవచ్చిన శిధిలములనుబట్టి మనము గ్రహించిన విషయములే మనకు తెలిసినవి. ఇంకా కష్టపడి వివిధ ప్రాంతాలలో లోతుగా త్రవ్వి చూస్తే అట్టి శిధిలములింకా ఎన్నో మనకు గోచరించవచ్చును. ఈజిప్టులో నైలు లోయలోనూ, చాల్డియా (మెసపొటేమియా)లోనూ (అచ్చట ఎలాం రాజ్యమునకు సుసా రాజధానిగా ఉండెను), తూర్పు పర్షియాలో పెర్శిపోలిస్‌లోనూ, మధ్య ఆసియాలోని తురుష్క స్థానములోనూ, చీనాలో పచ్చనది అని పేర్కొనబడు హోయాంగ్ హో ప్రాంతముననూ ఆ రోజులలో ఉన్నతి గన్న నాగరికత వర్ధిల్లెనని మనకింతవరకు తెలిసినది.

ఈ కాలమున రాగిని మానవు లుపయోగములో పెట్టుటకు ప్రారంభించిరి. శిలాయుగము (నునుపురాళ్ళ నుపకరణములుగా వాడు కాలము) దాటిపోవుచుండెను. ఈజిప్టునుండి చీనావరకూ గల విశాల భూమిలో అంతటా సరిసమానమగు అభివృద్ధినే మానవులు పొందినట్లున్నారు. ఒకే విధమగు నాగరీకత ఆసియా ఖండమందంతటా వ్యాపించినట్లు నిదర్శనములు కనిపించుచుండుట ఆశ్చర్యకరము. వేర్వేరు నాగరికత కేంద్రములు వేటికవి ప్రత్యేకముగా నుండలేదనియు, ఒకదానితో ఒకటి సంబంధములు పెట్టుకొనుచుండెననియు దీనిని బట్టి మనము గ్రహించవచ్చును. వ్యవసాయము వృద్ధిలోనుండెను. పెంపుడు జంతువులను మానవులు పెంచుచుండిరి. కొంతవరకు వర్తకముకూడా సాగుచుండెను. వ్రాతకళ పొడచూపినది. కాని ఈ ప్రాచీన చిత్రలిపి చదువుట ఎట్లో ఇంకా తెలిసికొనలేదు. దూర ప్రాంతములందు ఒకే విధమగు ఉపకరణములు దొరికినవి. కళావిలసితమగు వస్తువులుకూడా ఒకదానిని పోలి

ఒకటి ఉన్నవి. చిత్రముగల కుండలు, వివిధ లతాద్యలంకరణములతో శోభిల్లు సుందర పాత్రలు ముఖ్యముగా పేర్కొనదగ్గవి. ఇట్టి కుండలు అన్ని ప్రాంతములందును దొరుకుటచేత ఈ కాలమునకు "చిత్ర కుంభ నాగరికత" అనే పేరు వచ్చింది. అప్పుడు బంగారము, వెండి నగలు వాడుకలో ఉండెను. చలువరాతి పాత్రలుండెను. నూలు బట్టలు సైతముండెను. ఈజిప్టునుండి సింధు లోయ వరకునూ, చీనావరకునూ వ్యాపించిన తొలినాటి నాగరికతా కేంద్రములు ప్రతిఒక్కదానిలోనూ కొన్ని ప్రత్యేక లక్షణములుండెను. కాని అన్యోన్య సంబంధముగల సమాన లక్షణములతోకూడ ఆ నాగరికత విలసిల్లినట్లు తోచును.

ఇది సుమారు 5000 సంవత్సరముల క్రితము మాట. అట్టి నాగరికత అభివృద్ధి దశలో నున్నట్లు స్పష్టము. ఇది అభివృద్ధి గాంచుటకు కొన్ని వేల సంవత్సరములు పట్టియుండును. నైలు లోయలోనూ, చాల్డియాలోనూ వర్థిల్లిన నాగరికత అంతకు 2000 సంవత్సరముల పూర్వమందున్నట్లు నిదర్శనములు చూపవచ్చును. బహుశా ఇతర కేంద్రములకున్నూ అంతవయస్సే ఉండి యుండ వచ్చును.

తొలి తామ్రయుగమునకు సంబంధించినట్టివీన్నీ, సమాన లక్షణములు గలట్టివీన్నీ, విపుల భూభాగముపై వ్యాపించినట్టివీన్నీ యీ నాగరికత నుండి—అనగా సుమారు క్రీ. పూ. 3000 లో నున్న మొహెంజొదారొ కాలమునకు సంబంధించిన నాగరికతనుండి, నాలుగు తూర్పు నాగరికతలున్నూ భిన్నమై భిన్న మార్గములు పట్టి ప్రత్యేకముగా వృద్ధినందెను. ఈ నాలుగు నాగరికతలు ఈజిప్టుకు, మెసపొటోమియాకు, ఇండియాకు, చీనాకు సంబంధించినవి. ఈ ఉత్తర కాలమందే ఈజిప్టులో మహా పిరమిడ్లున్నూ, "గీజె" వద్ద "స్ఫింక్సు" విగ్రహమున్నూ నిర్మింపబడెను. కొంతకాలము గడచినపిదప ఈజిప్టులో "థీబన్" రాజ్యకాలమువచ్చెను. అప్పుడు థీబన్ సామ్రాజ్యము, సుమారు క్రీ. పె. 2000 లో వర్ధిల్లెను. అప్పుడు అద్భుతమగు శిలా ప్రతిమలున్నూ, కుడ్య చిత్రములున్నూ

సృష్టింపబడెను. ఆ కాలమున కళా పునరుజ్జీవనము జరిగెను. సుమారీకాలమునందే లక్సార్ మహా దేవాలయము నిర్మింపబడెను. ట్యూటన్ ఖామెన్ పేరు అందరికీ తెలిసినట్లున్నది. కాని అతనిని గురించి ఎవరికీ ఏమీ తెలియదు. ఇతడు థీబన్ "ఫారో"లలో ఒకడు.

చాల్డియాలో సుమేర్, అక్కాడ్ అను రెండు ప్రదేశములలోనూ ప్రబలరాజ్యములు తలయెత్తెను. చాల్డీసుల మహానగరమగు "ఉర్"లో మొహెంజొదారొ కాలమున, కళావైభవముతో విలసిల్లువస్తువులు తయారగుచుండెను. సుమారు 700 సంవత్సరముల కాలము ప్రభుత్వము నెరపిన పిమ్మట "ఉర్" నగరము ధ్వంసమాయెను. యూదులు, అరబ్బులు వలె సెమిటిక్ జాతి జనులైన బాబిలోనియనులు, సిరియానుండి వచ్చి నూతన పాలకులైరి. బాబిలన్ నగరమిప్పుడు నూతన సామ్రాజ్యమునకు కేంద్రమయ్యెను. బైబిలులో తరుచు బాబిలన్ పేర్కొనబడ్డది. ఈ కాలమున సాహిత్యము మరల తలయెత్తెను. మహా కావ్యములు వ్రాయబడెను. వాటిని పాడుచుండిరి. ఈ మహా కావ్యములందు ప్రపంచోత్పత్తి, మహా జల ప్రళయము వర్ణించబడ్డవి. బైబిలులో తొలి ప్రకరణము లీ గాథల ననుసరించి వ్రాయబడ్డవని చెప్పుదురు.

తరువాత బాబిలన్ పతనమాయెను. అనేక శతాబ్దులు గడచిన పిమ్మట (సుమారు క్రీ. పూ. 1000 తరువాత) అస్సీరియనులు రంగమున ప్రవేశించిరి. వారు "నినేవా" రాజధానిగా ఒక సామ్రాజ్యమును స్థాపించిరి. వీరు అసాధారుణులు. వట్టి మృగప్రాయులు. క్రూరులు. వారి ప్రభుత్వ విధానమంతయూ రాక్షసత్వముపై ఆధారపడియుండెను. మధ్య ప్రాచ్య మందంతటా విధ్వంసమూ, హత్యలూచేసి, వారొక మహా సామ్రాజ్యమును నిర్మించిరి. ఆ రోజులలో వారు సామ్రాజ్యవాదులు. అయినా కొన్ని విషయాలలో వారికి గొప్ప సంస్కృతికలదు. నినేవా నగరములో ఒక గొప్ప పుస్తక భాండాగారముండెను. అనాటి విజ్ఞాన శాఖలకు సంబంధించిన గ్రంథములందుండెను. అవి కాగితముల

గ్రంథములు కావని నీకు చెప్పనక్కరలేదు. ఆనాటి గ్రంథములు నేటి గ్రంథములవలె ఉండవు. ఆనాటిగ్రంథములు పలకల (కఱ్ఱ, రాతి మొ.)పై ఉండెను. నినేవా భాండాగారమునుండి గ్రహింపబడ్డ ఇట్టి పలకలు వేల కొలది నేడు లండనులోని బ్రిటిషు మ్యూజియంలో ఉన్నవి. అందు కొన్ని పలక గ్రంథములు జుగుప్సాకరముగనున్నవి. శత్రువుల నారాజు ఎట్లు చిత్రహింసలపాలు చేసినో, తానెట్లు ఆనందించెనో అందు వర్ణింపబడినది.

మొహెంజొదారొ కాలముతరువాత ఇండియాకు ఆర్యులువచ్చిరి. వారు వచ్చిన కాలమునకు సంబంధించిన శిధిలములుకాని, శిలాప్రతిమలు కాని ఇంతవరకూ దొరకలేదు. కాని వారి మహోత్కృష్ట జ్ఞాపక చిహ్నములు, వారి ప్రాచీన గ్రంథములైన వేదాదులు, హిందూదేశ మైదానములందు దిగిన ఈ వీరుల మనస్తత్వము కొంత ఈ గ్రంథములనుబట్టి మనము తెలుసుకోవచ్చును. ప్రకృతికి సంబంధించిన దివ్య కవిత్వముతో ఈ గ్రంథములు నిండియున్నవి. ప్రకృతి దేవతలే దేవుళ్ళు. కళ వృద్ధిజెందినప్పుడు ప్రకృతిపై ప్రేమ విజృంభించుట సహజమే. భూపాల సంస్థానమువద్దనున్న సాంచీ ద్వారములు మనకు దొరికిన కళా సంబంధమగు శిధిలములలో ఓక్కిలి ప్రాచీనమైనవి. తొలి బౌద్ధ కాలమునాటివివి. ఈ ద్వారములపై పువ్వులు, ఆకులు, మృగరూపములు చక్కగా చెక్కబడినవి. చెక్కిన శిల్పులకు ప్రకృతిపై అభిమానమెంతగలదో, ప్రకృతిని ఎంతగా వారర్థము చేసికొనిరో మనకు వ్యక్తమగుచున్నది.

పిమ్మట వాయవ్య దిశనుండి గ్రీకుల కళా ప్రభావము పొడచూపింది. నీకు జ్ఞాపకమున్నదో లేదో: అలెగ్జాండరు తరువాత హేల్లనిక్ సామ్రాజ్యములు ఇండియా పొలిమేరల వరకూ వచ్చెను. తరువాత హేల్లనిక్ సంబంధముగల కుషాణుల పొలిమేర సామ్రాజ్యము వెలిసెను. బుద్ధుడు విగ్రహారాధనకు విముఖుడు. తాను భగవంతుడనని అతడు చెప్పుకోలేదు. తన్ను పూజించమని చెప్పలేదు. మతాచార్యులు సంఘ

ములో ప్రవేశపెట్టిన దోషములను తొలగించవలెనని అతడు కోరెను. పతితులను, ఆర్తులను ఉద్ధరించ ప్రయత్నించిన సంస్కర్త అతడు. వారణాసి వద్దనున్న సారనాధములో (ఈశిపట్టనములో) చేసిన మొట్ట మొదటి ధర్మోపన్యాసములో అతడిట్లు చెప్పెను—"అజ్ఞానులకు జ్ఞానోప దేశము చేయుటకు నేను వస్తిని ...జీవుల కుపకారము చేయకుంటే, దిక్కులేనివారికి ఊరట కల్పించకుంటే ఉత్తమపురుషుడెట్లాకాగలడు?... నా మత సిద్ధాంతము జాలితో కూడుకొన్నది. అందుకనే సుఖములనుభ వించే లోక ప్రజలకిది దుష్కరముగా కనిపిస్తుంది. ముక్తి మార్గమందరి కినీ అందుబాటులో ఉన్నది. చండాలుడు మాతృగర్భముననుండి వచ్చిన వాడు. చండాలునకు ముక్తి లేదని చెప్పే బ్రాహ్మణున్నూ మాతృ గర్భమునుండి వచ్చినవాడే. పూరిగుడిసెను ఏనుగు ధ్వంసముచేసేటట్లు మీ కామాదులను నాశము చేసుకొండి ...దుఃఖ నిర్వృతికి మార్గము సత్యమును గ్రహించుటయే." ఈ విధముగా బుద్ధుడు సదాచారమును జీవన విధానమును బోధించెను. అతని శిష్యులలో అనేకులు బాహ్య నియమములను మాత్రము పాటించి అంతరార్థమును గ్రహింపకుండిరి. గురు వాక్యములందలి అంతరార్థమును గ్రహింపలేని తెలివితక్కువ శిష్యులిట్లేగదా చేసేది. అతని ఉపదేశములను ఆచరణలో పెట్టుటకు బదులు వారాతనిని పూజించిరి. అప్పటికింకా బుద్ధ విగ్రహములుకాని, ప్రతిమలుకాని పుట్టలేదు.

తరువాత గ్రీసు మున్నగు హెల్లనిక్ దేశములనుండి నూతనాభి ప్రాయములు ఇండియాకు వచ్చెను. ఆ దేశములలో దేవుళ్ళ ప్రతిమ లందముగా జేసి పూజించుచుండిరి. ఇండియాకు వాయవ్య దిశయందున్న గాంధారములో వాటి ప్రభావము అతిశయముగా ఉండెను. బుద్ధ శిశువు విగ్రహము శిలలో అప్పుడు మలిచిరి. గ్రీకుల అందమైన చిన్నమన్మథ దేవుని ప్రతిమవలెనే, పిదపకాలములో క్రీస్తు శిశువు ప్రతిమవలెనే బుద్ధ శిశువు ప్రతిమయున్నూ, "పవిత్ర శిశువు" అని పేరుగాంచినది. ఈ

విధముగా బౌద్ధములో ప్రతిమాపూజ ప్రారంభమాయెను. క్రమక్రమముగా ఈ ఆచారము వృద్ధి కాగా బౌద్ధ దేవాలయములన్నింటా బుద్ధ విగ్రహములు వెలిసెను.

భారతీయ కళకు పర్షియన్ సంపర్కముకూడ కలిగెను. బుద్ధ గాథలున్నూ, హైందవ పురాణ గాథలున్నూ హైందవ శిల్పులకు నిరంతరముగా విషయ సమృద్ధి చెకూర్చుచుండెను. ఆంధ్రదేశ మందలి అమరావతిలోనూ, బొంబాయివద్దనున్న ఎలిఫెంటా గుహలలోనూ. అజంతాలోనూ, ఎల్లోరాలోనూ, ఇంకా అనేక ఇతర ప్రదేశములలోనూ ఈ గాథలు మనకు శిలా రూపమునా, చిత్తరువులుగానూ గోచరమగుచున్నవి. ఈ అద్భుత ప్రదేశములన్నీ దర్శింపదగినవి. ప్రతివిద్యార్థియు, విద్యార్థినియు వీటిలో కొన్నింటినైన చూడగలిగి యుందురని ఆశిస్తాను.

హైందవ గాథలు సముద్రములుదాటి మహా హిందూస్థానమునకు ప్రాకినవి. జావాలోని బోరోబుదూరులో బుద్ధ చరిత్ర అంతయు చక్కని శిలా చిత్రపరంపరగా చిత్రింపబడినది. 'ఆంగ్ కోరువట' శిథిలములలో నేటికిని అనేక సుందర ప్రతిమలు కానవచ్చును. 800 సంవత్సరముల క్రితము ఈ నగరము తూర్పు ఆసియాలో "వైభవోపేతమగు అంకోరు" పేరు గడించుకొన్న కాలమునివి తలపులకు తెచ్చెను.

ప్రజా జీవనమును వారి నాగరికతను ఉన్నదున్నట్లు ప్రతిబింబింపచేసేది కళ. హైందవ నాగరికత జీవకళలతో నున్నప్పుడు సుందర వస్తువులనేకమది సృష్టించింది. కళలు వర్థిల్లినవి. దానిపేరు దూరదేశములలో మ్రోగింది. కాని రానురాను అభివృద్ధి ఆగిపోయింది. క్షీణదశ ప్రారంభించింది. దాని పతనముతోపాటు కళలు క్షీణించినవి. శిల్పములలో జీవకళలు మాయమైనవి. శక్తి జారిపోయింది. చిత్రములలో వివరణ లెక్కువైనవి. అంద వికారముగాకూడ తయారైనవి. తరువాత మస్లిములు వచ్చిరి. వారి రాకతో కళకు కొత్త సంపర్కములు తగిలెను. హైందవకళను నీచ పరచిన అత్యలంకరణము తగ్గిపోయెను.

ప్రాచీన హైందవా దర్శము నిలిచియే ఉండెను. కాని అరేబియా, పర్షియాల నుండీ వచ్చిన చక్కని కొత్త ఉడుపులనది ధరించెను. పాత కాలమున వేలకొద్దిగా హైందవ వాస్తు శాస్త్రజ్ఞులు ఇండియానుండి మధ్య ఆసియాకు వెళ్ళిరి. ఇప్పుడు మధ్య ఆసియానుండి వాస్తు శాస్త్రజ్ఞులూ, చిత్రకారులూ ఇండియాకు వచ్చిరి. పర్షియాలోనూ. మధ్య ఆసియాలోను కళపునరుజ్జీవిత మయ్యెను. కాంస్టాంటినోపులులో వాస్తు శాస్త్రజ్ఞులు మహా భవనముల నిర్మించుచుండిరి. ఈ కాలమునందే ఇటలీలో కూడ పునరుజ్జీవనము కలిగెను. ఉత్కృష్ట శిల్పోపాధ్యాయులనేకులు చక్కని చిత్తరువులనూ, శిలా ప్రతిమలనూ నిర్మించిరి.

ఆనాడు ప్రసిద్ధి నందిన తురుష్క శిల్పి సినాన్ అనువాడు. అతని ముఖ్య శిష్యుడైన యూసూపును బాబరు తనకొలువుకు పిలిపించుకొనెను. ఇరాన్‌లో బిజాడ్ అను గొప్ప చిత్రకారుడుండెను. అక్బరు అతని శిష్యుల ననేకులను రప్పించుకొని వారిని ఆస్థానశిల్పులనుచేసెను. గృహ శిల్పమందును, చిత్తరువులందును పర్షియన్ కళా ప్రభావము అమిత ముగా నుండెను. వెనుక ఒక జాబులో, మొగల్ ఇండియాలోని ఇండో-మస్లిము శిల్పమునకు సంబంధించిన కొన్ని మహా భవనములనుగురించి చెప్పియుంటిని. నీవు అనేకము చూచియుంటివి. ఇండో—పర్షియన్ కళకు పరమావధి తాజ్‌మహలు. దాని నిర్మాణమునకు శిల్పులనేకులు పాయపడిరి. అందు ప్రధాన శిల్పి ఉస్థాద్ ఈసా అను తురుష్కుడో, పర్షియనో అట. అతనికి ఇండియన్ శిల్పులు సహాయము చేసిరట. కొందరు యూరోపియన్ శిల్పులు, అందుముఖ్యముగా ఒక ఇటాలియన్, అంతర్భాగమందలి అలంకరణములు చేసిరట. శిల్పాచార్యులనేకులీ కార్యమును పూనుకొని పనిచేసినప్పటికీ అందు సామరస్యమున కెట్టి లోటూ రాలేదు. భిన్నభిన్న శిల్ప వైఖరులు ఏకముఖమై సామరస్యముతో ఒక అద్భుత భవనమును నిర్మించెను. తాజ్ నిర్మాణమున కనేకులు పాయపడ్డప్పటికీ అందు స్పష్టముగా కానవచ్చు శిల్ప వైఖరులు

రెండే—అవి పయన్ పైఖరీ, ఇండియన్ర్షి పైఖరీ. అందువల్లనే గ్రౌసెట్ తాజ్‌ను గూర్చి ఇట్లు వ్రాశాడు—"ఇండియా దేహమున అవతరించిన ఇరాన్ ఆత్మ అది."

# 124

# ఇరాన్ ప్రాచీన సంప్రదాయములు నిరంతరాయముగా సాగుట

జనవరి 20, 1933

మనమిప్పుడు పర్షియాకు వెడదాము. దాని ఆత్మ ఇండియాకు వచ్చి తాజ్ ప్రశస్తదేహములో నెలకొన్నదనిగదా చెప్పుదుడు. పర్షియా కళకొక అసాధారణ సంప్రదాయము కద్దు. ఈ సంప్రదాయము అస్సీరియనుల కాలమునుంచీ—2000 సంవత్సరముల కాలము సాగినది. ప్రభుత్వములు మారినవి. రాజ వంశములు మారినవి. మతము మారినది. దేశము పరాక్రాంతమూ అయినది. సొంతరాజుల పరిపాలనకిందా ఉన్నది. ఇస్లాం వచ్చి అనేక మార్పులు తెచ్చిపెట్టినది. అయినా ఈ సంప్రదాయము ఆ విధముగానే నిలిచిపోయెను. యుగములు గడచిన కొద్దీ అది మారి అభివృద్ధి చెందినమాట వాస్తవమే. పర్షియన్ కళకు పర్షియన్ భూమితోను, ప్రకృతి దృశ్యములతోను ఉన్న సంబంధము వల్లనే నిరంతరాయముగా ఈ సంప్రదాయము ఇట్లుసాగినదని చెప్పుదురు.

వెనుకటి జాబులో—నినేవా రాజధానిగాగల అస్సీరియన్ సామ్రాజ్యమును గురించి చెప్పియుంటిని. క్రీస్తుకు 500, 600 సంవత్సరములకు పూర్వము ఆర్యులైన ఇరానియనులు నినేవాను స్వాధీనము చేసికొని అస్సీరియన్ సామ్రాజ్యమును అంతరింపజేసిరి. పిమ్మట పర్షియన్—ఆర్యులు సింధు తటములు మొదలు ఈజిప్టువరకూ ఒక మహా సామ్రాజ్యమును నిర్మించుకొనిరి. ప్రాచీన ప్రపంచమున వారు అధికారమును

చెలాయించిరి. గ్రీకు గ్రంథములలో వారి పాలకుని "మహారాజ" నితరుచు పేర్కొనుట కలదు. సైరస్, డరయస్, జర్క్సను అట్టి మహా రాజులలో కొందరు. డరయస్, జర్క్సనులు గ్రీసును జయించుటకు పూనుకొని పరాజయ మొందిరన్నమాట జ్ఞాపకమున్నదా ? ఈ రాజవంశ మునకు అచెమినీడ్ రాజవంశమని పేరు. 220 సంవత్సరములకాలము అది ఒక మహా సామ్రాజ్యమును పాలించెను. చివరకు మహా అలెగ్జాండరు దానిని తుదముట్టించెను.

అస్సీరియనులు, బాబిలోనియనులు పరిపాలించిన పిమ్మట పర్షియనులు వచ్చుట ప్రజలకు సుఖదాయకముగా ఉండియుండును. పర్షియనులు, నాగరీకులు; సహనముగల పాలకులు. వివిధ మతములనూ, సంస్కృతులనూ వారు వర్ధిల్లనిచ్చిరి. సామ్రాజ్యము విస్తారమైనను చక్కగా పరిపాలింపబడుచూవచ్చెను. రాక పోకలు సక్రమముగా జరుగుటకై దేశమందంతటా రాచబాటలు వేయబడెను. ఇండియాకు వచ్చిన ఇండో–ఆర్యులకును, పర్షియనులకును దగ్గర సంబంధము కలదు. వారి మతమును జరత్రుష్ట్రా (జొరాష్టర్) స్థాపించెను. తొలి వేదమతమునకును సంబంధముకలదు. ఆర్యుల తొలి నివాస స్థానములో ఆ రెండు మతములును ఒకే మాతృకనుండి పుట్టినట్లు స్పష్టము.

అచెమినీడ్ రాజులు గొప్ప భవన నిర్మాతలు. వారి రాజధానీ నగరమైన పెర్సిపోలిస్‌లో వారు గొప్ప ప్రాసాదములు నిర్మించిరి. అనేక స్తంభములతో కూడిన పెద్ద మంటపములందు గలవు. వారు దేవాలయములను కట్టలేదు. నేడు వాటి శిధిలములను చూచినట్లయితే అవి ఎంత గొప్ప కట్టడములో మనకు బోధపడుతుంది. మౌర్యుల కాలము (అశోకుడు మొ॥) నాటి హైందవ కళతో ఆ చెమినీడ్ కళకు సంబంధమున్నట్లు తోస్తుంది. ఈ కళ దానిలో పూర్వులు కలిగించినట్లు కూడా తోస్తుంది.

డరయస్ మహా రాజును అలెగ్జాండరు ఓడించి అచెమినీడ్ రాజ

వంశము నంతమొందించెను. తరువాత గ్రీకు పరిపాలనము వచ్చెను. అలెగ్జాండరు సేనాని సెల్యూకసున్నూ, అతనితరువాత వచ్చినవారున్నూ కొంత కాలము పాలించిరి. తరువాత సగము పరదేశస్థులైనవారి పరిపాలనము జరిగెను. అప్పుడుకూడా గ్రీకు సంపర్కమే వారికి చిరకాలముండెను. ఇండియా పొలిమేర రాజ్యము స్థాపించుకొని దక్షిణమున వారణాసివరకూ, ఉత్తరమున మధ్య ఆసియావరకూ పాలిస్తున్న కుషాణులు వీరి సమకాలికులు. వారికికూడ గ్రీకు సంపర్కముండెను. ఇట్లు ఇండియాకు పడమటనున్న ఆసియా అంతటా, అలెగ్జాండరు తరువాత 500 సంవత్సరములవరకూ, అనగా క్రీ. పె. మూడవ శతాబ్దివరకూ గ్రీకుల ప్రభావము కనిపించుచునే ఉండెను. ఇది ముఖ్యముగా కళకు సంబంధించినది. పర్షియా మతమైన జొరాష్ట్రియానిజముతో అది ప్రశక్తి పెట్టుకోలేదు.

మూడవ శతాబ్దిలో పర్షియా దేశమున జాతీయ ప్రబోధము కలిగెను. ఒక నూతన రాజవంశము అధికారమునకు వచ్చెను. ఇది సస్సనీడు రాజవంశము. జాతీయభావము లీ రాజవంశమున దురుసుగా పని చేయుచుండెను. ప్రాచీన ఆచెమినీడ్ రాజుల వారసులమని వారు చెప్పుకొనుచుండిరి. దురుసుగాపోయే జాతీయత సాధారణముగా, సంకుచితముగానూ, అసహనముతోనూ పనిచేయును. అది అట్లుండవలసి వచ్చినది. ఎందువల్లనంటే—పడమర రోమన్ సామ్రాజ్యము, కాంస్టాంటి నోపుల్ తాలూకు బైజాంటైను సామ్రాజ్యమున్నూ కలవు. తూర్పున తురుష్కుల తెగలు ముందుకు చొచ్చుకొని వచ్చుచుండిరి. ఈ రెంటిమధ్యను అది చిక్కుకొన్నది. అయినప్పటికిన్నీ ఇస్లాం ఆగమన కాలమువరకున్నూ అనగా 400 సంవత్సరములకు పైబడి అది రాజ్యము చేయగలిగింది. సస్సనీడుల పరిపాలన కాలములో జొరాష్ట్రియన్ పురోహిత వర్గము మిక్కిలి ప్రబలముగా నుండెను. రాజ్యము వారిచర్చి చెప్పు చేతలలో ఉండెను. వారి ఆజ్ఞల కెవరును ఎదురొడ్డరాదు. ఈ కాలమునందే వారి

మత గ్రంథమైన అవెస్థా పాఠస్వరూపము నిష్టయ మైనదనిచెప్పుదురు.

ఈ కాలమున ఇండియాలో గుప్త సామ్రాజ్యము వర్ధిల్లుచుండెను. కుషాణ బౌద్ధ యుగముల తరువాత వచ్చిన జాతీయ ప్రబోధమునకు ఫలముగా ఏర్పడినదే ఈ సామ్రాజ్యము. కళా సారస్వతములానాడు పునరుజ్జీవితములయ్యెను. కాళిదాసు కంటె ఉత్తమ సంస్కృత కవులానాడుండిరి. సస్సనీడుల పరిపాలనమందున్న పరిషియా, గుప్తుల ఇండియాతో కళా విషయమున సంసర్గ పెట్టుకొన్నట్లు అనేక నిదర్శనములు కలవు. సస్సనీడుల కాలమునకు చెందిన చిత్తరువులును, శిల్పములును బహు కొద్దిగా మాత్రమే నేటివరకూ నిలిచి ఉన్నవి. ఉన్నవాటిలో జీవకళలుట్టిపడుచున్నవి. అందలి మృగములు అజంతా కుడ్య చిత్రములందలి మృగములతో దగ్గర పోలిక కలిగి ఉన్నవి. సస్సనీడుల కళా ప్రభావము చీనావరకునూ, గోబీ ఎడారివరకునూ కూడా వ్యాపించినట్లు తోచుచున్నది.

దీర్ఘ కాలము రాజ్యముచేసి చివరకు సస్సనీడులు దుర్బలులైరి. పర్షియాకు చెడ్డరోజులు వచ్చెను. బైజాంటైను సామ్రాజ్యముతో చిర కాలము యుద్ధములు జరిగెను. ఉభయ పక్షములవారూ అలసిపోయిరి. నూతన మతావేశముతో నిండిన అరబ్బీ సేనలకు పర్షియాను జయించుట కష్టసాధ్యము కాకుండెను. ఏడవశతాబ్ది మధ్యకాలమునకు, అనగా మహమ్మదు ప్రవక్త మరణించి పది సంవత్సరములు కాకముందే పర్షియా కాలీఫు పరిపాలనలో పడెను. మధ్య ఆసియాకును, ఉత్తర ఆఫ్రికాకును అరబ్బీ సేనలు వ్యాపించినప్పుడు వారితోకూడా వారి నూతన మతమును కొంపోయిరి. బాల్యములోనున్న, వర్ధమాన మగుచున్న నాగరికతను కూడా కొంపోయిరి. సిరియా, మెసపొటేమియా, ఈజిప్టు దేశములు అరబ్బీ సంస్కృతి వశమయ్యెను. అరబ్బీ భాష వారి భాష అయ్యెను. ఆ దేశపు తెగలు అరబ్బీల తెగలలో లీనమయ్యెను. బాగ్దాదు, డమస్కసు, కైరో పట్టణములు అరబ్బీ సంస్కృతికి మహా కేంద్రము

లయ్యెను. నూతన నాగరికతా ప్రభావమువల్ల చక్కని సౌధములనేకము తలయెత్తెను. నేడు సైతము ఈ దేశములన్నీ అరబ్బీ దేశములుగానే పరిగణింప బడుచున్నవి. ఈ దేశములు వేరు వేరుగా ఉన్నప్పటికీ ఐక్యతను ఆసించుచున్నవి.

ఇట్లే పర్షియా అరబ్బులచేత జయించబడెను. కాని సిరియా ఈజిప్టు దేశములలో జరిగినట్లు ఇందలి ప్రజలు అరబ్బులతో లీనము కాలేదు. ఇరానియన్ వంశస్థులు ప్రాచీన ఆర్య సంతతికి చెందినవారు. సెమెటిక్కులైన అరబ్బులతో వారికి సంబంధము తక్కువ. వారి భాష కూడ ఆర్యభాషయే. కావుననే ఆ వంశము ప్రత్యేకముగా నిలిచిపోయెను. వారి భాష వర్ధిల్ల జొచ్చెను. ఇస్లాం వేగముగా అలుముకొని జొరాష్ట్రియా నిజం స్థానము నాక్రమించెను. చివరకు ఇది ఇండియాలో తలదాచు కోవలసి వచ్చెను. ఇస్లాం మతము నవలంబించినప్పటికీ పర్షియనులు కొత్తమార్గమును తొక్కిరి. ఇస్లాంలో విభేధములు పుట్టెను. రెండు పక్షములు తలయెత్తెను. ఇస్లాంకు రెండు శాఖలు ఏర్పడెను. ఒకటి షియా శాఖ, ఒకటి సున్నీశాఖ. పర్షియా, నాటినుండి నేటివరకూ ప్రధానముగా, షియా దేశముగా నిలిచిపోయెను. మిగత ఇస్లాం మత మవలంబించిన ప్రపంచము చాలావరకు సున్నీ మత శాఖావలంబి అయ్యెను.

పర్షియా ప్రజలు అరబ్బులలో లీనము కాకున్ననూ అరబ్బీ నాగరికత ప్రభావము ప్రబలముగా వారిపై పనిచేసెను. ఇండియాలోవలెనే, ఇంస్లాం మతము అచ్చటి కళకు నూతన చైతన్యమునిచ్చెను. పర్షియన్ సంప్రదాయమువల్ల అరబ్బీకళయు, సంస్కృతియుకూడ అట్లే మార్పులు చెందెను. పర్షియన్ భోగలాలసత్వము ఎడారిలో పుట్టి పెరిగిన అమాయకుల ఇండ్లలో ప్రవేశించెను. అరబ్బీ కాలీపు కొలువు కూటము, ఇతర సామ్రాజ్యముల కొలువుకూటముల వలెనే వైభవోపేతమై వెలుగు చుండెను. సామ్రాజ్య రాజధానియైన బాగ్దాదు ప్రపంచ మందెల్ల ప్రసిద్ధి

చెందిన మహా పట్టణమయ్యెను. దానికి ఉత్తరమున, టైగ్రీసు నదిపై నున్న సమర్రాలో కాలీఫులు తమకొరకు బ్రహ్మాండమగు మసీదును, భవనమును కట్టుకొనిరి. దాని శిధిలములు నేటికిని నిలిచియున్నవి. మసీదులో పెద్ద హాలులూ, కేళాకూళులతో కూడిన ముంగిళ్లు ఉండెను. రాజ భవనము దీర్ఘ చతురస్రాకారముగా ఉండెను. ఒకతట్టున దాని పొడవు 1111 గజములను మించివుండెను.

తొమ్మిదవ శతాబ్దిలో బాగ్దాదు సామ్రాజ్యము శిధిలమై కొన్ని రాజ్యములుగా చీలిపోయెను. పర్షియా స్వతంత్రమయ్యెను. తూర్పు నుండి వచ్చిన తురుష్క తెగలు అనేక రాజ్యములను స్థాపించుకొనిరి. చివరకు వారు పర్షియానే స్వాధీనము చేసుకొని బాగ్దాదులో నామకః ఉన్న కాలీఫుపై అధికారము చెలాయించిరి. గజనీ మహమ్మదు పదకొండవ శతాబ్దిని తలయెత్తి ఇండియాపై దాడి సాగించెను. కాలీ పును బెదిరించెను. అల్పకాలము జీవించిన సామ్రాజ్యమును స్థాపించు కొనెను. వేరొక తురుష్క తెగ, సెల్జూకులు. దీనిని తుదముట్టించిరి. క్రైస్తవ మతవీరులను ఎదుర్కొని సెల్జూకులు చిరకాలము పోరాడ విజయమందిరి. వారి సామ్రాజ్యము 150 ఏండ్లు నిలిచెను. పన్నెండో శతాబ్దాంతమున వేరొక తురుష్క తెగ పర్షియానుండి సెల్జూకును తరిమి వేసి ఖ్వారిజం (ఖీవా) రాజ్యమును స్థాపించుకొనిరి. కాని ఇది కొద్ది కాలమే నిలిచెను. ఖ్వారిజం రాజ్యాధినేత షా తన రాయబారిని అవమా నించెనని కోపించి చెంగిజ్ ఖాన్ మంగోలు దండులతో వచ్చి దేశ మునూ, ప్రజలనూ కూడా అణచివేసెను.

ఒక చిన్న పేరాలో అనేక మార్పులను గురించియు, అనేక సామ్రాజ్యములను గురించియు చెప్పితిని. ఇదంతా గందరగోళముగా ఉండి ఉండాలి. రాజవంశముల యొక్కయు, తెగల యొక్కయు ఔన్నత్య పతనములను గురించి నీకు చెప్పడము నీ మనస్సుకు శ్రమ కలిగించవలెనని కాదు. ఇన్ని ఒడుదుడుకులలోకూడా పర్షియాయొక్క

కళా సంప్రదాయములున్నూ, జీవనమున్నూ ఏవిధముగా సాగిపోయి నవో చూపుటకొరకే చెప్పితిని. తూర్పునుండి తురుష్కుల తెగలు ఒకదానివెనుక ఒకటి వచ్చినవి. ఆనాడు బొఖారానుండి ఈరాకువరకూ వ్యాపించియున్న పర్షియా, అరేబియాల మిశ్రమ నాగరికతకు ఈ తెగల వారు లొంగిపోయిరి. పర్షియాకు దూరముగానున్న ఆసియా మైనరు చేరిన తురుష్కులు మాత్రము తమ ఆచార పద్ధతులను నిలుపుకొనిరి. అరబ్బీ సంస్కృతికి వారు లొంగిపోలేదు. ఆసియా మైనరును వారు సొంత దేశమైన తురుష్క స్థానమువలె చేసుకొనిరి. కాని పర్షియా లోనూ, దానికి సమీపమందున్న దేశములలోనూ ఇరానియన్ సంస్కృతి ప్రబలముగా నుండుటచే వారు దాని నంగీకరించి దాని కనుగుణముగా మారిరి. అనేక తురుష్క రాజవంశములచ్చట రాజ్యము చేసినవి. వారి పరిపాలనములందెల్ల పర్షియన్ కళా సారస్వతములు వర్ధిల్లెను. గజనీ నేలిన సుల్తాన్ మహమ్మదు కాలమునందున్న పర్షియన్ కవియగు ఫిర్దౌసిని గురించి నీకు చెప్పియుంటిని. మహమ్మదు కోరికపైని అత డొక పర్షియన్ జాతీయ మహా కావ్యమును రచించెను. దానిపేరు షానామా. అందు వర్ణింపబడిన విషయములు ఇస్లాం రాకకు పూర్వమం దున్న కాలమునకు సంబంధించినవి. అందలి మహా నాయకుడు రుస్తాం. దీనినిబట్టి పర్షియన్ కళా సారస్వతములు ప్రాచీన సంప్రదాయములతో దగ్గిర సంబంధము కలిగియున్నవని మనము తెలిసికొనవచ్చును. అనేక పర్షియన్ చిత్రములకును లఘు చిత్రములకును (Miniatures) విషయ ములు షానామా కథలనుండియే గైకొన బడినవి.

ఫిర్దౌసి మొదటి శతాబ్దాంతమున ఉండెను. అతని తరువాత ఒమారు ఖయ్యాం వచ్చెను. పర్షియా దేశమందలి నిషాపూర్‌లో అతని కాపురము. అతడు కవియును జ్యోతిశ్శాస్త్రజ్ఞుడును. పర్షియన్ భాషలో వలెనే ఇంగ్లీషులోకూడా అతని పేరు ప్రసిద్ధి వహించెను. ఒమార్ తరువాత షిరాజ్ కాపురస్థుడైన షేక్ సాదీ వచ్చెను. పర్షియన్ అగ్ర

గణ్యులలో ఒకడితడు. ఇతడు వ్రాసిన గులిస్తాన్, బూస్తాన్ అనే గ్రంథములు కొన్ని తరముల కాలముపాటు ఇండియన్ మక్తాబులలో (స్వదేశీ బడులలో) బడి పిల్లలు కంఠస్థము చేసేవారు.

మహా పురుషుల పేళ్లు కొద్దిగానే నేను పేర్కొంటిని. పెద్దపేళ్ల జాబితాలు వ్రాయడంలో అర్థములేదు. ఈ శతాబ్దుల పొడుగునా, పర్షియా మొదలు మధ్య ఆసియాలోని ట్రాంసాగ్జియానా వరకూ పర్షియన్ కళా సంస్కృతుల జ్యోతి చక్కగా వెలుగుచుండెనని నీవు గ్రహించవలెను. ట్రాంసాగ్జియానాలోని బొఖారా, బాఖ్ మహా నగరములు కళా సంస్కృతి కేంద్రములుగా పర్షియా నగరములవలెనే తులతూగుచుండెను. పదవ శతాబ్దాంతమున బొఖారాలో, సుప్రసిద్ధ తత్త్వవేత్తయైన ఇబిన్‌సినా (అవిసెన్న) జన్మించెను. 200 సంవత్సరముల తరువాత బాఖ్ నగరమున మరియొక గొప్ప పర్షియన్ కవి జన్మించెను. అతడు జలాలుద్దీన్ రూమి. ఇతడొక గొప్ప గూఢ మతవాది. "నృత్యము చేయు ఫకీరులు" అనే మతసంఘము నీతడు స్థాపించెను.

యుద్ధములు జరుగుచున్నా రాజకీయ పరివర్తనములు జరుగుచున్నా పర్షియా, అరేబియాల కళా సంస్కృతుల సంప్రదాయము సాగుచునే ఉండెను. దాని ప్రభావమున వాఙ్మయమున ఉత్తమ కావ్యములూ, చిత్రకలలో గొప్ప చిత్తరువులూ, వాస్తువున ఉత్కృష్ట భవనములూ అనేకము తలయెత్తినవి, తరువాత విచ్ఛిత్తి కలిగినది. 13 వ శతాబ్దిలో (1220 ప్రాంతమున) చెంగిజ్‌ఖాన్ దిగివచ్చి ఖ్వారిజం, ఇరానులను నాశము చేసెను. కొద్ది సంవత్సరముల పిమ్మట హులగు అనువాడు బాగ్దాదును నాశము చేసెను. ఈ విధముగా ఎన్నో శతాబ్దులనుంచి పేరు కొంటున్న మహా సంస్కృతి తుడిచిపెట్టుకుపోయింది. వెనుక ఒక జాబులో మంగోలులు మధ్య ఆసియాను ఎడారిగా మార్చిన సంగతి వ్రాశాను. అందుచే అందలి మహా నగరములను ప్రజలు వదలిపెట్టగా అవి నిర్మానుష్యములైనవి అనికూడా వ్రాసి ఉంటిని.

ఈ ఉపద్రవమునుంచి మధ్య ఆసియా పూర్తిగా కోలుకోనేలేదు; ఇంతవరకైనా అది కోలుకొనుట ఆశ్చర్యకరమగు విషయము. చెంగిజ్ ఖాన్ మరణానంతరము అతని విశాల సామ్రాజ్యము చీలిపోయిందన్న మాట జ్ఞాపకమున్నదా? పర్షియాలోనూ, చుట్టుపట్టులా ఉన్న సామ్రాజ్య భాగము "హులగు"కు సంక్రమించింది. ఇతడు తనివితీరా వినాశనము చేయగలిగినదంతా చేసిన పిమ్మట శాంతికాముడు, సహనశీలుడు అయి దేశమును పరిపాలించి "ఇల్ఖానుల" రాజవంశమునకు ఆదిపురుషుడయ్యెను. కొంత కాలము వరకూ ఈ "ఇల్ఖానులు" మంగోలుల ప్రాచీన మతమగు "షైక్" మతమునే అవలంబించియుండిరి. పిమ్మట వారు ఇస్లాం మతమును స్వీకరించిరి. మతాంతరులగుటకు ముందూ, వెనుకా కూడా వారు అన్యమత సహనము చూపుచుండిరి. చీనాలోనున్న వారి దాయాదులు—గొప్ప ఖానున్నూ, అతని కుటుంబమున్నూ—బౌద్ధులు. వీరితో వారు సఖ్యభావముతో నుండిరి. చీనానుండి వధువులనుకూడ వివాహమునకై వారు తెప్పించుకొనుచుండిరి.

పర్షియా, చీనా దేశములలోనున్న ఈ రెండు మంగోలు శాఖలకూ గల ఈ అన్యోన్య సంబంధము కారణముగా కళలో మార్పులుకలిగెను. చీనాదేశ కళా సంప్రదాయములు పర్షియాకు ప్రాకెను. ఆనాటి చిత్తరువులలో అరబ్బీ, పర్షియన్, చీనా సంప్రదాయములు మిశితమై కనవచ్చుచుండెను. ఎన్ని ఉపద్రవములు సంభవించినా పర్షియన్ సంప్రదాయము మాత్రము నిలిచియే ఉండెను. 14 వ శతాబ్ది మధ్యమున మరో గొప్ప కవి—హాఫీజ్ అనువాడు పర్షియాలో ఉదయించెను. ఇండియాలోసైతమతని గ్రంథము లిప్పటికిని అభిమానముతో చదువుచుందురు.

మంగోలు ఇల్ ఖానుల రాజవంశము చిరకాలము నిలువలేదు. ట్రాన్సోక్సియానాలోని సమర ఖండమునుంచి మహా వీరుడగు తైమూరు వచ్చి, పోగా మిగిలినవారి రాజ్యములను ధ్వంసము చేసెను. క్రూరుడు, పశుప్రాయుడు అగు ఇతనిని గురించి ఇదివరలో నీకు వ్రాసియుంటిని.

విశేషమేమనగా ఇతడు లలితకళా పోషకుడు; విద్వాంసుడు. మహా నగరములగు ఢిల్లీ, షిరాజ్, బాగ్దాదు, డమస్కసు మున్నగువాటిని కొల్లగొట్టి అందలి అమూల్య వస్తువులను తీసుకొనిపోయి వాటితో తన రాజధానియగు సమర ఖండము నలంకరించుకొన్నాడితడు. ఇతని కళాభిమానము ఈ విధముగా పరిణమించింది. సమరఖండములో అద్భుతావహమగు గొప్ప కట్టడము గుల్ అమీరు అను తైమూరు సమాధి. అతనికా సమాధి కట్టడము తగినదే. అతని గాంభీర్య వైఖరీ, అతని శక్తీ, అతని క్రౌర్యమూ దాని స్వరూపమున కొంత గోచరించుచుండెను.

తైమూరు మరణానంతరము అతడు జయించిన విశాల భూభాగములు అతని సామ్రాజ్యమునుండి తప్పించుకొనెను. కాని కొద్ది భూభాగము మాత్రము—ట్రానోక్సియానా, పర్షియాలతో సహా—అతని తరుహత వచ్చిన పాలకులకు దక్కెను. 100 సంవత్సరముల కాలము అనగా 15వ శతాబ్ది అంతా ఈ "తైమూరిదులు" ఇరాన్, హీరట్, బోఖారాలను పరిపాలించిరి. వింత విషయమేమనగా క్రూరుడగు తైమూరు సంతతి వారైన వీరు ఉదారులు, దయామయులు, కళాపోషకులు అని పేరు సంపాదించిరి. తైమూరు పుత్రుడగు షామఖ్ వారిలో ఉత్తముడు. హీరట్‌లో అతడొక మహా గ్రంధాలయమును స్థాపించెను. హీరట్ అతని రాజధాని. విద్యావంతు లనేకు లీ గ్రంథాలయమునకు వచ్చుచుండెడివారు.

తైమూరిదులేలిన 100 సంవత్సరములకాలమూ కళా సారస్వతోద్యమములకు ప్రసిద్ధిగాంచెను. అందువల్లనే దానికి "తైమూరిదు పునరుజ్జీవన కాలము" అని పేరువచ్చినది. అప్పుడు పర్షియన్ సారస్వతమెంతో వృద్ధిజెందెను. చక్కని చిత్తరువులనేకము చిత్రించబడ్డవి. "బిజాద్" అను సుప్రసిద్ధ చిత్రకారు డొకడు ఒక నూతన చిత్రకళా సంప్రదాయమును నడిపించెను. తైమూరిదు విద్యావంతులు పర్షియన్ సారస్వతమునేగాక తురుష్క సారస్వతమును కూడా పోషించిరి. ఈ

కాలమునందే ఇటలీలో పునరుజ్జీవనము జరిగినదన్నమాట మరచిపోవద్దు.

తైమూరిదులు తురుష్కులు. కాని వారు పర్షియన్ సంస్కృతికి దాసులైరి. తురుష్కుల యొక్కయు, మంగోలుల యొక్కయు అధికారమున ఇరాన్ ఉన్నప్పటికీ దాని సంస్కృతి మాత్రము విజేతలను వశము చేసుకొన్నది. రాజకీయముగా స్వాతంత్ర్యము సంపాదించుటకు కూడా పర్షియా కృషి చేసింది. క్రమేణా తైమూరిదులు తూర్పుకు తరమగొట్టబడిరి. వారి అధికారము సన్నగిల్లెను. ట్రాన్సాగ్జియానా ప్రాంతము మాత్రము వారి వశములో నిలిచెను. పదహారవ శతాబ్ది ప్రారంభమున ఇరానియన్ జాతీయత విజయము సాధించెను. తైమూరిదులు పర్షియాను వదలిపోయిరి. తరువాత "సఫావీ" లేదా "సఫావిదుల" జాతీయ రాజవంశములోని రెండవ పురుషుడగు తామస్పు I అనువాడు షేర్ ఖాన్‌కు ఓడి, ఇండియానుండి పారిపోయి వచ్చిన హుమయూనుకు శరణిచ్చెను.

సఫావీల రాజ్యకాలము 1502 నుండి 1722 వరకూ 220 సంవరముల కాలముపాటు జరిగెను. పర్షియన్ కళకు స్వర్ణయుగమీ కాలమందురు. రాజధానియగు ఇస్ఫహాన్ దివ్య భవనములతో నిండియుండెను. అది ప్రసిద్ధికెక్కెను. 1587 నుండి 1629 వరకూ రాజ్యమేలిన షా అబ్బాస్ ఈ రాజ వంశమున ప్రముఖుడగు రాజు. పర్షియన్ రాజులందరికంటె ఇతడే గొప్పవాడు. ఒకతట్టున "ఉజ్ బెగు" లను వారును వేరొక తట్టున ఆటోమన్ తురుష్కులను అతనిని చుట్టియుండిరి. వారిని ఉభయులనూ అతడు తరిమివేసి రాజ్యమును సుస్థిరము చేసికొనెను. పడమట ఇతర చోట్లనున్న దూర రాజ్యములతో అతడు మైత్రి సంపాదించెను. తన రాజధానిని అలంకరించుటకు పూనుకొనెను. ఇస్ఫహార్ నగర విషయమున షా అబ్బాస్ అవలంబించిన నగర నిర్మాణ పద్ధతి సాంప్రదాయికముగానూ, దోష రహితముగానూ, సురుచిరముగానూ, ఉత్కృష్టముగానూ ఉన్నదని చెప్పుదురు. అందు నిర్మించిన భవనములు స్వతసిద్ధముగా, అందముగా ఉండెను. చక్కని

అలంకారములతో శోభిల్లుచుండెను. అంతేకాదు. వాటి ఉనికి వాటి అందమును ఇనుమడింపజేసెను. ఆకాలమున పర్షియాను దర్శించిన యూరోపియన్ యాత్రికులు దానిని అతిగా ప్రశంసించిరి.

శిల్పము. సారస్వతము, కుడ్య చిత్రములు, లఘు చిత్రములు, అందమగు తివాసీలు, చక్కని మట్టి (లేదా పింగాణీ) పూదిరులు, చిత్రవర్ణపు పనులు—ఇవి అన్నియు ఈ బంగారు కాలమున వర్థిల్లెను. కొన్ని కుడ్యచిత్రములూ, లఘుచిత్రములూ ఎంతో అందముగాఉండెను. ఒక జాతి పొలిమేరల మధ్యనే కళ వృద్ధిచెందదు. అట్లు వృద్ధి చెందనూ కూడదు. పదహారు, పదిహేడు శతాబ్దులలో కానవచ్చు పర్షియన్ కళా వికాసమునకు అనేక అన్య సంప్రదాయములు దోహదమిచ్చినవి. ఇటాలియన్ సంప్రదాయము ప్రత్యక్షముగా కనవచ్చుచున్నదని చెప్పుదురు. కాని ఇరాన్ యొక్క ప్రాచీన కళా సంప్రదాయము వీటి అన్నిటి వెనుకా పొడగట్టుతూన్నది. 2000 సంవత్సరములనుంచి అది అవిచ్ఛిన్నముగా వస్తూనే ఉన్నది. ఇరానియన్ సంస్కృతి ప్రభావము ఒక పర్షియాలో మాత్రమే నిలిచిపోలేదు. పడమర టర్కీ మొదలుకొని తూర్పున ఇండియావరకూ అది విశాల భూభాగముపై ప్రసరించింది. ఇండియాలో మొగలు కొలువు కూటములలో పర్షియన్ భాష సంస్కారుల భాషయై ఉండెను. యూరోపులో ఫ్రెంచి ఇదివరలో ఉండే మాదిరిగానే పడమటి ఆసియాలో పర్షియన్ భాష సామాన్యముగా సంస్కారుల భాషయై ఉండెను. పర్షియన్ కళయొక్క అమర చిహ్నము ఆగ్రాలోని తాజ్ మహల్‌లో కానవచ్చును. ఈవిధముగానే ఈ పర్షియన్ కళ, పడమట కాన్స్టాంటి నోపిల్ వరకూ గల అటోమన్ వాస్తుపై తన ప్రభావమును చూపెను. పర్షియన్ కళా ప్రభావమునకు గుర్తుగా అచ్చట అనేక ప్రసిద్ధ భవనములు లేచెను.

పర్షియాలోని సఫావీలు ఇంచుమించు ఇండియాలోని గొప్ప మొగలుల సమకాలికులు. ఇండియన్ మొగలులలో ప్రథముడైన బాబరు

సమర ఖండ మందలి తైమూరిదు రాజులలో ఒక్కడు. పర్షియనులు శక్తివంతులై తైమూరిదులను తరిమివేసిరి. టాన్సోక్సియానాలో కొన్ని భాగములును, ఆఫ్ఘని స్థానమును మాత్రమే కొందరు తైమురిదు రాజుల పాలనమందుండెను. ఈ చిన్న రాజులతో, పన్నెండవ యేడు వయస్సు వచ్చినది మొదలుకొని బాబరు పోరాడవలసి వచ్చినది. తుద కతడు జయించి, కాబూలుకు రాజై, పిమ్మట ఇండియాకు వచ్చెను. ఆనాటి తైమూరిదుల సంస్కృతి బాబరు వ్రాసికొన్న 'ఆత్మచరిత్ర'నుబట్టి మనము గ్రహించవచ్చును. వెనుక ఒక జాబులో అందుండు కొన్ని వాక్యములు నేను వ్రాసిఉంటిని. సఫావి రాజులలో గొప్పవాడైన షా అబ్బాస్, అక్బరు, జహంగీరుల సమకాలికుడు. ఈ రెండు దేశములకూ మొదటినుండియు దగ్గిర సంబంధముండియుండవలెను. చిరకాలము పాటు ఈ రెండు దేశములకూ పొలిమేర ఒక్కటే—అప్పుడు ఆఫ్ఘని స్థానము మొగల్ సామ్రాజ్య భాగమై ఉండెను.

## 125

# పర్షియాలో సామ్రాజ్య తత్వమూ, జాతీయతా

జనవరి 21, 1933

నామీద నీకు కోపంగా ఉండడము న్యాయమే. చరిత్ర పథముల గుండా ముందుకూ, వెనకకూ పరుగెత్తుచూ నేను నీకు కావలసినంత ఆగ్రహం కలిగించి ఉంటాను. వివిధ మార్గములగుండా పందొమ్మిదో శతాబ్ది చేరిన పిమ్మట నేను నిన్ను ఉన్నట్లుండి కొన్ని వేల సంవత్సరముల కాలము వెనుకకు తీసుకుపోతిని. ఈజిప్టునుండి ఇండియాకూ, చీనాకూ, పర్షియాకూ దుముకుతూ పోతిని. ఇది నీకు కష్టంగా ఉండవచ్చు. గందరగోళంగా ఉండవచ్చు. నీవు పలికే అసమ్మతి వాక్యాలు

నాకు వినవస్తున్నవి. కాని నేను చెప్పగలిగిన సదుత్తరమేమీ లేదు. రెనీ గ్రోసెట్ వ్రాసిన గ్రంథములు చదువుటవల్ల నా ఆలోచనలు పరి పరి విధాలుగా ప్రసరించినవి. నా ఆలోచనలను కొన్నిటిని నీతో పంచుకోక తప్పిందికాదు. ఈ నా జాబులలో పర్షియా చరిత్ర ఉపేక్షించినట్లుకూడా నేను భావించాను. ఈ లోపమును సవరించుకోవలెనని నాకు తోచింది. ఇప్పుడు పర్షియాను గురించి విచారిస్తున్నాము. కాబట్టి దాని చరిత్రను నేటి కాలమువరకూ పరామర్శింతము.

పర్షియన్ సంస్కృతికీ, పర్షియన్ కళ వికసించిన బంగారు కాలముకూ సంబంధించిన ప్రాచీన సంప్రదాయములను గురించీ, అవి సాధించిన కార్యములను గురించీ, ఇంకా ఇతర విషయములనుగురించీ నేను వ్రాసి ఉన్నాను. పై వాక్యాలు విమర్శించి చూస్తే అవి అలంకార భూయిష్టముగానూ, కొంత సందిగ్ధముగానూ కనబడు తున్నవి. పై మాటలను బట్టి పర్షియా ప్రజలకు నిజముగా బంగారు కాలము వచ్చిన దనీ, వారు కట్టు కథలలోని పురుషులవలె సుఖంగా జీవించారనీ అను కోవచ్చు. కాని అట్లా జరగలేదు. సంస్కృతీ, కళా ఆ రోజులలో, చాలామట్టుకు ఈ రోజులలోకూడా, పరిమిత ప్రజల హస్తగతమైఉండెను. ప్రజా సామాన్యమునకు, అనగా సామాన్య మానవునకు వాటితో సంబం ధము లేదు. వెనుకటి కాలమునుంచీకూడా సామాన్య ప్రజలు కూటికీ, జీవితావసరములకూ నిత్యమూ పాటుపడుతూ ఉండవలసిన వారే. వారి జీవితమునకునూ, మృగముల జీవితమునకునూ అట్టే తేడా లేదు. ఇక వారికి దేనికీ తీరికలేదు. చాలినన్ని కష్టములు వారికున్నవి. ఇక కళా సంస్కృతులంటే వారికేమి కావలెను? వాటిని వారెట్లు మెచ్చుకోగలరు? రాజ సభలకును, భాగ్యవంతులకును, పనిపాటలు లేనివారికిని వినోదము కల్పించుటకై చిత్రకళ పర్షియా, ఇండియా, చీనా, ఇటాలీ, ఇతర యూరోపియన్ దేశములలో వర్ధిల్లెను. మతమునకు సంబంధించిన కళ మాత్రము కొంతవరకు సామాన్య ప్రజల జీవితముల స్పృశించినది.

కళాన్వితమగు రాజసభనుబట్టి దేశములో సుపరిపాలనమున్నదని అనుకొనుటకు వీలులేదు. సాహిత్యకళా పోషకులమని గర్వించేరాజులు తరుచు అసమర్థులు, క్రూరులుగా ఉండెరి. ఆనాటి పర్షియాలో సంఘ విధానమంతా, ఇతరదేశములనేకము లందువలెనే, ఫ్యూడల్ విధానముపై దాదాపు జరుగుచుండెను. ఫ్యూడల్ ప్రభువులు బలాత్కారముగాజేయు చిల్లర వసూళ్ళను అరికట్టిన బలయుతులగు రాజులు మాత్రమే ప్రజా మోదమును బడయు చుండిరి. సుపరిపాలనము కొన్నాళ్ళూ, అమిత దుష్పరిపాలనము కొన్నాళ్ళూ ఒకటి విడిచి ఒకటి జరుగు చుండెను.

ఇండియాలో మొగలు ప్రభుత్వము అవసానదశయందున్నప్పుడే సఫావి రాజవంశము 1725 ప్రాంతమున అంతరించెను. ఈ రాజవంశ మునకు శక్తి సన్నగిల్లెను. దాని ప్రయోజనము తీరిపోయెను. ఫ్యూడల్ విధానము క్రమ క్రమముగా విచ్ఛిత్తి అగుచుండెను. దేశములో ఆర్థిక ముగా మార్పులు సంభవించుచుండెను. పాత పరిస్థితులు తారుమారగు చుండెను. పన్నులు హెచ్చగుటవల్ల ప్రజలలో అసంతుష్టి ప్రబలెను. ఆఫ్ఘను లప్పుడు సఫావీల అధికారములో ఉండిరి. వారు తిరుగబడిరి. తమ దేశమును వారు స్వాధీనము చేసుకొనిరి. అంతేకాదు. రాజధాని యగు ఇస్ఫహాన్ నగరమునుకూడా వారు స్వాధీనము చేసుకొని షాను పదభ్రష్టుని చేసిరి. కొద్ది కాలములోనే పర్షియన్ నాయకుడగు నాదిర్‌షా ఆఫ్ఘనులను తరిమివేసెను. పిమ్మట అతడే కిరీటమును ధరించెను. మొగలుల అవసానదశలో ఇండియాపై దాడి నడిపించి, ఢిల్లీ ప్రజలను హత్యచేసి, షాజహాన్ మయూర సింహాసనముతోపాటు అమిత ధన మును తీసుకుపోయిన వాడీ నాదిర్షాయే. 18 వ శతాబ్దిలో పర్షియన్ చరిత్ర అంతఃకలహములతో, వివిధ పరిపాలనలతో, దుష్టపరిపాలనలతో దుఃఖకరముగా ఉండెను.

19 వ శతాబ్దిని కొత్త చిక్కులు సంభవించెను. విస్తరిస్తూన్న యూరోపుయొక్క సామ్రాజ్య పద్ధతిని పర్షియా ప్రతిఘటించవలసి

వచ్చింది. ఉత్తరమునుంచి రష్యా నిరంతరమూ ఒత్తిడిచేయుచుండెను. పర్షియన్ సింధుశాఖనుంచి బ్రిటిషువారు ముందుకు చొచ్చుకొని పోవు చుండిరి. పర్షియా ఇండియాకు దూరములో లేదు. ఆ దేశముల పొలి మేరలు క్రమేణా ఒకదాని నొకటి సమీపించు చుండెను. నేడు ఆ రెండు దేశములకునూ ఒకే పొలిమేర ఉన్నది. ఇండియాకు నేరుగా వచ్చే మార్గములో పర్షియా ఉన్నది. ఇండియాకు పోయే సముద్ర మార్గము పర్షియాకు సమీపమున ఉన్నది. ఇండియన్ సామ్రాజ్యమును, దానికి పోవు మార్గములను సంరక్షించుటయే బ్రిటిషు రాజనీతి ప్రధానముగా యెంచుచుండెను. బ్రిటిషువారి ప్రతిస్పర్ధియైన రష్యా ఈ మార్గమును స్వాధీనము చేసికొని ఇండియాపై కన్ను వేయుట వారికెంతమాత్రము ఇష్టములేదు. కావుననే బ్రిటిషువారును, రష్యనులును పర్షియా వ్యవహార ములను అధిక ఆసక్తితో గమనించుచు దానిని పీడించుచుండిరి. షాలు పూర్తిగా అసమర్థులు, మూర్ఖులు. తమ ప్రజలతో పోరాటములు పెట్టు కొనియు, తరుణము కానప్పుడు బ్రిటన్, రష్యాలతో పోరాటములు పెట్టు కొనియు సామాన్యముగా వారి చేతులలో చిక్కుకొను చుండిరి. రష్యా గాని, ఇంగ్లాండుగాని పర్షియాను పూర్తిగా ఆక్రమించి యుండేది; లేదా దానిని తన రాజ్యములో కలుపుకొని ఈజిప్టువలె రక్షిత రాజ్యముగా చేసేది. ఇట్లు జరుగకుండుటకు ఈ రెండు రాజ్యముల పరస్పర స్పర్ధయే కారణము.

20 వ శతాబ్ది ప్రారంభమున, వేరొక కారణమువల్ల పర్షియా ఇతర దేశముల తృష్ణకు పాత్రమైనది. పెట్రోలియము చాలా విలువగల నూనె. పర్షియాలో అది కనిపెట్టబడినది. పర్షియాలోని నూనె గనులను 60 సంవత్సరములు నడిపించుకొని లాభము పొందగలందులకు బ్రిటిషు పౌరుడైన డా ఆర్సీ అను వానికి, 1901 లో, షా అనుకూలమగు షర తులను ఇవ్వవలసి వచ్చెను. కొన్ని సంవత్సరములైన తర్వాత ఆంగ్లో పర్షియన్ ఆయిల్ కంపెనీ అను పేర ఒక బ్రిటిషు కంపెనీ, ఈ నూనె


రష్యా
బాల్ఖాష్ సరస్సు
కాస్పియన్ సముద్రము
చైనీసు
తాష్కెంటు
సమరఖండము
పామీరులు
టెహరాన్
పర్షియా
ఇస్పహాన్
ఆఫ్ఘనిస్థానము
కాశ్మీరము
సింధు నది
రష్యా : పర్షియా
19 వ శతాబ్దిలో
మధ్యఆసియాలో
రష్యనుల ఆక్రమణ

గనులను నడుపుటకై. స్థాపింపబడెను. నాటినుండియు ఆకంపెనీ అచ్చట పనిచేయుచుండెను. ఈ నూనె వ్యాపారములో అది అమిత లాభములను తీసెను. లాభములో కొద్ది భాగము పర్షియన్ ప్రభుత్వమునకుపోవును. అధిక భాగము కంపెనీ వాటాదార్లకు, దేశమునుదాటి, పోవుచుండెను. వాటాదార్లలో అందరికన్న పెద్ద వాటాదారు బ్రిటిషు ప్రభుత్వము. నేటి పర్షియా ప్రభుత్వము జాతీయ ప్రభుత్వము. పరదేశస్థులు తమదేశము నుండి లాభములు కొనిపోవుట వారికిష్టము లేదు. 1901 లో డా ఆర్సీతో చేసికొన్న 60 ఏండ్ల ఒడంబడికను వారు రద్దు చేసిరి. ఈ ఒడంబడిక ననుసరించే ఆంగ్లో పర్షియన్ ఆయిల్ కంపెనీ పనిచేయుచుండెను. బ్రిటిషు ప్రభుత్వము వారికి కోపము వచ్చెను. పర్షియా ప్రభుత్వమును వారు బెదరించవలెనని ప్రయత్నించిరి. కాని రోజులు మారినవన్న మాట వారు మరిచారు. ఆసియా ప్రజలను బెదరించుట వెనుకటివలె ఇప్పుడు సులభముకాదు. ఇరాన్ ప్రభుత్వమునకు వెనుకటికన్న అధికముగా, అనుకూలముగా ఉండు ఒక క్రొత్త ఒడంబడికను బ్రిటిషు ప్రభుత్వమున్ను, ఆయిల్ కంపెనీయున్నూ చివరకు చేసుకోవలసి వచ్చెను.

కాని ముందు ముందు చెప్పవలసిన విషయములను ఇప్పుడే చెప్పుతున్నాను. సామ్రాజ్య వాదము పర్షియాను బెదిరించెను. ఆనాటికానాడు షా దాని చేతిలో కీలుబొమ్మ అయ్యెను. దానిని పురస్కరించుకొని తప్పనిసరిగా జాతీయత తలయెత్తెను. జాతీయపక్షము తయారయ్యెను. ఈ పక్షము వారు తమ దేశ వ్యవహారములలో పరదేశులు కలగజేసికొనుటకు ఇష్టపడలేదు. అంతేకాదు. షా నిరంకుశత్వమునుకూడ వారు గర్హించిరి. ప్రజాస్వామిక సిద్ధాంతములపై ఆధారపడ్డ రాజ్యాంగ వ్యవస్థను, క్రొత్త సంస్కరణములను ప్రవేశపెట్టమని వారు కోరిరి. దేశము దుష్పరిపాలనము పాలైనది. పన్నులా తలమునకలుగా ఉండెను. బ్రిటిషువారును, రష్యనులును తరుచు కలుగజేసికొను చుండిరి. అభివృద్ధికి ప్రతికూలుడగు షా ఈ పరదేశ ప్రభుత్వములన్న ఇష్టపడుతూ,

కొంత స్వాతంత్ర్యమును గోరు తన ప్రజలన్న కష్టపడుతూ ఉండెను. ప్రజాస్వామిక ప్రభుత్వము కావలెనని కోరినవారు ముఖ్యముగా, కొత్తగా వచ్చిన మధ్య తరగతి ప్రజలునూ, విద్యావంతులునూ. 1904 లో జార్ల క్రిందనున్న రష్యాను జపాను ఓడించెను. జపాను విజయము పర్షియన్ జాతీయ వాదుల నుత్సాహ పూరితులను చేసెను. ఇందుకు కారణము—యూరోపియన్ జాతిపై ఒక ఆసియాజాతి సాధించిన విజయ మిది. అంతేగాక తమ ఇరుగుపొరుగున ఉండి తమ్ము బాధిస్తూఉన్న జార్ల రష్యాపై సాధించిన విజయమిది. 1905 లో తలయెత్తిన రష్యను విప్లవము విఫలమైనది. క్రూరముగా అణచివేయబడినది. అయినా ఇది పర్షియన్ జాతీయ వాదుల ఉత్సాహమును ఇనుమడింప చెయ్యడమే కాకుండా కార్యరంగమునకు దిగవలెననే కోరిక వారిలో పుట్టించెను. షాపై తెచ్చిన ఒత్తిడి బలీయమగుటవల్ల 1906 లో ప్రజాస్వామిక రాజ్యాంగవ్యవస్థ స్థాపించడానికెట్లాగో అతడు సమ్మతించాడు. "మెజ్లీస్" అను పేరుతో జాతీయసభ స్థాపించబడింది. పర్షియన్ విప్లవమునకు విజయము చేకూరినట్లే కనిపించింది.

కాని ముందున్నవి ముసుళ్ళ పండుగులు. తన వ్యక్తిత్వాన్ని చంపుకోడం షాకు ఇష్టంలేదు. ప్రజాస్వామిక పర్షియా, ముందుముందు బలీయమై పక్కలో బల్లెమౌతుందనే కారణమువల్ల రష్యనులూ, బ్రిటిష వారూ దానిని ఆమోదించలేదు. షాకునూ, మెజ్లీసుకునూ పోరాటము తటస్థించెను. తన సొంత పార్లమెంటునే షా ముట్టడించెను. కాని సైన్యములు మెజ్లీసు పక్షముననూ, జాతీయవాదుల పక్షముననూ ఉండెను. రష్యను సైన్యములు షాను రక్షించవలసి వచ్చెను. ఏదో ఒక సాకుపెట్టి—ప్రజలను రక్షించడమనేదే సామాన్యముగా పెట్టుకొనే సాకు—రష్యా, ఇంగ్లాండులు తమ సైన్యములను తెచ్చి పర్షియాలో నిలిపిరి. భయంకరులగు కోసక్కులను రష్యావారు తెచ్చిరి. పర్షియను లను భయపెట్టుటకు ఇండియన్ సైన్యములను బ్రిటిషువారు ఉపయో

గించిరి. వాస్తవముకు మనకూ, పర్షియనులకూ ఎట్టి విరోధమూ లేదు.

పర్షియా పెద్ద కష్టములలో చిక్కుకొనెను. దానికి ధనము లేదు. ప్రజలు దురవస్థలో ఉండిరి. పరిస్థితులను చక్కజేయుటకు మెజ్లీసు సభ ఎంతో ప్రయత్నించెను. కాని దాని ప్రయత్నములు, రష్యనులు, బ్రిటిషువారు కలిసిగాని, ప్రత్యేకముగాగాని ప్రతిఘటించుటచేత, నిష్ఫలమాయెను. చివరకు వారు అమెరికా సహాయ మాసించిరి. రాజ్యాదాయమును చక్కజేయుటకై ఒక అమెరికన్ నిపుణుని వారు ఉద్యోగిగా ఏర్పరిచిరి. ఇతని పేరు మోర్గన్ షూస్టర్. ఇతడు రాజ్యాదాయము చక్కజేయుటకు శాయశక్తులా ప్రయత్నించెను. కాని ఎటుచూచినా రష్యన్, బ్రిటిషువారి ప్రతిఘటన అతని కెదురు తగిలెను. విసిగిపోయి, నిరుత్సాహముచెంది అతడు ఇంటికిపోయెను. తరువాత షూస్టరొక గ్రంథమును వ్రాసెను. రష్యన్, బ్రిటిషు సామ్రాజ్యతత్వము పర్షియా ప్రాణములెట్లు తీయుచున్నవో అతడందు వర్ణించెను. ఆ గ్రంథము పేరు "స్ట్రగ్లింగ్ ఆఫ్ పర్షియా".

స్వతంత్ర రాజ్యముగా నిలుచుటకు పర్షియా నోచుకొన్నట్లు తోచదు. ఇంగ్లాండు, రష్యాలు పర్షియాను "పలుకుబడి ప్రదేశములు"గా విభాగించి, పంచుకొని దాని స్వాతంత్ర్యమునకు భంగపాటు తెచ్చారు. వారి సైనికులు ముఖ్య కేంద్రములను స్వాధీనము చేసుకొన్నారు. ఒక బ్రిటిష్ కంపెనీ పెట్రోలియం ఉత్పత్తి స్థానముల తన వశము చేసికొని లాభములనందుచుండెను. పర్షియా పరమ దౌర్భాగ్యస్థితిలో ఉండెను. ఒక విదేశజాతి ఆ దేశమును పూర్తిగా స్వాధీనము చేసుకొన్నా బాగుండేది. ఇందువల్ల కొంత బాధ్యత వారికుండేది. పిమ్మట 1914 లో ప్రపంచ యుద్ధము ప్రకటింపబడింది.

ఈ యుద్ధంలో పర్షియా తన తాటస్థ్యమును ప్రకటించింది. కాని దుర్బలుల ప్రకటనలు బలవంతులపై పనిచెయ్యవుకదా! పర్షియా తాటస్థ్యమును అందరును ఉపేక్షించిరి. పరదేశ సైన్యములు పర్షియాలో

పోరాడుచుండెను. పర్షియా ప్రభుత్వము ఈ విషయమై ఏమనుకొన్నా వారికి లెక్కలేదు. పర్షియా చుట్టూ ఉన్న దేశములు యుద్ధములో తగుల్కొన్నవే. ఇంగ్లాండు, రష్యాలు మిత్రత్వముతో ఒక పక్షమున ఉండిరి. తురుష్కస్థానము—అప్పుడు దానిలో ఈరాకు, అరేబియాలు కూడా కలిసి ఉండెను—జర్మనీతో మైత్రి వహించియుండెను. 1918 లో యుద్ధము ముగిసినది. ఇంగ్లాండుకు, ఫ్రాంసుకు, వారి మిత్రులకూ విజయము చేకూరినది. ఆ సమయమున పర్షియా నంతనూ బ్రిటిషు సేనలు ఆక్రమించుకొని ఉండెను. పర్షియాను తన రక్షితరాజ్యముగా ఇంగ్లాండు చేసుకోబోయిందికూడా. రక్షితరాజ్యమనేది మృదువుగా చెప్పేమాట. ఇంగ్లాండు పర్షియాను తన రాజ్యములో కలుపుకోబోయింది. ఇంకా అది కలలు కన్నది. విస్తార మధ్యప్రాచ్య సామ్రాజ్యమును—మధ్యధరా సముద్రము మొదలుకొని బెలూచిస్థానము, ఇండియావరకునూ—స్థాపించవలెననే కల. కాని ఈ కలలు కార్యరూపము నందలేదు. బ్రిటన్ దురదృష్ట వశమున జార్ల రష్యా అంతరించెను. సోవియట్ రష్యా దాని స్థానే వచ్చెను. మరిన్నీ, దరదృష్ట వశాత్తు, తురుష్కస్థానములో తల పెట్టిన దాని సంకల్పములు, భగ్నమాయెను. మిత్రమండలి కోరలలో చిక్కుకొన్న తురుష్కస్థానమును కెమాల్ పాషా బయటికి లాగి రక్షించెను.

ఇది యంతయు పర్షియన్ జాతీయ వాదులకు అనుకూలముగా ఉండెను. నామకః పర్షియా తన స్వాతంత్ర్యమును నిలబెట్టుకో గలిగెను. 1921 లో పర్షియన్ సైనికుడైన రిజాఖాన్ అనువాడు ఒక్కమారు ప్రభుత్వమును వశముచేసుకొని ప్రముఖుడయ్యెను. అతడు సైన్యమును స్వాధీనము చేసుకొని ప్రధానామాత్యుడయ్యెను. 1925లో షా పదభ్రష్టుడయ్యెను. రాజ్యాంగ పరిషత్తు ఓటును పురస్కరించుకొని రిజాఖాన్ కొత్త షాగా ఎన్నుకోబడెను. అతడు రిజాషా పహ్లావీ అనే పేరును, బిరుదును ధరించెను.

రీజాఖాన్, శాంతముగా ప్రజాస్వామిక పద్ధతులవంటి పద్ధతు లవలంబించి సింహాసనము చేజిక్కించుకొనెను. మెజ్లీసు సభ ఇంకను జరుగుచునే ఉండెను. తాను నిరంకుశ ప్రభువునని కొత్త షా భావించు కొనుటలేదు. కాని పర్షియా ప్రభుత్వమును నడిపే సమర్థుడతడే అనుట స్పష్టము. కడచిన కొద్ది సంవత్సరములలో పర్షియా ఎంతగానో మారి నది. దేశమును నేటికాలమున కనుగుణముగా చేయుటకై రిజాషా అనేక సంస్కరణములను ప్రవేశపెట్ట సంకల్పించెను. జాతీయ ప్రబో ధము కారణముగా దేశమున నూతన చైతన్యము ప్రవేశించెను. పర్షి యాలో పరదేశుల వ్యవహారములపట్ల అసహనము చూపే వీర్యవంత మగు జాతీయతగా ఈ ప్రబోధము పరిణమించుచుండెను.

ఈ జాతీయ ప్రబోధము 2000 సంవత్సరములనాటి నిజమగు ఇరానియన్ సంప్రదాయమే అని గుర్తించవలసి ఉన్నది. ఇస్లాం రాకకు ముందున్న ఇరాన్ ఔన్నత్యకాలమునది సంస్మరించి, దానినుండి కొత్త ఆవేశమును పొందప్రయత్నించును. రిజాషా అవలంబించిన "పహ్లావి" అనే పేరు ఒక రాజవంశ నామము. ప్రాచీన కాలమునది జ్ఞప్తికితెచ్చును. పర్షియా ప్రజలు ముస్లిములు--షియా ముస్లిములు అన్నమాట నిజమే. కాని దేశమునకు సంబంధించినంతమట్టుకు జాతీయతయే అంతకన్న బలవత్తరమగు శక్తిగా పనిచేయుచుండెను. ఆసియా దేశమందంతట ఇట్లే జరుగు చుండెను. యూరోపులో, 19 వ శతాబ్దిలో, 100 సంవ త్సరములు ముందుగా ఇట్లే జరిగెను. కాని నేడనేకులచ్చట జాతీయ తను పాతబడ్డ సిద్ధాంతముగా భావించుచున్నారు. ప్రస్తుత పరిస్థితుల కనుగుణముగా నుండు కొత్త నమ్మకములకోసము వారు ఎదురుచూచు చున్నారు.

పర్షియాకు, అధికారులుంచిన నేటి పేరు ఇరాన్. పర్షియా అనే పేరు ఇక ముందు వాడరాదని రిజాషా తీర్మానము చేసెను.

(సమాప్తి.)